## మొన తేలిన శిఖరాలు



గాజు ముక్కల దిబ్బలా కనిపిస్తున్న ఈ వింత కొండ ప్రాంతం మడగాస్కర్ దీవిలో ఓ భాగం. ఏడాదికి సగటున 70 అంగుళాల మేర కురిసే కుండపోత వర్షాల తాకిడికి అక్కడి సున్నపు రాతి ప్రాంతం వేలాది సంవత్సరాలుగా గురి కావడంతో తరిగి తరిగి, నునుపెక్కి ఈ వింత ఆకారం దాల్చింది. వంద అడుగుల ఎత్తులో అడగడుగున సూదిలా మొన తేలిన ఈ శిఖరాలు బ్లేడు కంటే పదునైనవి. ఎలాంటి మందపాటి బూట్లనైనా క్షణంలో పీలికలుగా మారుస్తాయి. వాటిమీద ఒక్క తప్పటడుగు వేసినా శరీరాన్ని నిలువెల్లా చీరేస్తాయి.

**ఈ నెల నవల**

ఆత్మవిశ్వాసంతో సవాళ్లను అధిగమిస్తూ మునుముందుకు సాగిన ఓ మగువ గాథ

# విజేత



వక్కలంక లక్ష్మీ పద్మసుందరి



వైవిధ్య నవలా వేదిక

# చతుర

సంపుటి : 29 | సంచిక : 4
మే : 2006 | 340వ సంచిక



బొమ్మలు: వాసు

రచయితలకు ప్రత్యేకం
కథలు-కబుర్లు (18)

# వాస్తవం ముడి సరుకు మాత్రమే

ఉన్నదున్నట్టుగా, సహజంగా, వాస్తవికంగా రాయటానికే ప్రయత్నిస్తారందరూ. కాని చాలా సార్లు వాస్తవం నిస్సారంగా, అర్థరహితంగా కనిపిస్తుంది... చాలాసార్లు కాదు. ఎప్పుడూ అంతే. అలాంటప్పుడు కథక్కావలసిన వాస్తవికతను ఎవరికి వాళ్ళు సృష్టించుకోక తప్పదు.

"నెక్లెస్" అనే కథ రాశాడు మపాసా. కథా ప్రియులందరూ ఇది చదివే ఉంటారు. ఆధునిక కథా సాహిత్యంలో అత్యంత ప్రాచుర్యం పొందిన కథ ఏదీ అని ఎవరైనా జనాభిప్రాయ సేకరణ చేస్తే ఇది తప్పక మొదటి స్థానంలో ఉంటుంది.

చదివి మరచిన వాళ్ళ కోసమూ, కొత్త వాళ్ళ కోసమూ కథా సంగ్రహం మరోసారి పునశ్చరణ చేసుకుందాం.

మెతిల్డా గవర్నమెంటు గుమాస్తా భార్య. దిగువ మధ్య తరగతి సంసారం. ఒకనాడు మినిస్టరుగారు స్టాఫ్‌కు పార్టీ ఇస్తారు. నగలు లేకుండా వెళ్ళటం మెతిల్డాకు అవమానంగా ఉంటుంది. తన ధనిక మిత్రురాలి వద్ద ఒక వజ్రాల నెక్లెస్ అరువు తీసుకుంటుంది. పార్టీలోనో, ప్రయాణంలోనో అదెక్కడో జారిపోతుంది. స్నేహితురాలికి మొహం చూపించటమెలా? అలాంటిది మరోటి అనుకుంటుంది. దాని ఖరీదు 36,000 ఫ్రాంకులు. కథలో ఈ విషయం తరువాత తెలుస్తుంది. ఖర్చులన్నీ తగ్గించుకుని, కడుపు కాల్చుకుని, మెతిల్డా ఎక్కడెక్కడో బండ చాకిరీ చేసి, పదేళ్ల నిత్య నరకం తర్వాత అంత డబ్బు పోగుచేసి అలాంటి నెక్లెస్ కొంటుంది. స్నేహితురాలు ఈ వింత కథ విని ఆశ్చర్యపోతుంది. నవ్వాలో, ఏడవాలో తెలియదు.



గైడీ మపాసా

"పిచ్చి మెతిల్డా. ఎందుకిలా జీవితం నాశనం చేసుకున్నావు. అది ఇమిటేషన్ జువెలరీ. దాని ఖరీదు అయిదు వందల ఫ్రాంకులకు మించదు" అంటుంది.

"నిరర్థకమైన విషయాల కోసం జీవితాలను వృధా చేసుకుంటారని చెప్పటానికిదో ప్రతీక" అంటూ తాత్వికతను చూశారు కొందరీ కథలో.

ఈ కథ వాస్తవికంగా ఉన్నదని అంగీకరించటం కష్టం. పదేళ్ళు తిండికి మాడి, చాకిరీ చేసిన దంపతులు ఆ ధనిక మిత్రురాలితో ఒక్కసారి మాట్లాడినా పోయేదే. కాని మపాసా చెప్పదలచుకున్నది వేరు. అంటే

కథా ప్రయోజనం కోసం ఆయన చూసిన, తనకు తెలిసిన వాస్తవానికి ఊహా వాస్తవికత జోడించాడు. విషాదంలో కూడా వ్యంగ్యం ఉంది. నిజానికి వాళ్ళు నష్టపోయారా? పోగు చేసిన డబ్బుంది గదా. సుఖంగా బతకొచ్చు కానీ- గడిచిన కాలం, తిరిగి రాని యవ్వనం... ఏ సమస్యలూ లేకపోయినా, అంతకంటే పొదుపుగా బతికే వాళ్లెందరో ఉన్నా రు... ఇలాంటి సందేహాలెన్నో! కాని మపాసా చిత్రించిన బాధా తీవ్రతలో, సెన్స్ ఆఫ్ లాస్ (Sense of loss)లో ఇలాంటి ప్రశ్నలు వేసుకునే పాఠకులెందరు? ఉన్నదున్నట్టుగా రాస్తే మంచి కథ గాదు. వాస్తవాల్ని రీ అరేంజ్ చేసుకోక తప్పదని కాసేపు అంగీకరిద్దామా! ప్రస్తుత కథలో, జీవితంలో అదృశ్యంగా, అంతర్లీనంగా ఉన్న హింసను పట్టుకోవాలంటే ఇలాంటి కల్పన తప్పదు. అవసరమున్నా లేకపోయినా యధాతథంగా రాయాలని 'నియమం' పెట్టుకుంటారు కొందరు. వాళ్లను మాత్రం 'వాస్తవిక వాదు'లనక తప్పదు. ఎంతో కొంత ఊహ లేకపోతే కథ ముందుకు నడవటం కష్టమని ఒక్క కథ రాసిన వాళ్లెవరైనా అంగీకరిస్తారు.



ఎర్స్కిన్ కాల్డ్‌వెల్

కథా రచనను కళగా అంగీకరిస్తే, ప్రకృతిని, జీవితాన్ని కాపీ కొట్టటం కళ అనరెవ్వరూ. కాపీ కొడితే ఫొటోగ్రఫీ అవుతుంది. కాని కళా సృష్టిలో ఎన్ని ప్రయోగాలు! ముఖ్యంగా చిత్ర, శిల్ప కళల్లో! వాస్తవమనే ముడి సరుకు నుండి కళారూపాలు సృష్టించారు!

ఎర్స్కిన్ కాల్డ్‌వెల్ (1903-1987) ప్రముఖ అమెరికన్ కథా, నవలాకారుడు 'టొబాకో రోడ్', 'గాడ్స్ లిటిల్ ఏకర్', 'ట్రబుల్ ఏన్ జూలై'- ఇతని ప్రధాన నవలల్లో కొన్ని.

ఒక ఇంటర్వ్యూలో యిలా చెబుతాడు.

"జర్నలిజానికీ, కథా రచనకూ తేడా ఉంది. ఇక దానికి వాస్తవం ప్రాణప్రదం. కానీ ఊహ లేక ఫిక్షన్ లేదు. ఫిక్షన్‌లో వాస్తవాలున్నాయనుకుంటే అవి మనం సృష్టించుకున్న వాస్తవాలు. పైగా, ఇంతవరకు లేనిదాన్ని సృష్టించటమే ఫిక్షన్. అంటే రచయిత ఊహా శక్తితో కొత్త లోకాన్ని, కొత్త మనుషుల్ని, వాళ్ల జీవితాలను సృష్టిస్తాడు. అంతే కాదు. సృజన క్రమంలో ఒక 'అనిశ్చితి' ఉంటుంది. ఏం జరుగుతుందో, ఏం రాయబోతున్నాడో రచయితకు కూడా స్పష్టంగా తెలియదు. ఆ 'అనిశ్చిత స్థితి', 'సందిగ్ధత' రచనకు ప్రాణం పోస్తుంది."

– ముక్తవరం పార్థసారథి

(వచ్చే నెలలో మరిన్ని విశేషాలు) ✦

చతుర సమీక్ష

మే 'చతుర' నవల విజేత

సమీక్షకుని పేరు: ______________________

చిరునామా: ______________________

______________________

______________________




# మాబీ డిక్

(1851)



హెర్మాన్ మెల్విల్

హెర్మాన్ మెల్విల్ 'మాబీడిక్' ఐదువందల పేజీల నవల. 135 అధ్యాయాలు, ఉపసంహారంగా మరో అధ్యాయం ఉన్నాయి. ఇది కేవలం అడ్వెంచర్ నవల కాదు. అనేక అంతరార్థాలతో ప్రతీకాత్మక సంఘటనలతో పొదిగిన తాత్విక కావ్యమంటారు విశ్లేషకులు. తిమింగలాల గురించి, వాటి అలవాట్లు, తిమింగలాల వేట పద్ధతుల గురించిన వివరాలు తత్సంబంధమైన అనేక చారిత్రక సంఘటనలతో ఒక ఎన్‌సైక్లోపీడియాలో ఉన్నంత సమాచారమందిస్తుందీ గ్రంథం.

కథాంశం: "కాల్ మి ఇస్మాయెల్"అంటూ కథకుడు తనను తను పరిచయం చేసుకుంటాడు. సముద్రం మీదే బతుకంతా గడిపెయ్యాలన్నంత కోరిక. తిమింగలం వేటకు కేంద్రంగా మారిన న్యూ బెడ్‌ఫోర్డ్‌కు బయల్దేరతాడు. అక్కడ హోటల్లో పసిఫిక్ ప్రాంతవాసి కీకెగ్‌తో పరిచయమవుతుంది. తిమింగలాలను చంపటానికి ఉపయోగించే ఆయుధం (హార్పూన్) తాడుకు కట్టిన బల్లెం లాంటి దానిని విడిచి క్షణం కూడా ఉండలేడు. దాంతోనే గడ్డం కూడా చేసుకుంటాడు. అతడి సాహసగాథలు విని ఇస్మాయెల్ తనను వెంట తీసుకెళ్లమని అభ్యర్థిస్తాడు. ఇద్దరూ కలిసి నాంటకెట్ చేరుకుంటారు. ఆకష్‌నెట్ నది మీద ప్రయాణం కీకెగ్ వేలర్‌లో ఓ కుర్రాణ్ణి ఆటపట్టిస్తాడు. వాడు బెదిరి అటూ యిటూ పరిగెత్తుతాడు. పడవ ఊగుతుంది. కుర్రాడు నీళ్లలో పడబోతున్నప్పుడు రక్షిస్తాడు కీకెగ్. వినటమేకాదు, ఒక అడ్వెంచర్‌ను స్వయంగా చూశాడు ఇస్మాయెల్!

నాంటకెట్‌లో పెకాడ్ అనే వేలర్ ఎక్కుతారందరూ. దీని కెప్టెన్ ఆహాబ్. అతడి కాలొకటి నమిలి మింగేసింది తిమింగలం. వేలర్లు (తిమింగలాల వేటగాళ్లు) ఇలాంటి చిన్న చిన్న ప్రమాదాల వల్ల బెదిరిపోరు. అహాబ్ కళ్లలో ఒక వింత ఆకర్షణ ఉంటుంది. ప్రాణాలకు తెగించిన ధైర్యం. మనుషుల్ని చప్పరించే

తిమింగలాల్నీ, నరమాంస భక్షకుల్నీ చూశాడు. అతనిది మృత్యుక్రీడ.

పెకాడ్ నౌకకు అధిపతులు మరో ముగ్గురు. స్టార్‌బక్ ఛీఫ్‌మేట్; స్టబ్- సెకండ్ మేట్; ఫ్లాస్క్ థర్డ్‌మేట్. కీకెగ్‌ను స్టార్‌బక్ తన అసిస్టెంట్‌గా; టాష్టెగో అనబడే ఇండియన్ తెగమనిషిని స్టబ్, డాగూ అనబడే నీగ్రోను ఫ్లాస్క్ తమ హార్పూనర్లు (వేటగాళ్ల)గా తీసుకుంటారు.

షిప్పులో మరికొందరు పారిసీలు కూడా ఉంటారు. వాళ్ల నాయకుడు ఫెడాల్లా జోస్యం చెబుతాడు "శవ పేటికలూ, వాటిని లాగే వాహనాలూ అహాబ్‌కెందుకు? " అని. కెప్టెన్ అహాబ్ గురించి రచయిత ఎంతో యిష్టంగా వర్ణిస్తాడు.

పదహారు డాలర్ల విలువైన బంగారు నాణాన్ని తెరచాప స్తంభానికి కొట్టి "మనందరి జీవితలక్ష్యం ఒక్కటే. తెల్ల తిమింగలాన్ని వేటాడిన వీరుడిదే బంగారం. నా కాలు కొరికేసిన "మాబీడిక్'ను చంపేదాకా వెనక్కుదిరిగే ప్రసక్తిలేదు" అంటూ ప్రకటిస్తాడు అహాబ్. కెగ్‌కు మాబీడిక్ తెలుసు. ఎన్నాళ్లుగానో వాళ్లు దాని కోసం గాలిస్తున్నారు. దొరికినట్టే దొరికి తప్పించుకుపోతున్నది. దానిలో మూడు హార్పూన్లు దిగున్నాయిప్పటికి.

కెప్టెన్ అహాబ్ ప్రతీకార వాంఛతో రగిలిపోతున్నాడు. తను బతికున్నదే మాబీడిక్ కోసమన్నట్టుగా ప్రవర్తిస్తాడు. వేట ప్రారంభించే ముందు తాగటం రివాజు. చేతుల్లో సారా గ్లాసులు పట్టుకుని "డెత్ టు మాబీడిక్" అంటూ ప్రతిజ్ఞ చేస్తారందరూ. మనం దాన్ని చంపకపోతే దేవుడు మనకందరికీ మరణ శిక్ష విధిస్తాడు. ప్రకృతిలోని దుష్టశక్తి మాబీడిక్. మన చేతిలో దానికి మృత్యువు రాసుంది" అంటాడు అహాబ్. వేట ప్రారంభమవుతుంది. అహాబ్ తిమింగలాల వలసలను చాలా కాలంగా అధ్యయనం చేశాడు. మాబీడిక్ ఏ కాలంలో ఏ ప్రాంతంలో ఉండే అవకాశముందో అతడికి తెలుసు. దాని వీపు మీద ఒక తెల్ల బొప్పె ఉంటుంది. నీటిలో మునిగినప్పుడు కూడా బొప్పె మాత్రం పైకి కనిపిస్తుంటుంది. ఒకనాడు తిమింగలాల గుంపు కనిపిస్తుంది. వేటగాళ్లు ఉత్సాహంగా కేకలేస్తారు. వేలర్‌లోని చిన్న పడవల్ని నీళ్లలోకి దించుతారు. కాని ఆ హడావిడిలో ఒక దాన్నొకటి కొట్టుకుని ఒక పడవ మునిగిపోతుంది. మంచుతెర దట్టంగా కమ్మేస్తుంది. దగ్గరగా వున్న వ్యక్తులు కూడా ఒకర్నొకరు పోల్చుకోలేరు. అయినప్పటికీ అహాబ్ ప్రాణాలకు తెగించి వేటాడమని తన అనుచరుల్ని ప్రోత్సహిస్తుంటాడు. తుఫాను వస్తుంది. కాగితపు పడవలా ఎగిరెగిరి పడుతుంది వేలర్. వానకు తడిసి ముద్దవుతారందరూ. "గాలివాటం చూసి కదలండి" అంటూ అరుస్తాడు అహాబ్. ప్రకృతి భీభత్సంలో చిరు చేపల్లాంటి మనుషులు అయినా అందరి లక్ష్యం ఒక్కటే. బ్రహ్మరాక్షసి లాంటి మాబీడిక్‌ను హార్పూన్లతో పొడిచి చంపాలి. స్టబ్ ఒక తిమింగలాన్ని చంపుతాడు. ఫాస్క్ మరో దాన్ని. మాబీడిక్ మాత్రం కనిపించదు. టాష్టెగో, తెగిన తిమింగలం తలలో పడిపోయినంత పనవుతుంది. (ఆ తల సొరంగం లాగుందట!) కీకెగ్ అతణ్ణి రక్షిస్తాడు.




అనేక ఇతర వేలర్లు కూడా వేటలో పాల్గొంటాయి. ప్రతిసారీ కనిపించినట్టే కనిపించి మాయమవుతుంటుంది మాబీడిక్. మరో కెప్టెన్‌కు చెయ్యి వుండదు "పొరబాటున హార్పూన్ తగిలి చెయ్యి తెగిందంటాడు" అహాబ్ ఇది నమ్మడు. "తిమింగలమే కొరికేసి

## హెర్మాన్ మెల్విల్ (1819-1891)

హెర్మాన్ మెల్విల్ జీవితం పదేళ్ళ దాకా సుఖంగానే గడిచింది. తండ్రికి వ్యాపారంలో నష్టం రావడం, మతి భ్రమించి మరణించడం తో సంసారం వీధి పాలైంది. కొన్నాళ్ళ తర్వాత చదువు కొనసాగించలేక హెర్మాన్ ఒక న్యూయార్కు బ్యాంకులో గుమాస్తాగా చేరాడు. అదెక్కువ కాలం నిలవలేదు. అనేక చిన్న ఉద్యోగాలు చేశాడు. తరువాత షిప్పులో నెలకు మూడు డాలర్ల కూలీగా చేరి లివర్ పూల్ (ఇంగ్లండ్)కు బయల్దేరాడు. మూడేళ్ళ తర్వాత 1841లో "ఆకష్ నెట్" అనబడే వేలర్ (తిమింగలాల వేట కోసం ఉపయోగించే నౌక)లో మరో సముద్ర ప్రయాణం ప్రారంభించాడు. ఈసారి తన యజమానుల క్రూరత్వాన్ని భరించటం అసాధ్యమైంది. కెప్టెన్ నరరూప రాక్షసుడు. శాడిస్టు. హెర్మాన్, మరో మిత్రుడూ మార్క్వెసాస్ ద్వీపం వద్ద సిబ్బంది కళ్లు గప్పి అడవుల్లోకి పారిపోయారు. హెర్మాన్ కాలికి పెద్ద గాయమైంది. నడవలేక కుంటుతున్నప్పుడు 'టైపీస్' తెగకు చెందిన నరమాంస భక్షకులు వీళ్లకు స్వాగతం పలికారు. ఆహార సమస్య తీరింది. అతిథులను ఆప్యాయంగా చూసుకున్నారు. నాలుగు నెలలు సుఖంగా గడిచాయి. 'ఫాయావే' అనబడే ఆటవిక సుందరి హెర్మాన్‌ను ఆకర్షించింది. కానీ ప్రాణభయం వేధిస్తూనే ఉంది. అదను చూసుకుని, అతిథుల కళ్ళు గప్పి తప్పించుకుని ఎట్టకేలకు 1844 నాటికి అమెరికా తీరం చేరుకున్నాడు హెర్మాన్. అప్పటికతడికి పాతికేళ్ళు నిండాయి.

నరమాంస భక్షకుల మధ్య గడిపిన వ్యక్తిగా హెర్మాన్ అందరికీ హీరో! అతడి చేత కథలు చెప్పించుకోవటానికి జనం చుట్టూ మూగేవాళ్ళు రచనలు చెయ్యాలనే కోరిక హెర్మాన్‌కు లేకపోలేదు. పైగా ఎంతో

ఉంటుందని" నమ్మకం.

ఒక రాత్రి గాలివాటంతో ఓ కొత్త వాసనను పసిగడతాడు. అహాబ్ ఒక్క ఉదుటున సిబ్బందిని లేపి వేటకు సిద్ధం కావాలని ఆదేశిస్తాడు. "మాబీడిక్‌కిది చివరిరోజు. దాని మువ్పె నాకు కనిపించింది. పడవలు దించండి. హార్పూన్లు విసరండి!"

వేటగాళ్లకన్నా తెలివైంది మాబీడిక్. వాళ్లను ముప్పుతిప్పలు పెడుతుంది. పడవలు దాని దవడల మధ్య నలిగిపోతాయి. నీళ్లలో ఈదటానికి కూడా భయం. వేలర్‌లో తప్ప రక్షణ లేదు. చేపలాగ ఈదుతూ హార్పూన్‌తో యుద్ధం చెయ్యాలని అహాబ్ కోరిక కానీ అశక్తుడు. కాలు లేదు. పగబట్టినట్టుగా మాబీడిక్ వెంటపడింది. ఈ పరిస్థితుల్లో యుద్ధం చెయ్యలేరు. వెనక్కు తగ్గటం కూడా ఎత్తుగడల్లో ఒక భాగం. మాబీడిక్ వెళ్లిపోతుంది. అందరూ పెకార్డ్ తాకి క్షేమంగా చేరుకుంటారు. ఈ బంగారు నాణం ఎవరికి? తెల్ల తిమింగలాన్ని చంపగలిగిన సాహసవీరుడెవరు? విజయం సాధిస్తే ఇంతకు పదింతలు బహుమానమిస్తానని ఆశ పెడతాడు అహాబ్.

మరునాడు వేట మళ్లీ ప్రారంభమవుతుంది. సిబ్బందిలో ఉత్సాహం ఇనుమడించింది. అత్యుత్సాహం కూడా ప్రమాదకరం. మరి దేన్నో చూసి తిమింగలమని భ్రమపడిన దశలో మాబీడిక్ మైలుదూరంలో దర్శనమిస్తుంది. ఎవరు ఎవరిని వేటాడుతున్నారో తెలియదు. మాబీడిక్ శరవేగంగా, మృత్యువులా పెకాడ్ వైపు దూసుకు వస్తుంది. హార్పూన్లు విసిరేలోగానే అది వాటి తాడును కొరికేసి, పడవలను తల్లకిందులు చేసి స్వైర విహారం చేస్తుంది. అహాబ్ పడవ విరిగిపోతుంది. అతి ప్రయత్నం మీద తిరిగి పెకాడ్‌కు సురక్షితంగా చేరుకుంటారు. ఇంచుమించు అందరికీ గాయాలవుతాయి. అహాబ్ దంతపు కాలు నీటిలో పడిపోతుంది. స్టబ్ సహాయంతో తప్ప నిల్చోలేడు. కాని మనోనిబ్బరం మాత్రం సడలలేదు.

"రెండురోజులది మనల్ని ఛాలెంజి చేసింది. రేపటితో దానికి మూడింది. చివరి

కొంత ఆదాయం కూడా అవసరమే. మొదటి పుస్తకం 'టైపీ' (1846). బాగా అమ్ముడు పోయింది. గుర్తింపు వచ్చింది. ఆ వెంటనే దాని సీక్వెల్ 'ఓమూ' (1847) రాశాడు. అది తహితీ ద్వీపాల్లో అనుభవాల ఆధారంగా రాసిన కథ. 1849లో మరో రెండు, 'మార్డీ', 'రెడ్ బర్న్' అనే నవలలు రాశాడు. 1851లో 'మాబీ డిక్' నవల రాశాడు. అదే నవల లండన్‌లో 'ది వేల్'గా ప్రచురితమైంది. దీని తరువాత చేసిన రచనలు పాఠకుల్ని పెద్దగా ఆకర్షించలేదు. 1847లో పెళ్లి చేసుకున్నాడు. పిల్లనిచ్చిన మామ చీఫ్ జస్టిస్. ఆయన పలుకుబడితో 1866లో న్యూయార్క్‌లో కస్టమ్స్ ఇన్‌స్పెక్టరుగా గవర్నమెంటు ఉద్యోగం సంపాదించుకున్నాడు. తర్వాత కూడా అడపాదడపా రచనలు చేశాడు. మరణించేనాటికి "బిల్లీ బడ్" అనే నవల అముద్రితంగా మిగిలింది. అది 1924 లో ప్రచురితమై విశేష పాఠకాదరణ పొందింది. హెర్మాన్ అంత్యక్రియలకు వాల్ట్ విట్మన్ తప్ప మరే సాహిత్యకారుడూ హాజరు కాలేదు.

ఇప్పుడు సాహిత్యకులు, విమర్శకులు హెర్మాన్ మెల్విల్‌ను అమెరికన్ సాహిత్యానికి "కలోసస్"గా గుర్తిస్తారు. "మాబీడిక్"లో అనేక తాత్వికాంశాలు చూస్తారు. కాని ఇంతటి రచయితా చివరి పాతికేళ్ళు అనామకంగా జీవించాడు. హెర్మాన్ మెల్విల్ శత జయంతి సందర్భంగా అతడి జీవిత చరిత్ర ప్రచురించటంతో అతడి కీర్తి శిఖరాలనంటింది. 'మాబీ డిక్'తో సహా రచనలన్నీ అనేక వందల సార్లు ప్రచురితమై మిలియన్ల కాపీలు అమ్ముడయ్యాయి. కానీ రచయిత జీవిత కాలంలో 'మాబీడిక్' ఒకే ఒక్కసారి అచ్చయింది. దాని వల్ల ఆయనకొచ్చిన రాయల్టీ వంద డాలర్లకు మించలేదట!

ప్రయత్నం అటో ఇటో తేలిపోక తప్పదు" అంటూ ఉత్సాహపరుస్తాడు అహాబ్.

సాయంత్రమవుతుంది. దీపాల వెలుగులో వేటగాళ్లు అదనపు బోట్లు సిద్ధం చేసుకుంటారు. ఆయుధాలను పదును పెట్టుకుంటారు. విరిగిన పడవ చెక్కతో వడ్రంగి అహాబ్ కోసం మరో కాలు తయారుచేస్తాడు.

మూడోరోజు సముద్ర జలాల మధ్య ఉషోదయమవుతుంది. మాబీడిక్ జాడలేదు. పెకాడ్‌ను షార్కులు చుట్టుముట్టాయి. అయినప్పటికీ పడవలు దించి, స్టార్‌బక్ సాయంతో తిమింగలం కోసం గాలిస్తాడు అహాబ్.

అల్లంత దూరాన మాబీడిక్ కనిపించి మాయమవుతుంది. కాని దాని వేగం తగ్గినట్టుగా తెలుస్తుంది. అహాబ్ హార్పూన్ విసురుతాడు. దానివలన గాయపడిందెంతో గానీ మాబీడిక్ పెకాడ్ వైపు దూసుకువస్తుంది. షిప్పుకు కూడా నష్టం చెయ్యగలిగిన తిమింగలాలుంటాయని అప్పుడు తెలుస్తుంది. పెకాడ్‌లోకి నీళ్లు వస్తాయి. షిప్ కిందినుండి వచ్చి అహాబ్ పడవపై దాడి చేస్తుంది. మాబీడిక్ అహాబ్ హార్పూన్ విసురుతాడు. గురి తప్పుతుంది. తాడు లాగుతాడు గాని అది మెడకు చుట్టుకుంటుంది. పడవతో పాటు అహాబ్ కూడా జలసమాధి అవుతాడు. మరికాసేపటికి పెకార్డ్ కూడా మునిగిపోతుంది. మాబీడిక్‌దే అంతిమ విజయం. ఫెడాలా జోస్యం నిజమవుతుంది.

పెకాడ్ నౌక కేవలం వేలింగ్ షిప్ మాత్రమే కాదు. అదో వింత లోకం. కెప్టెన్ అహాబ్ దుష్టశక్తుల్ని అంతమొందించటానికి కంకణం కట్టుకున్నానంటాడు. ప్రకృతిలో భాగమైన తిమింగలం దుష్టశక్తి ఎలా అవుతుంది? ప్రకృతికి నష్టం చేస్తే మనిషి తన అంతాన్ని తను కొని తెచ్చుకోవడమే.

ఆనాటి నుండి ఈనాటి దాక, ఈ నవల గురించిన చర్చ ఇలా నిరంతరంగా కొనసాగుతూనే ఉంది. ప్రపంచ సాహిత్యంలోనే ఒక విలక్షణమైన సృష్టి మాబీడిక్.

ఎం. వసంత ✦

# విజేత

ఒంటరిగా ఓ చిన్న వ్యాపారాన్ని ప్రారంభించి కుటుంబ పోషణ భారాన్ని మీద వేసుకుని ఈ నెల ఖర్చులనెలా గట్టెక్కించాలా అనే దిగులుతో బతుకు వెళ్ళదీస్తున్న ఆ సగటు యువతికి ఆదర్శ భావాలున్నాయి. విలువలున్నాయి. వంశపారంపర్యంగా వచ్చిన సంస్కారాలున్నాయి. తనకు ఊహ తెలియని రోజుల్లోనే తాళిగట్టి ఎటో వెళ్లిపోయిన భర్త ఏనాటికైనా తిరిగి వచ్చి తన కష్టాలు తీరుస్తాడనే నమ్మకాలున్నాయి. ఆమె ఎడారి జీవనంలో మలయ సమీరంలాంటి స్నేహితురాలి ఓదార్పే వేయి ఏనుగుల బలాన్నిచ్చేది. ఆ బలంతోనే పోరాటం కొనసాగించి 'విజేత'గా నిలిచిన వైనాన్ని ఆసక్తికరంగా అక్షరబద్ధం చేసిన వక్కలంక లక్ష్మీ పద్మసుందరి నవల **విజేత** ఈ నెల 'చతుర' సమర్పణ.



పువ్వులు పలుకలేని మూగ ప్రాణులు అనుకునేవారు బహుశా వట్టి అమాయకులు. పెదవి విప్పి చెప్పకుండానే వేల భావాలను వెలికి తీయగల సౌందర్యం, సుగంధం వాటి సొంతం. ఒక్క గులాబీల విషయాన్నే తీసుకుంటే తెలుపు- శాంతిని, సానుభూతిని తెలియజేస్తుంది. పసుపు- పవిత్రమైన మైత్రీ బంధాన్ని పంచుతుంది. నారింజ రంగు- ఎదురయ్యే ఆటంకాలను అధిగమించమని ప్రోత్సహిస్తుంది. గులాబీలకే సొంతమైన పింక్ రంగు శుభాభినందనలను తెలియజేస్తుంది. నలుపు- ఎదుటి వ్యక్తి పట్ల నీ అయిష్టతను, నిరసనని వ్యక్తం చేస్తుంది. ఎరుపు- పువ్వులకు రాణి లాంటి రంగు ప్రపంచ వ్యాప్తంగా దీని భాష- భావం ఒక్కటే. 'నువ్వంటే నాకు ఎనలేని ప్రేమ' అంటూ చాటుతుంది. రంగులే కాదు, పువ్వులకు అర్థం పరమార్థం ఉంది. మందారాలు, నంది వర్ధనాలు ప్రభువు సేవకు మేము సిద్ధం అంటాయి. కలువలు, కమలాలు పంకంలో పుట్టినా పవిత్రతను చాటుతాయి. పొగడలు, పారిజాతాలు వడలినా, పాడినా మా పరిమళం వీడిపోదు అంటాయి. మల్లెలు, విరజాజులు- ప్రియుడిని ప్రియురాలితో జత కమ్మంటాయి. సంపెంగలు, మొగలి పొదలు- ఎదలో ఏదో కోరికను బుస కొట్టిస్తాయి. బంతులు, చామంతులు- నిండైన సోయగాలతో విందులు చేస్తాయి. ముట్టుకుంటేనే వడలిపోయే సుతారం, చుక్క నీరు దొరకని ఎడారిలో సైతం పుష్పించి పరిమళించగలిగే ఆత్మ స్థైర్యం పువ్వులకే సొంతం. ఆ రెండు లక్షణాలు కలబోసుకున్నందుకేనేమో స్త్రీ మూర్తి, పుష్పాలు పరస్పరం అంతటి ప్రియ బాంధవులయ్యాయి.

చుట్టూ కొలువుతీరి ఉన్న పువ్వుల గుత్తులను తిలకిస్తూ వాటి ప్రత్యేకతలను తలబోస్తూ మైమరచి ఉన్న 'దాక్షిణ్య' "హాయ్! అన్న పిలుపుకి ఉలిక్కిపడి ఆలోచనల నుండి తేరుకొని ఎదురుగా నిలుచున్న గీతని చూసి చిరునవ్వుతో పలకరించింది.

"నేను ఆర్డర్ చేసిన బొకేలు రెడీ చేశావా...?" కుర్చీలో కూర్చుంటూ అడిగింది.

"సిద్ధంగానే ఉన్నాయి" చెబుతూనే ఓ వారగా నలిగిపోకుండా అందంగా పేర్చిన గులాబీ బొకేలను చూపిస్తూ చెప్పింది దాక్షిణ్య.

గీత వెనక్కి తిరిగి రోడ్డు పైన నిలుచున్న కారు డ్రయివర్‌కి సైగ చేసి పిలిచి వాటిని కారులో సర్దమని చెప్పింది.

"ఏమిటి సంగతి? ఒకేసారి ఇన్ని బొకేలు కొంటున్నావు...?" బిల్ పుస్తకం తీస్తూ అడిగింది.

"ఈ రోజు మా బాస్ శ్రీకాంత్‌గారి పుట్టినరోజు... ఆయన పర్సనల్ సెక్రటరీని కదా! ఆఫీసులోని కొందరి ముఖ్యుల తరపున ఆయనకి విషెస్ అందేలా చూడవలసిన బాధ్యత నాది. అందరికీ బొకేలు తెచ్చే విషయం గుర్తుండదు కదా! అందుకే స్టాఫ్ తరపున నేనే కొని వాళ్లకిచ్చి మా బాస్‌కి ఇప్పించి విషెస్ చెప్పించాలి. అందుకే ఈ ఏర్పాట్లు" వివరించింది గీత.

"మరి వీటికి డబ్బు నీ సొంతమా? లేక కంపెనీ భరిస్తుందా...?"

"రెండూ కాదు. స్టాఫ్ అందరూ తలో కాస్త వేసుకుంటాం. సాయంత్రం తాజ్ ఇంటర్నేషనల్‌లో పార్టీ కూడా ఉంది. అయితే దాని ఖర్చు మాత్రం బాస్ సొంత ఖాతాకి చెందుతుందనుకో"

బిల్లు రసీదు చింపి అందిస్తూ "నేనూ రావచ్చా ఆ పార్టీకి... లేక మీ ఆఫీసు స్టాఫ్‌కి మాత్రమే పరిమితమా...?" అడిగింది దాక్షిణ్య.

ఒక్క క్షణం ఆశ్చర్యంగా చూసి "నిర్వహణ అంతా నాదే కనుక అదేం పెద్ద సమస్య కాదు. కానీ హఠాత్తుగా నీకేంటి ఈ కోరిక...? సోకాల్డు ప్రపంచంలో పార్టీలు

ఎలా ఉంటాయో చూద్దాం అనుకుంటు న్నావా...?" కొంటెగా అడిగింది.

నవ్వేసింది దాక్షిణ్య. "అదేం లేదు. ప్రస్తుతం ఈ ఫ్లోరిస్టు బిజినెస్ బాగానే నడు స్తోంది. కాకపోతే మీ కంపెనీ చాలా పెద్దది కదా! తరచు ఏవో పార్టీలు, ఫంక్షన్లు జరుగుతూనే ఉంటాయి. మీ బాస్‌తో ఒక సారి పరిచయం చేసుకుంటే నా బిజినెస్ డెవలప్ అవుతుందని చిన్న ఆశ"

గీత ఆమెతో అంగీకరించింది. "న్యూ వే రియల్ ఎస్టేట్స్" అంటే సిటీలో చాలా గుడ్ విల్ ఉంది. కనుక నెలకి ఏదో ఇవ్వడం సాధ్యం కాదేమో?" సాలోచనగా అంది గీత.

"ప్రయత్నించడంలో తప్పు లేదుగా! శ్రీకాంత్‌గారిని ఒకసారి కలిస్తే ఏమైనా ఉప యోగం ఉంటుందేమో చూద్దాం" తన ఆలో చన వివరించింది.

"సరే, సాయంత్రం ఆరుకల్లా రెడీగా ఉండు. నేనొచ్చి తీసుకెళతాను" చెప్పి బిల్లు డబ్బు చెల్లించి వెళ్లిపోయింది గీత.

గీత, దాక్షిణ్య డిగ్రీ వరకు కలసి చదువు కున్న ప్రాణ స్నేహితులు. కుటుంబ పరిస్థి తుల కారణంగా గీత దొరికిన ఉద్యోగంలో

**మన మధ్య లేని రచయిత్రి** వక్కలంక లక్ష్మీ పద్మ సుందరి రచయిత్రిగా ఎదుగుతున్న దశలో మనమధ్య నుంచి హఠా త్తుగా కనుమరుగయ్యారు. అతి అరుదైన వ్యాధి తనను వికలాంగురాలిగా మిగిల్చి నా చెక్కుచెదరని మనోస్థైర్యంతో అక్షరాన్ని అసరాగా చేసుకుని ఆమె మనుగడ సా గించారు. అనేక కథలు, నవలలు రాసి రచయిత్రిగా నిలదొక్కుకుంటూ కీర్తిపథం వైపు అడుగులు వేస్తున్న దశలో అకాల మృత్యువు ఆమెను కబళించింది. ఈ ఏ డాది ఫిబ్రవరిలో అకస్మాత్తుగా ఆమె ఆరోగ్యం క్షీణించింది. కొద్ది రోజులకే ఆమె కన్నుమూశారు. చతురలో ఇది ఆమె రెండవ నవల. ఈనాడు ఆదివారం సంచిక లో అనేక కథలు, విపుల మార్చి సంచిక (రచయిత్రుల ప్రత్యేకం)లో ఒక కథ ప్రచురితమయ్యాయి. ఇతర పత్రికల్లో కూడా అనేక రచనలు ప్రచురించబడ్డాయి. వివిధ సంస్థలు నిర్వహించిన కవితల పోటీల్లో అనేక పురస్కారాలు అందుకు న్నారు. విశ్వవిద్యాలయానికి వెళ్లలేని వైకల్యంలో కూడా స్వయంగా ఎం.ఎ హిందీ చేసి అనేక మంది విద్యార్థులకు శిక్షణ ఇచ్చి హిందీ పరీక్షలు రాయించారు. ఇతి వృత్తం ఎలాంటిదైనా బిగువైన కథన సంవిధానంతో రచనలు చేయడంలో నైపుణ్యా న్ని అలవరుచుకుంటున్న దశలో పద్మ సుందరి కనుమూయటం విచారకరం.

**చిరునామా : వి.ఎల్. పద్మ సుందరి, కేరాఫ్ వి.వి. రామగోపాలరావు, 7-14-7, దర్గాపేట, పెద్దాపురం - 533437.**

వంకన కన్స్యూమర్‌లని మచ్చిక చేసుకోడా నికి పది పన్నెండైనా ఫంక్షన్లు నిర్వహి స్తారు. కానీ సాధారణంగా ఇలాంటి కార్యక్ర మాలన్నింటికీ ఏర్పాట్లు, అలంకరణ, నిర్వ హణ- భోజన ఏర్పాట్లతో సహా అన్నీ ఏదైనా పెద్ద సంస్థలతో కానీ ఫైవ్‌స్టారు హోటళ్ళతో కానీ కాంట్రాక్టు పెట్టుకుంటారు. కేవలం నీకు పుష్పాలంకరణ వరకు చేరిపోతే, తన స్వశక్తితో బతకాలనే తప నతో చిన్నతనం నుండీ తనకెంతో ప్రియ మైన పువ్వుల ఆధారంగానే జీవనోపాధిని నిర్ణయించుకొంటూ "పరిమళ ఫ్లోరిస్టు" పేరుతో సొంతంగా షాపును ఏర్పాటు చేసు కొని ఏడాదిన్నరగా విజయవంతంగా నిర్వ హిస్తోంది దాక్షిణ్య.

గీత వెళ్ళిపోగానే దాక్షిణ్యకు సాయంత్రం



ఆంధ్ర_ 224536



పార్టీకి ఎలా వెళ్లాలా అనే ఆలోచన రేగింది. సాయంత్రం ఆరు - ఎనిమిది మధ్య ఆమె పూలకి మంచి డిమాండ్ ఉం టుంది. అది కాలేజీలు, ఆఫీ సులు వదిలే సమయం. డిస్కోలు, పబ్ లు వంటి వాటిలో యువతరాన్ని ఉత్సాహపరిచే సమయం కావ డంతో ఏదో ఒక సందర్భం కోసం సాయంత్రం పూట బొకేలకు, విడి పువ్వులకు గిరాకీ ఎక్కువ. ఆ సమయంలో షాపుని మూయడం ఆమెకి ఏమాత్రం ఇష్టం లేదు. ఐదు నిమిషాలు తీవ్రంగా ఆలో చించి కాలేజీకి బయలుదేరు తున్న చిత్రకి ఫోన్ చేసింది.

"ఏంటక్కా? నీ ఫోన్ ఒక్క నిమిషం లేటైనా నేను వీధి చివర ఉందును- తెలుసా?" అంది చిత్ర.

"చిత్రా! సాయంత్రం నీ కాలేజి అయిపో గానే షాపుకి వచ్చేయి. నేను

గీతతో ఒక ముఖ్యమైన పనిమీద వెళ్లాలి" చెప్పింది.

"నేనా...? నేను పార్లర్‌కి వెళ్ళొద్దా. వేదక్కకి చెపుతాను తను వస్తుంది"

చిత్ర వెంటనే తిరస్కరించింది.

"చిత్రా! అర్థం చేసుకో. అక్కకేం తెలుస్తుంది. పైగా పువ్వుల్ని చూస్తూనే కళ్ల నీళ్ళు పెట్టుకుంటుంది. ఇంక బిజినెస్ ఏం సాగుతుంది. నువ్వయితే కుర్రాళ్ళు బాగా వస్తారు" కొంటెగా అంది.

"కానీ నా బ్యూటీ కోర్స్" నసిగింది చిత్ర.

"చిత్రా! నా చెల్లివి కదూ! ఈ ఒక్క రోజుకి డుమ్మా కొట్టమ్మా. ఆఁ! అన్నట్లు మర్చిపోయాను. గీత ఏదో బుక్ ఇచ్చింది. 'హెర్బల్ బ్యూటీ టిప్స్ ఫర్ లవ్లీ హెయిర్' అట. నా దగ్గరే ఉంది. సాయంత్రం నువ్వొస్తే కూర్చుని చదువుకోవచ్చు" ముందురోజు గీత తెచ్చిన పుస్తకాన్ని అటూ, ఇటూ తిప్పి చూస్తూ చెప్పింది.

"నిజంగానా...? అయితే నాలుగున్నరకే వచ్చేస్తాను" ఉత్సాహంగా చెప్పింది చిత్ర.

బ్యూటీషియన్ కావాలనే చెల్లెలి ఉత్సాహం ఆ గొంతులో ధ్వనించడంతో చిన్నగా నవ్వుకుంటూ ఫోన్ పెట్టేసి కస్టమర్స్ రావడంతో వాళ్లని అటెండ్ కావడంలో మునిగిపోయింది దాక్షిణ్య.

* * *

రకరకాల మనుషులు, వేషధారణలు ఎవరికి వారు వారి ఐశ్వర్యాన్ని, సమాజంలోని ఆధిపత్యాన్ని, హోదాలను ప్రదర్శించాలనే తాపత్రయంతో నవ నాగరికంగా ప్రవర్తిస్తున్న ఆ ఖరీదైన పార్టీలో ఒద్దికగా కట్టుకున్న పోచంపల్లి నేత చీరలో తను స్వయంగా పేర్చి తెచ్చిన పూల బొకేతో తనదైన ప్రత్యేకతను ప్రదర్శిస్తూ వచ్చిన దాక్షిణ్య ఒక్కసారిగా హాలుని కలయచూసి, "మొత్తానికి అరిస్టోకాటిక్ పార్టీ అనిపిస్తోంది" అంది గీతవైపు తిరిగి.

"అంటే...?" అర్థం కానట్లు అడిగింది గీత.

"ఏముంది. అసలు తక్కువ, ఆర్భాటం ఎక్కువ. ఇదే పార్టీ ఓ మధ్య తరగతి కుటుంబంలో అయితే పులిహోరా, పాయసంతో పదిమంది ముఖ్యమైన బంధుమిత్రులతో క్లుప్తంగా అయిపోతుంది. ఇందులో మీ బాస్ మీద అభిమానంతో వచ్చిన వాళ్లకన్నా రాకపోతే తమ హోదా ప్రదర్శించుకునే అవకాశం పోతుందనే బెదురుతో వచ్చినవాళ్లే ఎక్కువ శాతం కనిపిస్తున్నారు" గీత పక్కగా అడుగులు వేస్తూ లోగొంతుతో చెప్పింది.

**మీ బాస్ మీద అభిమానంతో వచ్చిన వాళ్లకన్నా రాకపోతే తమ హోదా ప్రదర్శించుకునే అవకాశం పోతుందనే బెదురుతో వచ్చినవాళ్లే ఎక్కువ శాతం కనిపిస్తున్నారు**



చిన్నగా నవ్విన గీత శ్రీకాంత్ దగ్గర కావడంతో మోచేత్తో చిన్నగా పొడిచి "ఉష్! ఆయనే మా బాస్" హెచ్చరించింది.

ఇద్దరూ బొకేలు ఆయన చేతిలో పెట్టి అభినందనలు తెలియజేశారు. కానీ గీతకి దాక్షిణ్యను పరిచయం చేసే అవకాశం కలగలేదు. ఎవరెవరో వచ్చి పలకరిస్తూ ఉండడంతో శ్రీకాంత్ వీళ్లనసలు పట్టించుకోలేదు. దాంతో కాస్త-

సందడికి దూరంగా దాక్షిణ్యను కూర్చోపెట్టి కూల్‌డ్రింక్ ఇచ్చి...

"సారీ దక్షా! ఒక్కర్తిని వదిలేశాననుకోకు. ఎంతైనా సెక్రటరీని కదా! ఒకసారి అందరినీ పలకరించి రావాలి. ఒక్క పది నిమిషాల్లో వచ్చేస్తాను. ప్లీజ్" అంది.

"ఫరవాలేదు. నువ్వెళ్ళు" చిరునవ్వుతో పంపించి నెమ్మదిగా డ్రింక్ తాగుతూ తన చుట్టూ ఉన్న మనుషులను గమనించడంలో నిమగ్నమయ్యింది. ఎక్కువ శాతం మంది మగాళ్ళు సూటు, నెక్ టైలతోనూ, ఆడవాళ్లు ఖరీదైన చీరలు, వయసులో ఉన్న ఆడపిల్లలు గాగ్రాలు, కుర్తా పైజామాలు, కొంత మంది ఆధునికమైన మిడీస్, మినీస్‌లో ఉన్నారు. వాళ్లందరిలోనూ ఫ్రెండ్‌షిప్‌ని సూచించే కరచాలనం చేసుకుంటున్న చేతుల డిజైన్ ఉన్న టీషర్ట్, బ్లాక్ జీన్స్ వేసుకున్న పాతికేళ్ళ లోపు కుర్రాడు అంతా కలివిడిగా తిరుగుతూ అన్నివర్గాల వ్యక్తులను పలకరిస్తూ వాళ్లకి మర్యాదలు జరిగేలా చూస్తూ హడావిడిగా తిరుగుతున్నాడు. బహుశా శ్రీకాంత్ తమ్ముడై ఉంటాడు అనుకుంటూ ఉండగానే అతని దృష్టి దాక్షిణ్యా మీద పడింది. తిన్నగా ఆమె కూర్చున్న టేబుల్ దగ్గరికి వచ్చి

"సారీ మేడమ్! మీరు ఒంటరిగా కూర్చున్నారు? " అర్థాంతరంగా ఆపేసి అడిగాడు. ఏం చెప్పాలో తెలియనట్లు ఇబ్బందిగా నిలబడింది. ఆమెను రక్షించడానికా అన్నట్లు అటు వచ్చిన గీత కలగచేసుకుంది.

"గుడీవినింగ్ సార్! ఈమె నా స్నేహితురాలు దాక్షిణ్య. నేనే తీసుకొచ్చాను. తనకి ఎవరూ తెలియరిక్కడ. అందుకే ఇక్కడ కూర్చోమన్నాను" అతనితో చెప్పి "దక్షా! వీరు భీమేష్ అని మా కంపెనీ జి.ఎమ్. శ్రీకాంత్ సార్‌కి ప్రాణ మిత్రులు" దాక్షిణ్యకు పరిచయం చేసింది.

దాక్షిణ్య వినయంగా నమస్కరించింది. కానీ అతను ప్రతి నమస్కారం చెయ్యలేదు.

"దాక్షిణ్యా. పేరు చాలా వెరైటీగా ఉంది. ఏదైనా పనిమీద వచ్చారా...? " అడిగాడు.

గీత ఇదే మంచి అదను అనుకొని భీమేష్‌ని కూర్చోమని తను దాక్షిణ్యా పక్కన కూర్చుని "సార్! మా దక్షి 'పరిమళ ఫ్లోరిస్టు' అనే స్టాల్ నడుపుతోంది. మన కంపెనీల ద్వారా తరచు ఏవో ఒక కార్యక్రమాలు జరుగుతుంటాయి కదా! వాటికి ఫ్లవర్ డెకరేషన్‌కి తనకి ఆర్డర్ ఇస్తారేమో అడుగుదామని వచ్చింది" చెప్పింది.

భీమేష్ చేతిలో డ్రింక్ గ్లాస్ తిప్పుతూ అడిగాడు. "సాధారణంగా రోజువారీ అమ్మకాలు ఎలా ఉంటాయి మీకు? "

"ఏవరేజ్‌న రెండు వేలనుండి మూడు వేల లోపుగా..."

"అంటే నెలకి లక్ష లోపుగానే మీ వ్యాపారం జరుగుతుందన్న మాట. సరే. పువ్వులు ఎక్కడి నుండి తెప్పిస్తారు...? "

"ఫ్లవర్ మార్కెట్ నుండి"

"అంటే మీదైన సొంత నర్సరీ కానీ బొటానికల్ గార్డెన్స్‌తో డీలింగ్స్ కానీ మీకు లేవు. అంతేనా...? " సూటిగా అడిగాడు.

దాక్షిణ్యకి అతని ఉద్దేశం అర్థం కావడం లేదు. అందుకే అవునన్నట్లు తల ఊపింది. భీమేష్ పైకి లేచాడు. "ఐయామ్ సారీ మేడమ్. ఈ రోజు ఈ పార్టీకి చేసిన పూల అలంకరణ ఖర్చు రెండు లక్షల ఏభై వేలు. అంటే ఈ అలంకరణ చేసిన సంస్థ నెలసరి ఆదాయం ఏ స్థాయిలో ఉంటుందో మీరే ఊహించవచ్చు. రోజుకి మూడువేల ఆదాయాన్ని పొందే మీరు మహా అయితే చిన్న చిన్న బొకేలు, దండలు లేదా మిడిల్ క్లాసు పెళ్లిళ్ళకి అలంకరణ చెయ్యగలరేమో కానీ "న్యూ వే రియల్ ఎస్టేట్" లాంటి పెద్ద సంస్థల అవసరాలు మీరు తీర్చలేరు. పైగా మా కస్టమర్లు వివిధ ప్రాంతాలకు, వర్గాలకు చెందిన వ్యక్తులు. ఒక్కోసారి వాళ్లని ఇంప్రెస్ చెయ్యడానికి వారి ప్రాంతంలోనే దొరికే అరుదైన పుష్ప గుచ్ఛాలనిచ్చి సంతోషపెట్టాలి. కేవలం ఫ్లవర్ మార్కెట్‌లో కిలోల లెక్కన దేశీయ పువ్వులతో అలంకరించే మీ సంస్థ సామర్థ్యం మా అంచనాలను అందుకోలేదు. కనుక మిమ్మల్ని నిరాశ పరుస్తున్నందుకు క్షమించండి. సారీ గీతా" స్పష్టంగా చెప్పి వెళ్ళిపోయాడు.

అతని ప్రవర్తన దాక్షిణ్యలో ఉక్రోషాన్ని, ఆగ్రహాన్ని రెచ్చగొట్టింది. "ఇదేమిటే? ఎవరైనా పెద్ద ఆర్డర్ ఇస్తేనే కదా! నేను పెద్ద డీలింగ్స్ చేస్తూ నా సంస్థను పెంచుకోగలిగేది. అది వదిలేసి నీది పెద్ద సంస్థ కాదు అందుకే నీకు ఆర్డర్ ఇవ్వను అంటాడేమిటి? ఎవరే ఇతగాడు" కాస్త కోపంగా అడిగింది.

"భీమేష్, శ్రీకాంత్‌తో కలిసి లండన్‌లో ఎమ్. బి. ఎ. చదువుకున్న మిత్రుడు. క్రితం సంవత్సరం శ్రీకాంత్ తండ్రికి హార్ట్ ఎటాక్ రావడంతో కొడుకును వెనక్కి పిలిపించి వ్యాపారాన్ని అప్పచెప్పేశాడు. ఇంత వ్యాపారాన్ని తానొక్కడే నిర్వహించడం కష్టంగా భావించిన శ్రీకాంత్ తన ఫ్రెండ్‌ని సాయంగా పిల్చుకున్నాడు. ఇద్దరి ఆధ్వర్యంలో "న్యూ వే" బాగా అభివృద్ధి చెందింది. అందులో ఎక్కువ ఘనత భీమేష్‌కే చెందుతుంది. కాకపోతే మనిషి కాస్త తిక్కమేళం. చూశావుగా అఫీషియల్ లుక్ ఉన్న ఈ పార్టీకి జి. ఎమ్. స్థాయి వ్యక్తి ఎవరైనా అలా టీ షర్టు జీన్స్‌తో వస్తారా? అతనంతే, అదో టైపు. నువ్వేం అతని మాటలకి బాధ పడకు. ఎంత ఫ్రెండ్ అయినా శ్రీకాంత్ గారిదే ఫైనల్ డెసిషన్. నేను రేపెప్పుడో ఆయనతో మాట్లాడతాను. సరేనా!" ఓదార్పుగా అంది గీత.

'తిక్క కాదు తల పొగరు. ఇడియట్' కసిగా అనుకుంది దాక్షిణ్య.

## 2

**గీ**త, దాక్షిణ్య షాపుకి తిరిగి వచ్చేసరికి పది దాటింది. చిత్ర గీత ఇచ్చిన పుస్తకాన్ని చదువుకుంటోంది. కొట్టులో పనిచేసే మరియమ్మ పువ్వులను తీసుకొచ్చే అబ్దుల్లా, సుజాత బయట మెట్లమీద కూర్చుని పిచ్చాపాటి మాట్లాడుకుంటున్నారు. వీళ్లని చూస్తూ లేచి నిలబడ్డారు. చేతిలో బ్యాగ్ కౌంటరు టేబుల్ మీద పడేసి విసుగ్గా కణతలు నొక్కుకుంటూ కుర్చీలో కూలబడింది

# బళ్లారి రాఘవ



**బళ్లారి రాఘవ అద్భుతమైన రంగస్థల నటుడు. విశ్వకవి రవీంద్రనాథ ఠాగూర్, జార్జి బెర్నార్డ్ షా వంటి మహానుభావులే ఆయన మహానటుడని కీర్తించారు. తెలుగుజాతి గర్వంగా చెప్పుకోదగిన మహానట మేరువు ఆయన. న్యాయవాదిగా కూడా అపరిమిత కీర్తి గడించిన రాఘవ సమయస్ఫూర్తిలోనూ మేటి. వివిధ సందర్భాలలో ఆయన చేసిన చతుర వ్యాఖ్యలలో కొన్ని ఈనెల 'చతుర' పాఠకులకు ప్రత్యేకం..**

## కోర్టుకాదు.. మృగాలయం

బళ్లారిలో న్యాయవాదిగా బళ్లారి రాఘవ ప్రాక్టీస్ చేస్తున్న రోజుల్లో శివరావు అనే సీనియర్ న్యాయవాది ఉండేవాడు. ఆయనంటే న్యాయమూర్తులు సహా అందరికీ సింహస్వప్నమే. నిజంగా ఆయన వాదన సింహ గర్జనలాగే ఉండేది. ఇతర న్యాయవాదులు ఆయనకు ఎదురుపడడానికే సాహసించేవారు కాదు. అలాంటిది ఒకరోజున ఆయనతో ఓ కేసు విషయమై ప్రతివాదనకు దిగారు బళ్లారి రాఘవ.

ఈ సందర్భంగా ఆయన 'ఇది నాటకం కాదు.. రంగస్థలం అంతకన్నా కాదు' అన్నాడు సీరియస్‌గా. రాఘవ నటుడని చులకనగా ఆ పదాల్ని ఒత్తి ఒత్తి మరీ పలికాడు.

రాఘవేనా వెరిచేది?

అందుకే-'ఔను... ఇది కోర్టులా కూడా లేదు.. తమ గర్జనల మృగాలయంలా ఉంది' అని తిప్పికొట్టారు.

> **ఖర్చు గురించి భయపడకు నేను చూసు కుంటాను. కానీ ఒక్క షరతు. నువ్వు మానేసే రోజులకి తప్పనిసరిగా నాకు మరో మనిషిని అప్పగించాలి. లేదంటే చాలా కష్టమవుతుంది**

దాక్షిణ్య.

"ఏం అక్కా! వెళ్ళిన పని అయ్యిందా...?" చిత్ర అడిగింది.

"ఎక్కడా? అక్కడొకడు సైంధవుళ్ళా అడ్డుపడి అంతా చెడకొట్టాడు" కసిగా అంది.

"వదిలెయ్ దక్షా! శ్రీకాంత్‌గారితో నేను మాట్లాడి ఒప్పిస్తానన్నానుగా!" ఓదార్పుగా అంది గీత.

"మరి నేను వెళతానే ఇప్పటికే లేటయ్యింది." అంటూ బయలుదేరింది.

తాత్కాలికంగా తన విసుగు మర్చిపోయింది దాక్షిణ్య. "ఉండవే, అబ్దుల్లా దింపుతాడు" అని అబ్దుల్లాని పిలిచి "గీతని దింపేసి నువ్వు ఇంటికి వెళ్ళిపో. ఉదయం నాలుగింటికి లోడు వస్తుందని యాదగిరి చెప్పాడు. రేపు ఓ పెళ్ళి మండపం డెకరేషన్‌కి బంతిపూలు కావాలని ఆర్డర్ వచ్చింది. మిగిలిన రకాలతోపాటు అవి డెబ్బై కిలోలు తీసుకో. యాదగిరితో నేను మాట్లాడాను. అతడు ఏదైనా అంటే మధ్యాహ్నం నేనొచ్చి కలుస్తానని చెప్పు" చెయ్యవలసిన పనులు అప్పచెప్పి పంపింది.

"గీతక్కా! థాంక్స్ ఫర్ బుక్" వెళ్తున్న గీతకి చెప్పింది చిత్ర.

చిరునవ్వుతో చెయ్యూపి వెళ్ళిపోయింది గీత, అబ్దుల్లా ఆటో ట్రాలీలో.

"ఏం సుజాతా? ఇంకా వెళ్ళలేదు. పొద్దున్నే రావద్దా మళ్ళీ?" అగరబత్తీ వెలిగించి కేష్ కౌంటర్‌కి దేముళ్ళ పటాలకి తిప్పి చూపిస్తూ అడిగింది.

"చిత్ర ఒంటరిగా ఉందని సాయం ఉన్నాను మేడమ్"

"మరియమ్మా మిగిలిన పువ్వుల్ని జాగ్రత్త చేశావా...? లేదంటే వడలిపోతే అనవసరంగా పారబోసుకోవాలి. ఫ్రెష్‌గా లేకపోతే ఎవరూ కొనరు" అన్నింటికి తాళాలు వేస్తూ అడిగింది.

"పెట్టినానమ్మా. ఫిరుజులో కొన్ని పెట్టినా, హౌజులో నీళ్ళు పట్టి కాడలు మునిగే లెక్క కొన్ని పెట్టినా అగో కొన్ని కుండీ మొక్కలు పైన మేడపైన పెట్టినా, అన్నీ మంచిగానే ఉన్నాయమ్మా..." నలభై ఏళ్ళ మరియమ్మ చెప్పింది.

'సరే' అని బయటికి నడిచి తలుపులు మూసి షట్టర్‌కి తాళాలు వేసి ఆ గుత్తి మరియమ్మకి ఇచ్చి "అబ్దుల్లా ఐదు గంటలకల్లా సరుకు తెచ్చేస్తాడు. మీరు వచ్చి చిన్న బొకేలు కట్టండి. నేను ఆరు గంటలకల్లా వచ్చేస్తాను సరేనా?" చెప్పింది.

"నా కూతుర్ని పురిటికి తీసుకొచ్చినానమ్మా. కానుపు ఇంకో వారంలో అవ్వొచ్చని దవాఖానాలో చెప్పిండ్రు" చెప్పింది మరియమ్మ.

"ఖర్చు గురించి భయపడకు నేను చూసుకుంటాను. కానీ ఒక్క షరతు. నువ్వు మానేసే రోజులకి తప్పనిసరిగా నాకు మరో మని

షిని అప్పగించాలి. లేదంటే చాలా కష్టమవుతుంది" చిత్ర తెచ్చిన స్కూటీకి తన బేగ్ తగిలిస్తూ హెచ్చరించింది.

అంగీకారంగా తలూపిన మరియమ్మ మందులు కొనాలంటూ ఓ వంద తీసుకుని వెళ్లిపోయింది. సుజాతది కూడా మరియమ్మ ఇంటి ఏరియానే కావడంతో ఇద్దరూ కలిసి వెళ్లిపోయారు.

చిత్ర చెప్తున్న కాలేజీ కబుర్లకు "ఊ" కొడుతున్నా దాక్షిణ్య మనసు మాత్రం భీమేష్ మాటల గురించే ఆలోచిస్తోంది. ఎలాగైనా శ్రీకాంత్‌ని ఒప్పించి ఆ కంపెనీ కాంట్రాక్టు సంపాదించి మళ్ళీ వాడు నోరెత్తకుండా చేస్తాను. మనసులోనే శపథం చేస్తున్నట్లు అనుకుంది.

* * *

స్కూటీ ఆగిన చప్పుడికి వైదేహి చూస్తున్న టి.వి. కట్టేసి గుమ్మంలోకి వచ్చి చూసింది. చేతిలో బ్యాగ్ అక్కకి అందించి కాస్త పక్కగా ఉన్న గోలెంలోని నీళ్ళతో కాళ్ళు కడుక్కుంటూ "బామ్మ పడుకుందా? " అనడిగింది దాక్షిణ్య.

"పదకొండవుతోందిగా పడుకుంది" చెప్పింది వైదేహి.

"అక్కా! ఆకలి దంచేస్తోంది. నిద్ర ముంచుకు వస్తోంది. నువ్వే ఏ మాత్రం ఆలస్యం చేసినా నేనిక్కడే పడిపోతాను" లోనికి వస్తూనే చిత్ర హెచ్చరించింది. పక్క వాటాలోంచి గుప్పుమని వస్తున్న ఇంగువ పరిమళాన్ని గమనించి "అబ్బా! పదకొండవుతున్నా సావిత్రమ్మగారు ఏదో చేస్తూనే ఉన్నారు. ఆవిడ ఓపికకి నిజంగా మెచ్చుకోవాలి" లోపలికి నడుస్తూ అంది దాక్షిణ్య.

"ఎవరింట్లోనో పెళ్ళికి కందిపొడి, గోంగూర పచ్చడి, అప్పడాలు చెయ్యమని ఆర్డర్ వచ్చిందిట. ఆలస్యమైతే వాళ్ళు మనసు మార్చుకుని కేటరింగ్ వాళ్ళకే ఇచ్చేస్తారేమోనని.ఆవిడ భయం" నవ్వింది వైదేహి.

ముందుగదిలో బామ్మని పెనవేసుకొని నిద్రపోతున్న ఏడేళ్ళ చిన్నూ తల నిమిరి, సుతారంగా నుదురు చుంబించి నైటీ వేసుకొని వచ్చి భోజనానికి కూర్చుంది. అప్పటికే అన్నం కూరలు వడ్డించిన వైదేహి ఆవకాయ వేస్తూ "కాలీఫ్లవర్ ఆవకాయట. సావిత్రమ్మగారు ఇచ్చారు. మీకు నచ్చితే ఒక కిలో మనకీ పెట్టిమ్మంటాను" చెప్పింది.

కొద్దిగా కలుపుకొని తిని చూసి "ఊఁ! బాగానే ఉంది." కళ్ళెగరేసింది చిత్ర.

"అయితే రేపే పెట్టిమ్మంటాను" అని తన కంచం దగ్గరకి లాక్కుంది వైదేహి. కొద్దిగా ఉప్పేసిన తోటకూర, కారం, పులుపు లేకుండా నీళ్ళలాంటి చారు, పల్చటి మజ్జిగ తేటవేసుకు తింటున్న అక్కని చూస్తూంటే మనసు చివుక్కుమంటోంది. కానీ పెళ్ళయిన వారానికే భర్తని కోల్పోయిన వైదేహి తనకి తానుగా ఆ శిక్ష కోరి వేసుకుందనే విషయం వాళ్ళని ఏమీ అనలేని నిస్పృహాయులను చేస్తోంది.

"దక్షా! రేపు కిరాణా కట్టాలి. ఓ రెండు వేలు ఇవ్వవే" వేద అడగడంతో ఆలోచనల నుండి తేరుకొని "నిన్ననే ఇచ్చాను కదక్కా...? " ఆశ్చర్యంగా అడిగింది. "ఇచ్చావనుకో. కానీ ఆ డబ్బు సావిత్రమ్మగారు అడిగితే ఇచ్చాను. ఆవిడకు డబ్బందడానికి ఇంకా టైమ్ పడుతుందట" సంజాయిషీగా అంది. మధ్య తరగతి కుటుంబాల్లో ఇరుగు పొరుగు వాళ్ళ మధ్య అలాంటి చేబదుళ్ళు సహజమే కనుక దాక్షిణ్య ఆ విషయానికి పెద్ద ప్రాధాన్యత నివ్వలేదు.

"చెక్కు రాసి ఇస్తాను. భాస్కర్ చేత తెప్పించుకో"

"ఎందుకక్కా! షాపు నుండి మూడువేలు తెచ్చాంగా! అందులో రెండువేలు ఇచ్చేసెయ్. మళ్ళీ బ్యాంకుకి వెళ్ళడం, డ్రా చెయ్యడం ఈ తలనొప్పులెందుకు? " చిత్ర సలహా ఇస్తున్నట్లుగా అంది.

"చిత్రా! చిన్న పిల్లలా మాట్లాడకు. వ్యాపా

రంలోని డబ్బును సొంత ఖర్చులకు వాడకూడదనేది ముఖ్య వ్యాపార సూత్రం. అలా వాడేస్తే నీ సొంత అవసరాలకు ఎంత వాడావు? వ్యాపారాభివృద్ధికి ఎంత వాడావు? అనేది లెక్కతేలదు. అక్కా, దీని మాటలకేం కానీ నేను చెక్కు రాసిస్తాను. భాస్కర్‌ని తెమ్మను" చెప్పి భోజనం ముగించి తన గదిలోకి వెళ్ళి టేబుల్ లైట్ వేసుకొని షాపుకు సంబంధించిన ఆ రోజు జమా ఖర్చులను రాసుకోవడంలో లీనమైపోయింది. చిత్ర అప్పటికే నిద్రలోకి జారుకుంది. వైదేహి తలుపులన్నీ మూసి గేటుకి తాళం పెట్టి హాలులో బామ్మ మంచం పక్కన తుంగ చాప వేసుకొని నిద్రకు ఉపక్రమించింది.

## 3

సరిగ్గా అదే సమయానికి 'న్యూవే' జి.ఎమ్. ఇంటి ముందు ఓ కారు వచ్చి ఆగింది. ఆపే వాళ్ళు అడ్డుకొనే వాళ్ళూ లేక పోవడంతో అందులోంచి దిగిన వ్యక్తి బేఫికర్‌గా తిన్నగా బెడ్‌రూమ్‌లోకి వెళ్ళిపోయాడు. అక్కడ కాస్త పక్కగా ఉన్న టేబుల్ పైన ఉన్న కంప్యూటర్ ముందు కూర్చుని ఏవో ప్రోగ్రాం ఫీడ్ చేస్తున్న భీమేష్ భుజాలపై బలంగా రెండు చేతులు వేసి "హాయ్" అన్నాడు ఆ వ్యక్తి.

ఉలిక్కి పడ్డట్టు ఒక్క క్షణం పాజ్ నొక్కి "నువ్వా, ఉలిక్కిపడ్డా తెలుసా? అయినా వచ్చిన అతిథులను సాగనంపడంలో బిజీగా ఉంటావను కొంటే ఇలావచ్చావేమిటి? " పాజ్‌ని రిలీజ్ చేస్తూ శ్రీకాంత్‌ని అడిగాడు.

"అందర్నీ పంపడం అయిపోయింది. నువ్వేమిటీ చెప్పా పెట్టకుండా వచ్చేశావ్' ' ఫ్రిజ్ తెరుస్తూ అడిగాడు శ్రీకాంత్.

"అంకుల్‌కి చెప్పే వచ్చాను. బీర్ కావాలంటే ఉంది"

"ఊహూ! వద్దొద్దు. ఎంత కర్టెసీ కోసం తాగినా మూడు పెగ్గుల పైనే తాగాను. ఇంకా బీరు కూడా తాగే ఓపిక లేదు. నోరు వాసన కొడుతోంది. పళ్ళు తిందామని" చెబుతూనే ఏపిల్ తీసుకుని తింటూ వచ్చి మంచంమీద కూర్చుని "నువ్వేమిటి అర్ధరాత్రి పి.సి. ముందు కూర్చున్నావు? ఎవరైనా అమ్మాయితో చాటింగా? " కొంటెగా అడిగాడు

ఒకసారి శ్రీకాంత్ కేసి చూసి చిన్నగా నవ్వి "నాకంత ఛాన్స్ లేదని నీకు చెప్పినట్లు గుర్తు. ఇది ఆర్.కె. గ్రూప్ వాళ్ల ఊటీలో లేండ్‌తోసహా కుదిర్చి హోటల్ కట్టడానికి ఆర్డర్ ఇచ్చారు కదా! మన కొటేషన్ పంపుతున్నాను" చేస్తున్న పని ఆపకుండానే చెప్పాడు.

"ఏమిటంత కంగారు? ఉదయం ఆఫీసులో చేసుకుంటాం కదా" అంటూ దిండు తల కిందకు లాక్కొని, మంచానికి అడ్డంగా పడుకుని భీమేష్‌ని పరిశీలనగా చూశాడు. షార్టు ప్యాంటు, బ్లూ కలర్ బనీనుతో చాలా నార్మల్‌గా ఉన్నాడు. అంతలోనే గుర్తొచ్చి "అవును, పార్టీకేంద్రా, టీ షర్టు, జీన్స్‌తో వచ్చేశావు. నువ్వు ఒక పెద్ద కంపెనీ జనరల్ మేనేజర్‌నని మర్చిపోయావా? "

"శ్రీ! పిచ్చిగా మాట్లాడకు. నేను నా హోదాని ప్రదర్శించాల్సింది ఆఫీసులో కానీ



బయట కాదు. అయినా నీకు తెలుసు నాకా ఇన్‌షర్టు చేసిన చొక్కా పైన కోటు, మెడలో ఉరి తాడులా ఆ నెక్‌టై ఇవన్నీ చిరాకని. వాటిని నేను లండన్‌లోనే వేసుకోలేదు. ఇంక ఇంత వేడి దేశంలో అవన్నీ వంటికి అతికించుకుని చాలా సంతోషంగా ఉన్నట్లు నటించడం నా వల్ల కాదు" చిరాగ్గా చెప్పాడు.

శ్రీకాంత్ నవ్వేశాడు. "నిజమేరా. బట్టల విషయంలో నీది గాంధీ సిద్ధాంతం" అత నన్న తీరుకి భీమేష్ కూడా నవ్వేశాడు. పని ముగించి పి.సి.ని ఆఫ్‌చేసి, కుర్చీతోసహా మంచం దగ్గరికి వచ్చి "పార్టీ బాగా జరిగింది కదూ! ముఖ్యంగా కలర్స్ బాగున్నాయి. ఎవరైనా నచ్చారేంటి? " కొంటెగా అడిగాడు.

"జస్ట్ నార్మల్. అంత ప్రత్యేకత ఏమీ లేదు" కొట్టిపారేశాడు శ్రీకాంత్.

"నో శ్రీ! మరోసారి ఆలోచించు. ఆంటీ నీ పెళ్ళి గురించి కంగారు పడుతోంది" కాస్త పక్కకి తిరిగి సూటిగా చూస్తూ చెప్పాడు. "భీమా, పెళ్ళంటే జీవితకాలపు ఒప్పందం. మన స్వేచ్ఛని, ఇష్టాలని మరో వ్యక్తి కోసం మార్చుకోవడం. ఇంతవరకు అలవాటు లేని బాధ్యతను, బంధాలను ఒక్కసారిగా నెత్తిన



వేసుకోవడం, ఇవన్నీ అమ్మా నాన్నల కోసం హఠాత్తుగా భరించడం నా వల్ల కాదు. నా దృష్టిలో ఈ వయసే అందుకు తగింది కాదు. దేముడు ఇరవై నుండి ముప్పై మధ్య కాలాన్ని పూర్తిగా ప్రతి వ్యక్తి తన ఆనందం కోసం జీవించడానికి మాత్రమే ఇస్తాడు. కనుక నాకింకా పెళ్ళి వయసు రాలేదు. ఆ ఆలోచనా లేదు. అదే ముప్పై ఏళ్ల అనంతరం అంటావా? మనసు విశ్రాంతిని, మన అనే తోడును కోరుతుంది. అప్పుడు పెళ్ళి అవసరం. పెళ్ళి పట్ల నా అభిప్రాయమిది"

శ్రద్ధగా వింటున్న భీమేష్ మొహం ఎందుకో కాస్త కళ తప్పింది. కుర్చీలో వెనక్కి వాలి, "నిజమే శ్రీ. మనిషి జీవితంలో తన గురించిన నిర్ణయాలు తానుగా తీసుకునే ఆత్మవిశ్వాసం, మనో నిబ్బరం ఉండాలి. అలాకాక, పెద్దవాళ్ల మాటమీదే గుడ్డిగా నడవడం అలవాటు చేసుకుంటే, ఓ స్థాయిలో నిలబడి వెనక్కి చూసుకుంటే దిద్దుకోలేని తప్పులతో నిండిన తప్పటడుగులు మాత్రమే కనిపిస్తాయి" గంభీరంగా అన్నాడు.

శ్రీకాంత్ అతని ఎమోషనల్ ఫీలింగ్స్ అర్థంకాక "ఏమిటిరా హఠాత్తుగా వేదాంతం మాట్లాడుతున్నావు?" లేచి కూర్చుంటూ అడిగాడు.

తేరుకున్న భీమేష్ తన ఇబ్బందిని కప్పిపెట్టుకోడానికి పైకి నవ్వేస్తూ, "వినడానికి నువ్వు ఉన్నావని చెప్పాను" అన్నాడు.

"నా సంగతి సరే కానీ, నీకెవరైనా నచ్చారా ఏం" శ్రీకాంత్ అడిగాడు.

భీమేష్‌కి ఆ ప్రశ్నకు బదులివ్వడం ఇష్టం లేదు. అందుకే లేచి కాలితో కుర్చీని టేబుల్ వైపుకి నెట్టేసి తలుపులు మూసి వస్తూ యధాలాపంగా అడిగాడు "ఇందాక పార్టీలో గీత ఎవరో స్నేహితురాలిని తీసుకొచ్చింది చూశావా?" అతనితో వచ్చి కారుని షెడ్‌లో పార్క్ చేసి వచ్చిన శ్రీకాంత్ సూట్ తీసేసి నైట్ డ్రెస్ తొడుక్కుంటూ.

"ఏమో! ఆ సందడిలో ఎవరెవరిని కలిశానో గుర్తులేదు. ఏం?" అడిగాడు.

"ఊహూ! నేను ఆ అమ్మాయితో మాట్లాడాను. పేరు ఏదో ఉంది దయ, కృపో. అలాగే ఉంటుంది. షి ఈజే ఫ్లోరిస్టు" పక్క సరిచేసి దిండు సరిగా పెడుతూ చెప్పాడు.

"అయితే...!?"

"మనం కంపెనీ తరపున నిర్వహించే



**పెద్దవాళ్ల మాటమీదే గుడ్డిగా నడవడం అలవాటు చేసుకుంటే, ఓ స్థాయిలో నిలబడి వెనక్కి చూసుకుంటే దిద్దుకోలేని తప్పులతో నిండిన తప్పటడుగులు మాత్రమే కనిపిస్తాయి**

పార్టీలకి, ఫంక్షన్లకి డెకరేషన్ చేసేందుకు ఆర్డర్ ఇమ్మని అడిగింది. కానీ, ఆ అమ్మాయిది చాలా చిన్న బిజినెస్. మన స్థాయికి తగ్గ ఏర్పాట్లు చెయ్యడం కష్టం. అందుకే కుదరదన్నాను" శ్రీకాంత్ పక్కన పడుకొంటూ చెప్పాడు.

"చెప్పేశావుగా! ఇంకేంటి?" తేలిగ్గా అన్నాడు.

"నా అంచనా ప్రకారం గీత మళ్ళీ నీ దగ్గర ఆమె ప్రసక్తి తప్పనిసరిగా తెస్తుంది. చూడబోతే చాలా పట్టుదల గల మనిషిలా ఉంది"

"కంపెనీ మనిద్దరిదీ. దానికి సంబంధించిన నిర్ణయాలు ఎవరు తీసుకున్నా రెండో వ్యక్తి గౌరవించాలి అన్నది మన ముఖ్య నియమం. గీతకి అదే చెబుతాను" శ్రీకాంత్ బదులిచ్చాడు.

రెండు క్షణాలు ఆలోచనలో గడిపిన

భీమేష్ శ్రీకాంత్‌కేసి వత్తిగిల్లి "కానీ శ్రీ, మనం ఆ అమ్మాయికి ఓ ఆఫర్ ఇవ్వొచ్చు పార్టీలకు తగ్గ స్థాయిలో లేకపోయినా రోజూ మన ఆఫీసు డెకరేషన్‌కి, మన వీక్లీ కాన్ఫరెన్స్ హాలులను అలంకరించే అవకాశం ఆమెకి ఇవ్వొచ్చు అందువల్ల ఆ అమ్మాయికి మనం ఒక స్థిరమైన ఆదాయ మార్గం చూపించినట్లు ఉంటుంది. తన పని మనకి సంతృప్తికరంగా ఉంటే కొనసాగించవచ్చు లేదంటే తీసేయవచ్చు ఏమంటావు? " అడిగాడు.

"భీమా! నేను మన కంపెనీకి కేవలం ప్రెసిడెంట్‌లాంటివాడిని. నువ్వు తీసుకొనే నిర్ణయాలు సరైనవేనని నా నమ్మకం. ఆఖరుగా నా దగ్గరకి కాగితాలు పంపిస్తే సంతకాలు చేస్తాను. అంతే" శ్రీకాంత్ దృఢంగా చెప్పాడు.

"థాంక్స్, చిన్న విషయాలకు ఫరవాలేదు. పెద్ద పెద్ద నిర్ణయాలకు కూడా ఇదే పద్ధతి పాటిస్తే నేనేదైనా తప్పుడు నిర్ణయం తీసుకుంటే ఓ గుడ్డివాడి చేయి పట్టుకొని మరో గుడ్డివాడు వెళ్లినట్లు తిన్నగా గోతిలో పడతాం" హెచ్చరికగా అన్నాడు.

శ్రీకాంత్ బదులు పలకలేదు. కొద్దిగా పైకి లేచి బెడ్‌లాంప్ వెలుగులో అతను నిద్రలోకి జారుకోవడం గమనించి 'ఇట్టే నిద్రపోతాడు. లక్కీమేన్' అనుకుంటూ తను నిద్రించడానికి ప్రయత్నించసాగాడు. అతని కళ్లకి వద్దనుకున్నా తను చెప్పే మాటలకి ఉక్రోషంతో, ఆగ్రహంతో ఎర్రబడుతున్న దాక్షిణ్య మొహం కనిపించసాగింది. ఎవరా అమ్మాయి? చూసింది కొద్ది నిమిషాలపాటే అయినా ఎందుకు నన్నింతగా ఆకర్షిస్తోంది? ఆ అమ్మాయితో అంత కరాఖండిగా మాట్లాడిన నాకు ఇప్పుడు ఆమె గురించి ఆలోచించే అర్హత ఉందా? అన్నీ పిచ్చి ప్రశ్నలులాగే అనిపిస్తూంటే లేచి ఫ్రిజ్ లోంచి మంచినీళ్లు తీసుకొని తాగి వచ్చి పడుకొని ఆలోచనలను మళ్లించుకోడానికి ఆర్.కె. వాళ్ల కాంట్రాక్టు గురించి మనసులోనే లెక్కలేయడం మొదలు పెట్టాడు.




ఉదయం తొమ్మిది గంటల సమయం.

వైదేహి బట్టలు ఆరేస్తోంది. చిత్రా, చిన్నా "బాయ్ పెద్దక్కా" అని చెప్పి వెళ్లిపోయారు. వైదేహి దృష్టి మాత్రం సావిత్రమ్మ గారి వాటాపైనే ఉంది. చేతిలో చిన్న బ్యాగ్‌తో, టిఫిన్ బాక్స్‌తో బయటకి వచ్చిన భాస్కర్ "అమ్మా! అవన్నీ సిద్ధం చేసి ఉంచు. నేను సాయంత్రం రాగానే తీసుకెళ్లి ఇచ్చి వస్తాను" సైకిల్ బయటకి తీస్తూ అరిచి చెప్పాడు. అతను తన ముందు వరకు వచ్చేదాకా ఆగి, "భాస్కర్‌గారూ! ఒక్క నిమిషం. మా చెల్లెలు చెక్కు ఇచ్చింది. కొంచెం బ్యాంకు నుండి డబ్బులు తెచ్చిపెడతారా? " అడిగింది.

"ఓవర్‌సీస్ బ్యాంక్‌దే కదా! చెక్కు ఇవ్వండి. డబ్బులు సాయంత్రం రాగానే ఇస్తాను. బ్యాంకుకి వెళ్ళి మీకు డబ్బు ఇచ్చి ఫ్యాక్టరీకి వెళ్ళాలంటే ఆలస్యం అవుతుంది" ఆగి చెప్పాడు.

వేద ఇబ్బందిగా కదిలింది. "ఇంట్లో సరుకులు నిండుకున్నాయి. కిరాణా బాకీ కట్టకుండా తేవడం నాకిష్టం లేదు. పోనీలెండి. దక్షకి ఫోన్ చేసి ఎవరి చేతైనా తెప్పించుకుంటాను"

భాస్కర్ వెళ్ళబోయి ఆగి సైకిల్ స్టాండు వేసి "మీ ఫోన్ ఒకసారి- వాడుకోవచ్చా? " అడిగాడు.

ఎందుకో అర్థం కాకపోయినా అంగీకారంగా తల ఊపింది.

# ఫైబర్ పవర్



"కుట్టించిన బట్టలన్నీ రెణ్ణెలు తిరక్కముందే టైటవుతున్నాయి గూరూ! బరువు పెరుగుతోంది... బట్టలు బిగుతవుతున్నాయంటూ వాపోయే బరువురాయుళ్లూ దిగులు పడకండి. ఇక మీదట పీచు పదార్థాలెక్కువగా ఉండే ఆహారం తీసుకోండి. పెరిగే బరువు మంత్రం వేసినట్టు మాయం అవుతుందంటున్నారు హార్వార్డ్ యూనివర్శిటీ నిపుణులు. పీచు పదార్థాలున్న ఆహారం తీసుకోవడం వల్ల అవి ఉదరంలోకి వెళ్ళగానే ఉబ్బిపోయి, మరే ఇతర ఆహారానికి కాస్త చోటు కూడా ఇవ్వవట.

పీచు పదార్థాలు బ్లడ్ షుగర్‌ని తగ్గించి, ఇన్సులిన్ పరిమాణాన్ని నియంత్రిస్తాయట. మన శరీరానికి పీచు పదార్థాల్ని విచ్ఛిన్నం చేసే కెపాసిటీ లేకపోవటం వల్ల అవి తిన్నగా జీర్ణకోశంలోకి వెళ్ళిపోతాయట.

ఒక గ్లాసు యాపిల్ జ్యూస్‌లో ఏ విధమైన పీచు పదార్థాలూ లేకపోగా 117 కాలరీలుంటాయట. అదే పై పొట్టు తీయని యాపిల్ ముక్కలలో 3.4 గ్రాముల పీచు పదార్థంతో బాటు 74 కాలరీలే ఉంటాయట.

కాబట్టి బరువు బాధ నుంచి విముక్తులు కావాలనుకుంటే ఫాస్ట్‌ఫుడ్లు, బర్గర్లూ మానేసి పీచు పదార్థాల్ని తీసుకోవడమే మేలు.

లోపలికి వెళ్ళి ఐదు నిమిషాల్లో వచ్చి.. "నేను ఓ గంట ఆలస్యంగా రావడానికి పర్మిషన్ తీసుకున్నాను. మీరు నాతో వస్తే నేను డబ్బు డ్రా చేసి ఇస్తాను. మీరు కిరాణ కొట్టుకు, నేను ఫ్యాక్టరీకి వెళ్ళిపోవచ్చు" చెప్పాడు.

"ఇదేదో బాగానే ఉందే వేదా, ఆ పని చెయ్యి" బామ్మ ప్రోత్సహించింది. వైదేహి మిగిలిన బట్టల్ని దండెం మీద పరిచేసి పది నిమిషాల్లో చీరమార్చుకొని వచ్చింది. ఆమె కోసం సైకిల్‌ని నడిపించుకుంటూ బయలుదేరాడు భాస్కర్!

"క్షమించండి! నావల్ల మీకు ఆలస్యమవుతోంది" క్షమాపణ చెబుతున్నట్లుగా అంది. ఒక్క క్షణం ఆమెకేసి చూసి "క్షమాపణ నేను అడగాలి. మీ డబ్బుని వాడుకున్నది మేమేగా! అమ్మ చెప్పింది. నిన్న మీ దగ్గర అప్పు తీసుకొన్న విషయం"

"అదేం లేదు. ఆ టైముకి నా దగ్గర ఉన్నాయి కనుక ఇచ్చాను"

"అది మీ మంచితనం. నా జీతం పదో తారీఖు దాటితే కానీ రాదు. ప్రతినెలా మీ దగ్గర ఈ చేబదుళ్ళు తప్పడంలేదు. ఏం చెయ్యాలి. నేను టెన్త్ చదువుతుండగానే నాన్న చనిపోయారు. అమ్మా, తమ్ముడు, చెల్లెళ్ళ బాధ్యత నా మీద పడింది. నా చదువుకి ఫ్యాక్టరీ డైలీ లేబర్ ఉద్యోగమే దొరికింది. ఆనాడు అదే భాగ్యమనిపించింది. ఏదో ఇన్నాళ్ళు అమ్మ పచ్చళ్ళతో, చెల్లెలి టైలరింగ్‌తో కొంత బాధ్యత నెట్టుకొచ్చాను. ఇంకా రాణి ఒక్కర్తి ఉంది. దానికే సంబంధం కుదిరేలా ఉంది. అది సెటిలైె దాని బాధ్యత కూడా తీరిపోతే, అమ్మచేత ఈ వంటలు, ఊరగాయల చాకిరి మాన్పించి సుఖంగా ఉండమంటాను.

నాకొచ్చేది మా ఇద్దరికి సరిపోతుంది"

ఫక్కున నవ్వింది వైదేహి. "రాణి పెళ్ళితో బాధ్యతలు తీరిపోతాయన్నట్లు మాట్లాడతారేంటి? ఆపై మీకు మీ భార్య, పిల్లలు సంసారం అనే కొత్త ఝుంఝాటాలు మొదలౌతాయి"

విషాదంగా నవ్వాడు భాస్కర్, "ఊహూ! నా బతుకు నేనే మొయ్య లేని బండరాయి. దానిని మరో అమాయకురాలికి గుదిబండ చెయ్యలేను" తల అడ్డంగా ఊపుతూ అన్నాడు.

వైదేహి కూడా తలని అనంగీకారంగా ఊపింది. "మీ ఊహ తప్పు. ఎందుకంటే తన భర్త, పిల్లలు తనదైన సంసారం అనేది ప్రతి ఆడపిల్లాకనే అందమైన కల. ఆ కలని సాకారం చేసుకోడానికి ఆమె ఆర్థికపరమైన అన్నిరకాల కష్టాలను సంతోషంగా ఎదుర్కొంటుంది" సాలోచనగా అంది.

భాస్కర్ విచిత్రంగా చూసి చిన్నగా నవ్వాడు. "ఆ కల తాలూకు ఇష్టం మీ గొంతులో స్పష్టంగా తెలుస్తోంది." యధాలాపంగా అన్నాడు.

ఉలిక్కిపడ్డట్టు చూసిన వైదేహి కళ్ళలో నీలినీడలు కమ్ముకున్నాయి. బ్యాంకు సమీపించడంతో తన భావాలను కప్పిపుచ్చుకుంటూ "ఈరోజు జనం ఎక్కువగా ఉన్నారు. మీకు ఫ్యాక్టరీకి ఆలస్యం అవుతుందేమో!" లోపలికి నడుస్తూ సానుభూతిగా అంది.

ఆమె దగ్గర నుండి చెక్ అందుకొంటూ, "ఫరవాలేదులెండి. అవసరమైతే హాఫ్ డే లీవ్ పెడతాను. సరుకులు తీసుకొని మిమ్మల్ని ఇంటి దగ్గర దింపేసి నేను భోజనం చేసి ఫ్యాక్టరీకి మధ్యాహ్నం నుండి వెళతాను" చెప్పాడు, టోకెన్ కౌంటర్ కేసి నడుస్తూ.

"జీతం పోతుందేమో?" ఆందోళనగా అడిగింది.

రెండు క్షణాలు ఆలోచించి "రెండు నుండి ఎనిమిది దాకా సెకండ్ షిఫ్ట్ రాయించుకుంటాను. అలాగైతే జీతం కట్ అవదు" అనేసి కౌంటర్ దగ్గరకెళ్లాడు.




రెండు రోజుల అనంతరం, ఉదయం పదకొండు గంటల సమయంలో గీత హడావిడిగా ఫోన్ చేసింది. "దక్షా! శ్రీకాంత్‌గారు నిన్ను కలవడానికి ఒప్పుకున్నారు. వెంటనే బయలుదేరి రా!" అని చెప్పింది. ఖాళీ సమయం కావడంతో షాపు సుజాతను చూడమని చెప్పి బయలుదేరి వెళ్లింది దాక్షిణ్య. అతని ఆఫీసు రూమ్‌లోనే మీటింగ్ ఏర్పాటుచేసి గీత ఆమెను తీసుకెళ్లి పరిచయం చేసింది. భీమేష్ కూడా అక్కడే ఉండి ఏదో ఫైల్ చూస్తున్నాడు. కానీ వీళ్లని మర్యాదకి కూడా పలకరించలేదు. దక్ష కూడా అతన్ని పట్టించుకోలేదు. శ్రీకాంత్‌కి నమస్కరించి కూర్చుంది. గీత, దక్ష షాపు వివరాలను, ఆమె కోరికను వివరించింది.

రెండు నిమిషాల అనంతరం శ్రీకాంత్ కుర్చీలో కాస్త ముందుకు వాలి, "మిస్ దాక్షిణ్య, ఈ విషయం గురించి మీరు ఇంతకుముందే మా భీమేష్‌తో మాట్లాడారని, అతను అందులోని సాధ్యాసాధ్యాల గురించి మీకు వివరించాడని భీమ్ నాకు చెప్పాడు" శ్రీకాంత్ ఆగాడు.

దాక్షిణ్య కాస్త కోపంగా భీమేష్‌కేసి చూసింది. అసలు అతను ఈ సంభాషణ మీదే దృష్టి సారించలేదు. "సారీ సార్, ఎదుటివాళ్ల శక్తి సామర్థ్యాలను తక్కువగా అంచనా వేస్తున్నారు మీ ఫ్రెండ్. ఎదగాలి అంటే మీకైనా, నాకైనా పెద్ద మొత్తంలో కలిసివచ్చే అవకాశాలు రావాలి. అంతే

కానీ అంతా ఊహకే వదిలేస్తే ఎలా? " కాస్త రోషంగా ప్రశ్నించింది.

"నేను ఒప్పుకుంటాను దాక్షిణ్యా. అందుకే నేను మీకో అవకాశం ఇస్తున్నాను. మా భీమ్ ఉద్దేశం ప్రకారం మీరు పెద్ద ఫంక్షన్లను మా తరపున నిర్వహించలేరు. కానీ నిత్యం మీతో, మీ పువ్వులతో మాకు మీ అలంకరణను వినియోగించుకునే అవకాశం నేను ఇస్తాను. మీరు అంగీకరిస్తారా? " అడిగాడు.

దాక్షిణ్య, గీతా అర్థం కానట్లు మొహాలు చూసుకున్నారు. శ్రీకాంత్ లేచి పచార్లు చేస్తూ చెప్పాడు. మా ఆఫీసు చూశారుగా, ఇది మూడంతస్తుల బిల్డింగ్. ఒక్కో ఫ్లోర్ లోనూ కనీసం ఇరవై బ్లాకులు ఉన్నాయి. గ్రౌండ్ ఫ్లోర్, రిసెప్షన్, మిగతా రెండు ఫ్లోరులలో ఒకదాంట్లో మా వీక్లీ కాన్ఫరెన్స్‌లు జరిగే హాలు. నాది, భీమేష్ కాబిన్‌లు ఇతర సిబ్బందికి చెందిన సెక్షన్లు ఉన్నాయి. ఇవన్నీ రోజూ తాజా, సుగంధ పుష్పాలతో అలంకరించాలి. తోరణాలే కడతారో, లేక కుండీలే పెడతారో మా కనవసరం. అవి మా కంటికి, మనసుకి ఉల్లాసం కలిగించేలా ఉండేలా చూస్తే చాలు. దీనికి ఇంతవరకు డెకరేట్ చేసే ఫ్లోరిస్టుకి ఎంత ఇస్తున్నామో, మీకు అంతే ఇస్తాం. కనీసం ఆరునెల్ల కాంట్రాక్టు. ఈలోగా మీపని మాకు నచ్చితే మీరు కోరిన ఫంక్షన్ల తాలూకు పెద్ద పెద్ద ఆర్డర్‌లు తప్పకుండా ఇవ్వడం జరుగుతుంది" శ్రీకాంత్ తాను ఇవ్వదలచుకున్న ఆఫర్‌ని వివరించాడు. దాక్షిణ్య ఆలోచనలో పడింది. ఒకేసారి అందలాలకి ఎగరడం కన్నా ఒక్కో మెట్టుగా ఎక్కడం మేలు అన్న సూత్రం గుర్తొచ్చి గీతకేసి సాభిప్రాయంగా చూసింది. ఆమె కూడా కళ్లతోనే అంగీకరించమన్నట్లు సైగ చేసింది. "సరే సార్, మీ ఇష్టం. కాంట్రాక్ట్‌పై ఎప్పుడు సంతకాలు చెయ్యాలి" అడిగింది.

శ్రీకాంత్ సంతృప్తిగా చూశాడు. "నేను కాగితాలు సిద్ధంచేసి గీతతో కబురు చేస్తాను" ఇక మీరు వెళ్లవచ్చు అన్నట్లు తిరిగి తన సీట్లో కూర్చుని తన ముందు పేపర్స్ దగ్గరికి లాక్కున్నాడు. అతనికి కృతజ్ఞతలు చెప్పి ఇద్దరూ బయటపడ్డారు. గీత వాచీలో టైమ్ చూసుకుని, "దక్షా, లంచ్ టైమ్ అయిపోయింది. ఒక్క నిమిషం ఉండు. నేను వెళ్లి నా లంచ్ బాక్స్ తెచ్చుకుంటాను. కింద కేంటీన్‌లో నువ్వు కూడా భోజనం చేసి తిన్నగా షాపుకి వెళ్లిపోవచ్చు" చెప్పింది.

లిఫ్ట్ కిందకి వెళ్లడంతో "సరే, నువ్వెళ్లు. నేను ఇక్కడే ఉంటాను" చెప్పింది. గీత తన సీటువైపు వెళ్లిపోయింది.

చేతులు కట్టుకొని కళ్ళతోనే కలయచూస్తూంటే, దగ్గరగా "హలో" అనే పిలుపు వినబడి ఉలిక్కిపడి చూసింది. ఎదురుగా లిఫ్ట్ డోర్ తెరుస్తూ భీమేష్. మనిషిలోనూ, వేషధారణలోనూ పెద్ద మార్పేలేదు. పొడుగు చేతుల గ్రీన్ చెక్స్ షర్టుని మడ్‌కలర్ ప్యాంటులోకి టక్ చేశాడు. అంతే, అతని డ్రస్ కాంబినేషన్ విచిత్రంగా ఉంది. ఏ కోశానా ఓ కంపెనీ జి.ఎమ్. అనే భావన కలగదా వ్యక్తిని చూస్తే. దానికితోడు శ్రీకాంత్ తనకి పెద్ద ఆఫర్ ఇవ్వకపోవడానికి అతనే కారణమనే భావన ఆమెలో అతనికి తిరిగి బదులివ్వడానికి అయిష్టతను కలిగించి మొహం పక్కకి తిప్పుకుంది. అంతలో వచ్చిన గీత "హలో సార్", మర్యాదకి పలకరిస్తూ నిలబడిపోయిన దాక్షిణ్యను లిఫ్ట్‌లోకి లాగింది. గ్రౌండ్‌ఫ్లోర్ నొక్కాడు భీమేష్.

"కంగ్రాట్యులేషన్స్" ముందుగా తనే అభినందిస్తూ మాట కలిపాడు.

"అవసరం లేదు" అనబోయి గీత మోచేత్తో పొడవడంతో "థాంక్స్" ముక్కుబడిగా బదులిచ్చింది.

"మీకు ఇంతకుముందు ఆఫీసులకు అలంకరణ చేసిన అనుభవం లేదు కనుక ఒక

# ఉత్తమ నవలలకు ఆహ్వానం

మీరు విలక్షణ రచయితలా
వైవిధ్యమంటే మీకు మక్కువా
వినూత్నంగా అక్షరాన్ని సంధించడం మీ అభిలాషా

మరింకేం, వెంటనే స్పందించండి.

మీకు నవ్య నవలా వేదిక

చతుర సాదర స్వాగతం

నెలనెలా అప్రతిహతంగా ఉత్తమ నవలను పాఠకులకు అందిస్తున్న చతుర రానున్న సంచికలను మరింత అద్భుతంగా వెలువరించాలని సంకల్పిస్తోంది. అశ్లీలతకు తావు లేకుండా, మానవతా విలువలతో ఆబాలగోపాలాన్ని అలరించగల మంచి నవలలకు స్వాగతం పలుకుతోంది.

**సునిశిత హాస్యంతో ఓలలాడించే వ్యంగ్య నవలలకు ప్రత్యేక ప్రాధాన్యం**

నవలలు ఇతివృత్తంలో నవ్యత, రచనాసంవిధానంలో వైవిధ్యం కలిగి ఉండాలి. తెలుగు వాతావరణాన్ని, తెలుగు వారి సమకాలీన జీవితాన్ని విభిన్న కోణాల నుండి సమగ్రంగా ప్రతిబింబించగలగాలి. సామాజిక స్పృహతో మానవ స్వభావాలను, అంతరంగిక చిత్రాన్ని సమర్థవంతంగా ఆవిష్కరించగలగాలి. నవల చతురలో అచ్చులో 90 పేజీలు మించకుండా చూసుకుని పంపించాలి. అంతకు మించిన పేజీలు ఉన్న పెద్ద నవలలను పరిశీలించడం కుదరదు. కనుక రచయితలు చతురలోని ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో సరిచూసుకుని నవలలు పంపించాలి. ఎంపిక కాని వాటిని తిప్పి పంపగోరువారు తగు పోస్టేజి ఉన్న కవరును జత పరచాలి.

సంపాదకుడు

**చతుర**

'ఈనాడు' కాంప్లెక్స్, హైదరాబాద్ - 82.

సారి మా ఆఫీసంతా తిరిగి చూసి గమనించండి. మీకు ఒక ఐడియా వస్తుంది" సలహా ఇస్తున్నట్లు అన్నాడు.

దాక్షిణ్య నిర్లక్ష్యంగా చూసింది.

"మరో విషయం. మీటింగ్స్ జరిగే కాన్ఫరెన్స్ హాలు వరకు ప్రత్యేక జాగ్రత్తలు అవసరం. అంటే, అందులో పాల్గొనే వ్యక్తుల మూడ్, స్వభావం, అలాగే కొందరికి కొన్ని రకాల వాసనలన్నా, పువ్వులన్నా ఎలర్జీ కనుక అలాంటి విషయాలు గ్రహించండి" ఆమె చూపుల్ని పట్టించుకోకుండా అన్నాడు.

"తప్పకుండా సార్" స్నేహితురాలు తరఫున హామీ ఇచ్చింది గీత.

లిఫ్ట్ ఆగింది. బయటికి వెళ్ళబోతూ, ఆగి కొద్దిగా వెనక్కి తిరిగి, "మిస్, మీరు ఏదైనా నర్సరీని లీజుకు తీసుకోవడమో లేదా ఏవైనా పూల తోటలతో డీలింగ్స్ ఏర్పరచుకోవడమో చేస్తే మీ బిజినెస్ బాగా తొందరగా అభివృద్ధిలోకి వస్తుంది, ఆలోచించండి" చెప్పి వెళ్ళిపోయాడు.



"ఏంటే ఇతను, అంటే ఆఫీసులను ఎలా అలంకరించాలో, కస్టమర్ల విషయంలో ఏయే జాగ్రత్తలు తీసుకోవాలో తెలుసుకోకుండానే నేను

ఫ్లోరిస్టు నయిపోయాననుకుంటున్నాడా?" రోషంగా అడిగింది దాక్షిణ్య.

"వదిలేయ్‌వే! అతనంతే, అక్కర్లేదు అనుకునేవాళ్ళకి ఉచిత సలహాలు ఇస్తాడు. సలహా చెప్పండి అని వెంటపడితే బిగుసుకుపోతాడు. కాని అతను చెప్పిన ఆఖరి పాయింట్ పనికొచ్చేదిగా ఉంది. నువ్వెందుకు ఏదైనా పూలతోటనో, నర్సరీనో లీజుకి తీసుకోకూడదు" కేంటీన్ కేసి నడుస్తూ అంది.



"అతనన్నంత ఈజీనా అది. లీజంటే వేలతో కూడా కాదు సంవత్సరానికి లక్షో, రెండు లక్షలో చెల్లించేలా కాంట్రాక్టు రాసుకోవాలి. ఇప్పుడు నా బిజినెస్‌లో పెట్టుబడి, మనుషుల జీతాలు, షాపు అద్దె, ఇంటి ఖర్చులు ఇవన్నీ పోనూ ఏదో బొటాబొటిగా వెయ్యి, రెండువేలు లాభం మిగులుతోంది. ఏ ధైర్యంతో లీజుకి తీసుకోవాలంటావు?" క్యాంటీన్లో ఓ వారగా కూర్చుంటూ అడిగింది.

దక్షకి భోజనం ఆర్డర్ చేసి తన బాక్స్ తెరుస్తూ, "నిజమేనే నువ్వు చెప్పేది. మా ఆఫీస్ ఆర్డర్ నీకు రావడం వల్ల నీ వ్యాపారం తప్పక పెరుగుతుంది. కనుక ధైర్యంగా లీజుకు తీసుకోవచ్చు. శ్రీకాంత్‌ని కనుక నువ్వు ఇంప్రెస్ చెయ్యగలిగితే చాలు, వెనక్కి తిరిగి చూడక్కర్లేదు" ఉత్సాహపరుస్తున్నట్లు అంది.

ఆమె మాటల్లోని నిజం దాక్షిణ్య మనసును తాకింది. "నువ్వు చెప్పింది సరే, కానీ ఇంత అర్జంటుగా మనకి నర్సరీలెక్కడ దొరుకుతాయి?" సాలోచనగా అంది.

"డోంట్ వర్రీ దక్షా! నేనెవర్నీ? న్యూవే రియల్ ఎస్టేట్ ఎం.డి.గారి పర్సనల్ కార్యదర్శిని. సిటీలో అమ్మకం, కొనుగోలు జరిగే ప్రతి చిన్న విషయం మాకు తెలుస్తుంది. మనకి అనుకూలమైన వాటిని ఎంచి నీ దగ్గరకు తెస్తాను. సరేనా?" పళ్ళెం ఆమెకేసి జరుపుతూ అంది గీత.

ఆమె చెప్పిన తీరుకు ఫక్కున నవ్వుతూ "ఏమో నమ్మాయ్! నిన్ను నమ్మి నా వ్యాపారం నీ చేతిలో పెట్టాను. ఏం చేస్తావో...?" పెద్ద తరహాలో సాగదీస్తూ అంది దాక్షిణ్య. ఇద్దరూ ఫకాలున నవ్వుకున్నారు.

* * *

సాయంత్రం ఐదు గంటల సమయం. చేతిలో పళ్ళ బుట్టతో శాంతి నిలయం ఆశ్ర

మంలోకి అడుగు పెట్టింది దాక్షిణ్య. ఎవరినీ సంప్రదించకుండా చాలా అలవాటుగా గురుదేవుని కుటీరంకేసి నడిచింది. లోపల ఓ ఎనభై ఏళ్ళ వృద్ధుడు చిన్న పక్షి పిల్లకి దెబ్బ తగిలితే ఉపచర్యలు చేస్తున్నారు. ఆయనకు నడి వయసులో ఉన్న స్త్రీ సహకరిస్తోంది.

"ఇంకా రెక్కలు పూర్తిగా విప్పడమే రాలేదు. అప్పుడే ఎగిరెయ్యాలని ఎందుకు ఆత్రపడ్డావు...? చూశావా ఏం జరిగిందో దబ్బున కిందపడ్డావు. అదృష్టం, రాజమ్మ కంటపడ్డావు కనుక నేను నీకు మందు వేస్తున్నాను. అదే ఏ గండుపిల్లి కంట్లోనో పడితే ఈ రోజుతో నీ బతుకు నిండిపోయేది" మందలిస్తున్నట్లు మృదువైన కంఠంతో అంటూ దానిని చేతుల్లోకి తీసుకున్నారు.

"నమస్తే బాబా!" వస్తూనే బుట్టని ఆయాకి అందించి ఆయన కాళ్ళకి నమస్కరించింది.

"ఎవరూ? దాక్షిణ్య, చాలా రోజులకి వచ్చావు. బాగున్నావా...?" పక్షి పిల్లను రాజమ్మ చేతికి అందిస్తూ అడిగారు.

"అంతా బావున్నాం బాబా, షాపు హడావిడిలో రావడం కుదరడం లేదు. అంతే" సంజాయిషీగా అంది.

"గాయం మానేదాకా జాగ్రత్తగా చూడు. ముందు దానికి కాస్త ఆహారం పెట్టు" వెళ్తున్న రాజమ్మని హెచ్చరించి ఓ పక్కగా వేసున్న కుర్చీలో తాను కూర్చుని దాక్షిణ్యని కూర్చోమని సైగ చేశారు.

"నాన్న ఎలా ఉన్నారు బాబా, ఏమైనా మార్పు వచ్చిందా...?" ఆశగా అడిగింది. చిన్నగా నవ్వారు. గాయం అవ్వడం క్షణాలలో అవుతుంది. కానీ మానడానికే గంటలు, రోజులు కాదు ఒక్కోసారి సంవత్సరాలు పడుతుంది. అందులో రాఘవకు అయింది శారీరక గాయం కాదుగా, అది మానసికం. నయమవ్వడం కాస్త ఆలస్యమే అవుతుంది. ఎంత మారాడు అనేది నీకే తెలియాలి. పద చూద్దువుగాని" అంటూ లేచి ఆమెని తీసుకొని ఆ కుటీరానికి కాస్త దూరంగా ఉన్న విశాలమైన హాలులాంటి ప్రదేశానికి తీసుకెళ్ళాడు బాబా. అక్కడ ఆధునిక విద్య అభ్యసించిన ఒక సైక్రియాటిస్ట్ మానసిక ఉద్వేగాలను అదుపులో పెట్టుకోవడం అనే విషయం మీద ఉపన్యసిస్తున్నాడు. దాక్షిణ్య కళ్ళు ఆత్రంగా కింద కూర్చుని శ్రద్ధగా వింటున్న రకరకాల వయసుల, వ్యక్తుల మధ్య తండ్రి కోసం వెతికాయి. మగవారి వరుసలో వాళ్ళకి కాస్త ఎడంగా కాళ్ళు రెండూ దగ్గరకి ముడుచుకొని ఆ మోకాళ్ళపై తల ఆన్చుకొని శ్రద్ధగా వింటున్న రాఘవరావు కనిపించగా సంతోషంతో కళ్ళు మెరిశాయి. బిగ్గరగా పిలవబోయింది. భుజాన చెయ్యేసి వద్దని వారించారు బాబా.

"మరో పదినిమిషాల్లో ప్రసంగం పూర్తయిపోతుంది. అప్పుడు దగ్గర నుండి పిలవవచ్చు ఇప్పుడు అతని దృష్టిని చెదరగొట్టకు' ' మెల్లగా చెప్పారు.

"క్షమించండి బాబా!" తన తొందరపాటుకి మన్నింపు కోరుతూ వెనుదిరిగింది.

"ప్రసంగ కర్త ప్రముఖ మనస్తత్వ శాస్త్రవేత్త. ఈ రోజు మన ఆశ్రమంలో ఉపన్యసించడానికి గంటకు ఐదువేలు తీసుకుంటున్నారు" చెప్పారు బాబా.

దాక్షిణ్య ఆశ్చర్యపోయింది. చాలా ఆధ్యాత్మిక కేంద్రాలలో, ఆశ్రమాలలో యోగా, ధ్యానం, ప్రాణాయామంతోపాటు ప్రముఖ వ్యక్తులతో మతపరమైన ఆధ్యాత్మిక శాంతి ప్రవచనాలు ఇప్పిస్తారని ఆమెకి తెలుసు. కానీ బాబా ఒక సైక్రియాటిస్టు చేత డబ్బు ఇచ్చి మరీ ఎందుకు ప్రసంగాన్ని ఏర్పాటు చేశారో అర్థం కాక అదే విషయాన్ని గురించి ప్రశ్నించింది.

బాబా చిరునవ్వు నవ్వారు. "యోగా, ధ్యానం అన్ని మనసును భగవంతునిపై స్థిరపరచుకునే సాధనాలు... అలా స్థిరమైన

మనస్సు భగవంతుని గురించి తెలుసుకొనే ఆసక్తి కలిగిస్తుంది. ప్రవచనాలు అందుకు సహకరించి, భగవంతుని శక్తిని తెలియపరచి ముక్తికి మార్గాలు వేస్తాయి. అవి సక్రమంగా జరగాలంటే ముందు వ్యక్తికి తన మనసు పట్ల తనకి అవగాహన ఉండడం ముఖ్యం కదూ! అందుకే ఈ ఆధునిక మానసికవేత్తల సహకారంతో ఎన్నో సమస్యలతో స్వాంతన కోసం ఇక్కడికి వచ్చే వీరికి ఆత్మావలోకన దృష్టిని కలిగించి తమ మానసిక బలహీనతలతో తాముగా పోరాడుకొనే సామర్థ్యాన్ని పెంచేందుకు ప్రయత్నిస్తున్నాను" అని చెప్పారు.

వింటున్న దాక్షిణ్య ఆయన నిశిత దృష్టికి విస్మయపడుతూ బ్యాగ్‌లోంచి చెక్కుబుక్ తీసి ఐదువేలకి రాసి ఇస్తూ "బాబా! మీ ఉన్నతమైన సేవలకు నేను విలువ కట్టలేను. కానీ ఈ డబ్బు మీకు కొంతైనా వినియోగపడుతుందని నా ఆశ" అంది.

బాబా చిరునవ్వు నవ్వారు. "బిందువులు కలిస్తేనే సింధువు. ఎడారిలో మనిషికి ఒక్క బిందువే అమృతధార అవుతుంది. ఈ డబ్బు ఇక్కడ అలాగే వినియోగమవుతుంది" చెప్పారు.

రాజమ్మ వచ్చి ప్రసంగం ముగిసిందని చెప్పడంతో దాక్షిణ్య తండ్రి దగ్గరికి వెళ్ళింది. రాఘవ అలాగే కూర్చున్నాడు. కాకపోతే ఈసారి కాళ్ళు పక్కకి మడచి మడికాళ్ళు వేసుకున్నాడు. దగ్గరగా వెళ్ళి భుజాన చెయ్యేసింది. గుర్తుపట్టాడో లేదో ఒకసారి కళ్ళెత్తి చూసి మళ్ళీ మౌనంగా ఉండిపోయాడు. పక్కన కూర్చుని తండ్రిని పసిపిల్లాడిలా ఒళ్ళో పడుకోపెట్టుకొని చిన్నపిల్లలకి కథలు చెప్పినట్లు అన్ని రోజులు ఇంట్లో జరిగిన ముఖ్య విశేషాలు చెప్పసాగింది.

"బామ్మ ఆరోగ్యం బాగానే ఉంది నాన్నా, వేదక్క ధోరణి కాస్త మారింది. రంగు చీరలు కట్టుకుంటోంది. చిత్ర బ్యూటీ కోర్సు నేర్చుకోవాలని సరదా పడుతోంది. డిగ్రీ అయ్యాకా చేర్పిస్తానని చెప్పాను. చిన్నూ బాగా అల్లరి చేస్తున్నాడు. కానీ వాడు లేకపోతే ఇల్లంతా మూగబోయినట్లు ఉంటుంది. ఆc, అన్నట్లు నా ఫ్రెండ్ గీత గుర్తుందా...? తను వాళ్ళ బాస్‌తో చెప్పి నాకు పెద్ద కాంట్రాక్టు ఇప్పించింది. అక్కడ సైంధవుడిలా భీమేష్ అని ఒకడు అడ్డుపడాలని చూశాడు కానీ... మీ ఆశీస్సులుండగా నాకేంటి...? చివరికి విజయం నాకే దక్కింది. అన్నట్లు మన షాపులో పనిచేసే మరియమ్మ లేదూ, దాని కూతుర్ని పురిటికి తీసుకువచ్చింది"

అలా ఆమె మాటల ప్రవాహం ఇంకా ఎంతసేపు కొనసాగేదో, రాజమ్మ వచ్చి "అమ్మా, ఆ అయ్య నిద్రపోయాడు. బయట చీకట్లు మూగుతున్నాయి. ఇంక బయలుదేరమ్మా" అని తట్టి చెప్పడంతో తేరుకొని మెల్లగా తండ్రి తలని నేలపై ఉంచి, రాజమ్మకి జాగ్రత్తలు చెప్పి, బాబాకి మరోసారి కనిపించి భారమైన

**గుర్తుపట్టాడో లేదో ఒకసారి కళ్ళెత్తి చూసి మళ్ళీ మౌనంగా ఉండి పోయాడు. పక్కన కూర్చుని తండ్రిని పసి పిల్లాడిలా ఒళ్ళో పడుకో పెట్టుకొని చిన్నపిల్లలకి కథలు చెప్పినట్లు అన్ని రోజులు ఇంట్లో జరిగిన విశేషాలు చెప్పసాగింది**

# చతుర భాషితాలు

ధనార్జన లాగా జ్ఞానార్జన అన్న కోరిక కూడా పొందే కొద్దీ పెరుగుతూ ఉంటుంది.

– లారెన్స్ స్టెర్నీ

ప్రపంచంలోని మేధావులందరి కంటే ఒక సహృదయుడు గొప్పవాడు.

–ఎడ్వర్డ్ బి.లిట్టన్

నిదానంగా చెయాల్సిన పనిని తొందరగా చేసే వ్యక్తీ తొందరగా చేయాల్సిన దాన్ని నిదానంగా చేసే వ్యక్తీ- ఇద్దరూ బాధలకు గురవుతారు.

–తిరువళ్ళువర్

సమాజం తయారుచేసిన నేరాన్ని నేరస్తుడు నెరవేరుస్తాడు.

– హెన్రీ థామస్ బకిల్

అనుగ్రహాన్ని కోరడం అంటే మన స్వతంత్రతను బదులుగా ఇవ్వడమే.

–సూక్తి

అవతలి వారి పరిస్థితిలో మిమ్మల్ని మీరు ఊహించుకోకుండా ఏ ఒక్కరి పట్లా తొందరపడి క్రూరమైన నిర్ణయాలు తీసుకోకూడదు.

–గోథె

లోకజ్ఞులు వర్తమాన విషయాలు ప్రస్తావిస్తారు. అవివేకులు తాము భవిష్యత్తులో కట్టబోయే మేడలను గురించి చెబుతారు.

–డెఫిని

పెళ్లి పంజరం లాంటిది. బయటి పక్షులు పంజరంలోకి రావడానికి ప్రయత్నిస్తే లోపలి పక్షులు బయటపడడానికి ప్రయత్నిస్తుంటాయి.

–మైఖేల్ డిమోంటెగ్నే

విశాల హృదయం కలవారే నిజమైన స్నేహితులవుతారు. నీచులు, పిరికిపందలు నిజమైన స్నేహాన్ని ఎప్పుడూ తెలుసుకోలేరు.

మారువేషంలో ఉన్న పట్టుదలే కళ్లు మిరుమిట్లు గొలిపే ప్రతిభగా కనిపిస్తుంది.

– హెన్రీ డబ్ల్యు ఆస్టిల్

మనకు జరగనంతవరకు ఇతరుల విషయాలన్నీ తమాషాగానే ఉంటాయి.

ఒక అలవాటును కిటికీలోంచి విసిరేయలేం. నెమ్మదిగా బుజ్జగిస్తూ మెట్ల మీద నుంచి కిందకి దింపాలి.

–మార్క్ట్వైన్

మనసుతో ఆశ్రమం బయటికి నడిచింది.

ఇంటికి చేరేసరికి ఎనిమిది దాటింది. దిగులుగా, పరధ్యానంగా లోపలికి వస్తున్న దాక్షిణ్యని గుమ్మంలోనే నిలదీసింది బామ్మ. "ఈరోజు ఆదివారం. కొట్టు కూడా మూసే శావు. ఇప్పటిదాకా పెత్తనాలేంటి? "

తలెత్తి ఒకసారి ఆవిడ కళ్ళలోకి చూసి చేతిలో బ్యాగ్ చిత్రకి ఇస్తూ "నాన్న దగ్గరికి వెళ్ళాను" చెప్పింది.

ముసలావిడ పాలిపోయిన మొహం కళ తప్పింది. "ఏడేళ్ళనాడే నా కొడుకు ముగ్గురు పసిపిల్లల బాధ్యత నా మీద వదిలి చచ్చిపో యాడు. నాకు కొడుకే లేనప్పుడు నీకు నాన్న ఎలా ఉంటాడే? " కోపంగా అరిచింది.

కాళ్ళు కడుక్కోడానికి తీసిన చెంబు నీళ్ళ లోకి విసిరికొట్టి "బామ్మా! ఏడేళ్ళుగా నీకు చెబుతూనే ఉన్నాను. జరిగిన దానిలో మా నాన్న తప్పు ఏమీ లేదని అయినా నీకు కొడుకు లేడని నువ్వనుకుంటే అది నీ ఇష్టం. మాకు ఆయన తండ్రి కాదూ అని నువ్వంటే నేను ఒప్పుకోను" అంతే ఖచ్చి తంగా చెప్పింది.

"నా తండ్రి, నా కొడుకు అని నువ్వు, నేనూ చెప్పుకున్నంత మాత్రాన్న మగాడికి గుర్తింపు రాదే! తండ్రిగా, కొడుకుగా తన బాధ్యతలు సక్రమంగా నిర్వహిస్తే ఆరోజు వాడికి విలువ, గౌరవం. అంతేకానీ... కష్టాలు వచ్చాయని, నష్టాలు జరిగాయని డెబ్బై ఏళ్ళ ముసలిదాన్ని, పూర్తిగా ఇరవై ఏళ్ళు రాని లోకం తెలియని ఆడపిల్లల్ని ఖర్మానికి వదిలేసి మతిభ్రమణం ముసు గులో దాక్కునేవాడు ఆ పిరికి వెధవని నేను కొడుకని ఈ జన్మలో ఒప్పుకోను" దుఃఖంతో పూడుకుపోతున్న గొంతుతో అంది.

తండ్రిని మాటా పలుకూ లేని నిస్సహాయ స్థితిలో చేసిన బాధ పసితనం నుండి పిల్ల లపట్ల ఆయన వాత్సల్యాన్ని కళ్ళారా చూసిన దాక్షిణ్య బామ్మ మాటల్ని భరించలేకపో యింది.

రౌద్రంగా చూస్తూ, "బామ్మా, నీకు కోటి సార్లు చెప్పాను. మా నాన్న పిరికిపంద కాదు. ఏ తప్పు చెయ్యలేదు. ఆయన మతి భ్రమ నాటకం కాదు. అసలు నాన్న అలా మన లోకంలో లేకపోవడానికి, అక్క వైధ వ్యానికి, చిన్నూ అనాథ కావడానికి మేము ఒంటరిగా బితుకుమంటూ బతకాల్సి రావడా నికి కారణం నువ్వు. నీ చాదస్తంతో పెళ్ళో పెళ్ళో అంటూ మా బతుకుల్ని పదమూడే ళ్ళకే నిప్పులో తోశావు. జరిగిన అనర్థాలకు నా తండ్రి కనుక ఇంకా ప్రాణాలతో ఉన్నాడు. అందుకు సంతోషించడం మాని తల్లివనే గౌరవంతో నువ్వు చెప్పిన ప్రతిదా నికి తలూపి పీకలోతు మునిగిపోయిన ఆ మనిషిని నీకు కొడుకు కాదంటావా? నేను చెప్తున్నాను. నువ్వు ఆయనకి తల్లిగా పనికి రావు. వెళ్ళు" చేత్తో పొమ్మన్నట్లు సైగచేస్తూ అంది దాక్షిణ్య.

"ఆ ఆc... చూశావా వేదా? నీ చెల్లెలి నోటి దురుసు. ఇన్నాళ్ళు పెంచిన ఈ బామ్మ వెగటైపోయింది. నన్ను బయటికి పొమ్మంటోంది" కన్నీళ్ళతో వైదేహికి కంప్లె యింట్ చేసింది.

వేద పని ఇరుకున పడ్డట్టు అయ్యింది. అప్పుడే ఆమె దృష్టి ఫ్యాక్టరీ నుండి వచ్చిన భాస్కర్, పక్కింటి తగాదా ఏమిటో తెలియ పోయినా ఆసక్తిగా చూస్తున్న సావిత్రమ్మ, రాణిలపై పడి రోషంతో మొహం ఎర్రబ డింది. "దక్షా, పెద్దావిడతో ఏమిటా నోటి దురుసు. లోపలికి వెళ్ళు" కసిరినట్టు చెప్పి, "బామ్మా, రాద్ధాంతం చాలు. ఇంట్లోకి పద. ఈ తతంగం ఎప్పుడూ జరిగేదే దీనికి ప్రద ర్శన కూడా కావాలా? " హెచ్చరికగా అంది.

ముసలామె మెల్లగా లేచి పైటతో కళ్ళొ త్తుకుంటూ, ఏదో గొణుక్కుంటూ వెళ్ళిపో యింది. చిత్రా, చిన్నూ పెదవి విప్పే సాహసం చెయ్యలేనట్లుండిపోయారు. లోప లికి వెళ్ళి వీధి గుమ్మం మూసేసింది వైదేహి.




ముఖ్యమైన పేపర్స్‌మీద శ్రీకాంత్‌తో సంతకాలు చేయిస్తున్న గీత "సార్, నాకు ఓ చిన్న సాయం చెయ్యాలి సార్" మెల్లగా అడిగింది. "ఏమిటి? లీవ్ కావాలా? డబ్బులు కావాలా? " యథాలాపంగా అడిగాడు. "అవేం కాదు సార్. చిన్న మాట సాయం. మనం మల్కాజ్‌గిరిలో కట్టిస్తున్న మల్టీస్టోరీడ్ కాంప్లెక్స్ ఓనర్ సిద్ధప్పకి నగర శివార్లలో ఒక నర్సరీ ఫాంహౌస్ ఉంది సార్. అది మా దక్ష లీజుకి తీసుకుందామనుకుంటే ఏకంగా సంవత్సరానికి లక్ష ఇమ్మంటున్నాడు సార్. పాపం దానిది ఇంకా బాగా డెవలప్ కాని షాపు. కొంచెం మీరు చెబితే అతను తగ్గిస్తాడేమోనని" చెబుతున్నదల్లా శ్రీకాంత్ ఫైల్ మూసేసి తనకేసే తీక్షణంగా చూడడంతో ఆగిపోయింది.

అతని చూపుకర్థం లోపలికి ఎప్పుడొచ్చాడో భీమేష్ నోటినుండి వచ్చింది. "చాలా బాగుంది గీతా! స్నేహితురాలంటే నిజంగా నీలా ఉండాలి. మీ ఫ్రెండ్‌కి వేలల్లో లాభాలొచ్చే ఆర్డర్లు మేమివ్వాలి. అందుకు అవసరమైన వ్యక్తులను మేనేజ్ చేసి చవకగా మెటీరియల్ దొరికేలా చూడాలి. ఊఁ, ఇంకా రేపు ఏ కారణంగా అయినా మీ ఫ్రెండ్ అలంకరణ చేసేటపుడు కూలీవాళ్ళు దొరకకపోతే మేమిద్దరం నిచ్చెనలెక్కి మా ఆఫీసుని మేమే అలంకరించేసుకోమంటావు. అంతే నా? " సీరియస్‌గా అడిగాడు.

గీత మొహం నల్లగా మాడిపోయింది. "నా ఉద్దేశం అదికాదు సార్? " గొంతు పెగల్చుకొని అంది.

"మరేమిటి గీతా? నువ్వేదో కాస్త సిన్సియర్‌గా పనిచేసే అమ్మాయివని నీపై గౌరవంతో మీ ఫ్రెండ్‌కి కాంట్రాక్టు ఇస్తే ఇప్పుడీ సిద్ధప్పకి రికమండేషన్ ఏమిటి? సిద్ధప్ప మన క్లయింట్, అతనికి నష్టం వచ్చే సలహాలు మనమిస్తే నోటీసు ఇవ్వకుండా మన కాంటాక్ట్ కాన్సిల్ చేసి మరో కంపెనీకి ఇస్తే ఒకటి రెండు కాదు పదికోట్లు నష్టం. అతనిపై కేసు పెట్టినా కనీసం ఇంతవరకు మనం పెట్టిన మెటీరియల్ ఖర్చు కూడా తిరిగిరాదు" అంతే తీవ్ర స్వరంతో చెప్పాడు శ్రీకాంత్. అప్పటికే గీత కళ్ళు నీటి చలమలైపోయాయి.

"సారీ సార్, నేను అవన్నీ ఆలోచించలేదు ఎక్స్‌క్యూజ్ మీ సార్" వెక్కుతూ ఆగి ఆగి అంది.

ఆమె కన్నీళ్ళు చూసి సహజంగానే మగాళ్ళు మెత్తబడిపోయారు.

"ఐయాం సారీ!" శ్రీకాంత్ తగ్గు స్వరంతో అన్నాడు. టేబుల్ పైన గ్లాసులో ఉన్న నీళ్ళు అందించి "తాగు" అన్నాడు భీమేష్. ఆజ్ఞని పాటించాలి అన్నట్లు గబగబా తాగేసింది. కన్నీళ్ళు ఆగినా, వెక్కిళ్ళు ఆగలేదు. కుర్చీలో కూర్చోపెట్టి

"నిజంగా నీ స్నేహితురాలు అదృష్టవంతురాలు. అందుకే కష్టమంటే తెలియకుండా చూసుకొనే నీలాంటి ఆప్తురాలు దొరికింది" వాతావరణం తేలిక చేస్తూ ఆమెని పొగుడుతున్నట్లు అన్నాడు భీమేష్.

గీత రుమాలుతో కళ్ళు, ముక్కు ఒత్తుకుంటూ తల అడ్డంగా ఊపింది.

"లేదు సార్. అదే అదృష్టవంతురాలైతే హాయిగా మంచి మనిషికి భార్యై, పిల్లాపాపలతో సంతోషంగా ఉండేది. ఆడపిల్ల అయ్యుండి ఇలా ఒంటరిగా పువ్వుల దుకాణం నడుపుకుంటూ ముసలి బామ్మని, విధవరాలైన అక్కని, చదువు, పెళ్ళి అనే రెండు భారాలని మోయాల్సిన చెల్లెల్ని, మతిస్థిరంలేని తండ్రిని ఒక పసిబిడ్డను పోషించే

భారాన్ని మీద వేసుకొని ప్రతిరోజూ ఈ నెల ఖర్చులను ఎలా గట్టెక్కించాలా అనే దిగులుతో భారంగా బతుకు వెళ్ళదీయదు" గంభీరంగా అంది.

మొహాలు చూసుకున్నారు శ్రీకాంత్, భీమేష్. సన్నని చిరునవ్వు మెరసి మాయమయ్యింది వాళ్ళ పెదాలపైన.

"చూడబోతే మీ ఫ్రెండ్ కథ- 'అంతులేని కథ'లో జయప్రద కేరక్టర్‌కి మోడల్‌లా ఉంది. ఆ సినిమా వచ్చినప్పుడు కానీ, పుట్టిందా ఏం? " ఒక చైర్ శ్రీకాంత్ పక్కకి లాక్కుని కూర్చుంటూ టీజింగ్‌గా అడిగాడు భీమేష్.

గట్టిగా నవ్వాడు శ్రీకాంత్.

రోషంగా లేచింది గీత. "మీరంటే, మా దక్షకి అందుకే కోపం. మీకు ఎప్పుడూ ఎదుటివాళ్ళు హీనమైన వాళ్ళుగాను, వాళ్ళ కష్టాలు కథలుగానే అనిపిస్తాయి. ఇలా చెప్పినందుకు సారీ సార్. కానీ ఇది నిజం" కోపంగా అంది.

భీమేష్ ఐ డోంట్ కేర్ అన్నట్లు నిర్లక్ష్యంగా నవ్వాడు.

"సారీ గీతా, వాడంతే. జీవితాన్ని సీరియస్‌గా తీసుకోడు. నువ్వు పట్టించుకోకు" భీమేష్‌కి సైగ చేస్తూ గీతని బుజ్జగించి కూర్చోపెట్టి "ఓ.కె, నీ స్నేహితురాలు కనుక ఇప్పుడు ఆమె కూడా మన కంపెనీలో మెంబర్. తన సమస్య ఏమిటో చెప్పు. మేము సాయం చేస్తాం" అడిగాడు.

"అది మీరు తీర్చగలిగేది కాదు సార్. తన సొంత విషయాలను ఆమె అనుమతి లేకుండా మీతో చర్చించడం మా స్నేహానికే అవమానం. కానీ, ఒక్కటి సార్. నేను దక్ష గురించి చెప్పిన వివరాలు అబద్ధాలో, కథలో కాదు. అవి జీవిత సత్యాలు. దాని ఒంటరి పోరాటం అంటే నాకు జాలి. ఏకాస్త చేయూతనిచ్చినా కష్టాలకు బెదిరి కన్నీళ్ళలో కూరుకుపోయే తరతరాల స్త్రీ జాతికి కనువి

## సహజత్వం పోకూడదు

రోషనార నాటకం అద్భుతంగా సాగుతోంది. ప్రేక్షకుల్లో బళ్లారి రాఘవ కూర్చుని ఉన్నారు. రోషనార పాత్ర ధరిస్తున్న వ్యక్తి సామాన్యుడు కాదు. అందులోనూ బళ్లారి ప్రదర్శన చూస్తున్నారని తెలుసుకాబట్టి మరింత చెలరేగి పోతున్నాడు. ఎక్కడలేని హొయలు ఒలకబోస్తున్నాడు. ప్రేక్షకులు శభాష్ శభాష్ అంటూ ప్రశంసల వర్షం కురిపిస్తున్నారు.

ఎలాగైతేనేం? నాటకం ముగిసింది. సదరు పాత్రధారి రాఘవ వద్దకు నేరుగా వచ్చి 'ఎలా నటించాను? ' అంటూ కొంచెం దర్పం ఉట్టిపడుతున్న స్వరంతో అడిగాడు.

'బాగుంది.. సహజత్వం కూడా ఉంటే ఇంకా బాగుండేది' అన్నారు రాఘవ.

ఆ పెద్దనటుడికి అహం దెబ్బతింది. 'ఆ సహజత్వం ఏమిటో తమరే కాస్త సెలవివ్వండి' అన్నాడు వ్యంగ్యంగా.

'రోషనార ఔరంగజేబు చెల్లెలు. అంటే ముస్లిముల అమ్మాయి. ఉత్తరం రాసే ఘట్టంలో వారి సంప్రదాయం ప్రకారం తను కుడి నుంచి ఎడమకు రాయాలి కదా? మరి మీరు ఎడమనుంచి కుడికి రాశారు... అది అసహజం కాదూ?' అన్నారు రాఘవ శాంతంగా.

రాఘవ సునిశిత పరిశీలనా శక్తికి అప్రతిభుడైన ఆ రంగస్థల నటుడు తాను ఆయనపట్ల వ్యవహరించిన పద్ధతికి నొచ్చుకుంటూ పాదాలపై బడి క్షమించమని కోరాడు.



ప్పుగా సమస్యలతో పోరాడి గెలవచ్చనే దాని ఆత్మస్థైర్యానికి నేనూ తోడ్పాటునందించాను కదా అనే చిన్న తృప్తికోసం నేను ప్రయత్నిస్తున్నాను. అంతే. ఉంటాను సార్" గీత తన ఫైల్స్ తీసుకుని రూమ్ నుండి వెళ్లిపోయింది.

"ఏం చేద్దాం? " భీమేష్‌ని అడిగాడు.

"గీత ఉపన్యాసం విన్నాకా ఏం చేస్తాం. సిద్ధప్పను లైన్లో పెడితే సరి" ఒళ్ళు విరుచుకుంటూ అన్నాడు.

"కానీ అడగ్గానే ఒప్పుకుంటాడా? " అనుమానంగా ప్రశ్నించాడు శ్రీకాంత్.

"మల్కాజ్‌గిరిలో వాడు ఒక ప్లాటు పది లక్షలు చెబుతున్నాడు. మనం పన్నెండుకు అమ్మి పెడతామంటే చచ్చినట్లు ఒప్పుకుంటాడు" బద్ధకంగా అన్నాడు.

"చెప్పగానే సరా? మనం మాత్రం అంత రేటు పలకనిదే ఎలా అమ్ముతాం. మోసం చేస్తే చంపేస్తాడు" ఫోన్ దగ్గరకి లాక్కుంటూ అన్నాడు శ్రీకాంత్. భీమేష్ మాట్లాడలేదు. సీట్లో వెనక్కి వాలి కళ్ళు మూసుకున్నాడు.

సిద్ధప్పకు అర్జంటుగా మాట్లాడే పనుందని సాయంత్రం గెస్ట్ హౌస్‌కు వచ్చి కలవమని చెప్పి పెట్టేసి ఇంకా కళ్లు తెరవని భీమేష్‌ని ఉద్దేశించి "ఏంటీ నిద్రపోతున్నావా? ఆ సిద్ధప్ప సాయంత్రం వస్తానన్నాడు. వాడిని ఒప్పించడం కష్టం కాదు. పన్నెండు లక్షలకి అమ్మితే మనం మునిగిపోకుండా ఉండే ఉపాయాన్ని ఆలోచించు. లేదంటే ఆ సిద్ధప్ప నుండి మనకు మిగిలేదానికి నాలుగురెట్లు మనం వాడికి చెల్లించాల్సి వస్తుంది" హెచ్చరించాడు.

అతని మాటల్ని పట్టించుకోనట్లు కళ్ళు మూసుకునే అడిగాడు భీమేష్. "శ్రీ... నువ్వు లండన్ నుంచి వచ్చేపుడు విమానంలో ఎవరో సినీతార పరిచయమయ్యిందన్నావు? ఇప్పుడెలా ఉంది ఆ అమ్మాయి"

"ఎవరూ రియా కులకర్ణీనా? బాగానే ఉంది. అప్పుడింకా కొత్తగా



ఫీల్డులో వచ్చింది. ఇప్పుడు వరస హిట్‌లతో తెలుగు తెరని ఏలేస్తోంది" నవ్వాడు.

"ఆ అమ్మాయితో నీ సంబంధాలు ఎలా ఉన్నాయి. నిన్ను చూస్తే నవ్వుతూ పలకరిస్తుందా? లేక ఎరగనట్లు మొహం తిప్పేసుకుంటుందా? "

"నీ ఇంటర్వ్యూ ఏంట్రా బాబు. ఫరవా

లేదు. మన 'న్యూవే' పనిమీద జరిగే చాలా పార్టీలకి, ఫంక్షన్లకి కలిశాం. బాగానే మాట్లాడుతుంది" విసుక్కున్నాడు.

"దట్స్ గుడ్. మరి ఇంకేం. మన సమస్య తీరిపోయింది" కళ్ళు తెరిచి సర్దుకు కూర్చుంటూ అన్నాడు భీమేష్.

"నీ ప్లానేమిటో నాకర్థం కావడంలేదు"

"బతిమాలో, మొహమాట పెట్టో ఆ రియా చేత సగం ధర్కైనా ఒక ప్లాటు కొనిపించు. ఆ విషయాన్ని బూస్టప్ చేస్తూ పేపర్లో, టి.వి.లో ప్రకటనలిద్దాం. దాంతో సినీ తారతో కలిసి ఒకే బిల్డింగ్లో బతకడమంటే పన్నెండు ఏమిటి...? మనం పాతిక లక్షలు చెప్పినా హాట్ కేకుల్లా అమ్ముడవుతాయి. కానీ ఒక్కటి సిద్ధప్పను మాత్రం మన లాభనష్టాలలోకి దూరనివ్వొద్దు. అతనితో ఒప్పందాలు పక్కాగా ఉండాలి"

"రియా చేత కొనిపించడం సమస్య కాదు కానీ తీరా మనం ఏడ్ ఇచ్చాక తనని ప్రచారానికి వాడుకున్నందుకు పారితోషికం డిమాండ్ చేస్తే అదేదో పాత సామెత సంచి లాభం చిల్లు పూడ్చింది అంటారే అలా అవుతుంది" శ్రీకాంత్ సందేహం వ్యక్తం చేశాడు.

వెళ్ళబోయిన భీమేష్ ఒక్క నిమిషం ఆలోచించి "ఓ పని చెయ్యి ఓ ప్లాటుని సగం రేటుకి కొనుక్కుంటే ఏడాదిలోగా రెట్టింపుకి అమ్ముతానని ఆశ పెట్టు. అంతకీ ఒప్పుకోకపోతే ఇందాకా గీతలా నువ్వూ హార్టు ప్రాబ్లం నాన్న, మతిలేని అమ్మ, మెదడువాపు తమ్ముడు అంటూ కష్టాల కథను వినిపించు" కొంటెగా అని కారు తాళాలు తీసుకుని వెళ్ళిపోయాడు.

భీమేష్ మాటలకి నవ్వుకుంటూ రియాని ఎప్పుడు, ఎలా కలవాలో ప్లాన్ చేసుకోడానికి ఆమె పర్సనల్ నెంబర్ని తన సెల్లో వెతకడంలో నిమగ్నమైపోయాడు శ్రీకాంత్.

* * *

భీమేష్ ఇంటికి వచ్చేసరికి లైట్లు వెలుగుతుండడంతో శ్రీ వచ్చాడా...? సిద్ధప్ప దగ్గరకి వెళ్తానన్నాడు. అప్పుడే పని అయిపోయిందా? తనలో తను అనుకుంటూ బైక్ పార్కు చేసి లోనికి నడిచాడు. హాల్లో అతని తండ్రి మాధవరావు టి.వి. చూస్తున్నాడు, తల్లి స్నానం చేసి వచ్చినట్లుంది.

"సంధ్యాదీపం పెడదామంటే ఈ ఇంట్లో పూజగది, దేముడి పటం రెండూ లేవు" సణుక్కుంటోంది. వాళ్ళని చూడగానే అతనిలో ఆనందంకన్నా ముందు గాఢమైన




'వృద్ధాప్యం మరో బాల్యం అంటుంటారు గదా!' వయసు మీదబడేకొద్దీ మతిమరుపు, జ్ఞాపకశక్తి తగ్గడం, చెముడు, చూపు తగ్గడం వంటివి సహజం. అయితే వృద్ధులు చేపలు తింటే మెదడు చైతన్యవంతంగా ఉంటూ, మతిమరుపును తగ్గిస్తుందంటున్నారు చికాగోలోని రష్ యూనివర్సిటీ శాస్త్రవేత్త మార్తా మోరిస్.

వయసు పైబడ్డవారు వారానికోమారు చేపలు తింటే కనీసం 10 శాతం జ్ఞాపకశక్తి పెరుగుదల ఉంటుందట. చేపల్లో ఉండే "ఒమేగా-3 ఫాటీ ఆమ్లాలు మెదడుని ఉత్తేజపరిచి జ్ఞాపకశక్తిని పెంచుతాయట. అది సరేనండి... మీ సలహా మాంసాహారులకి... ఓ.కే., మరి శాకాహారుల మాటేంటి అంటే, మెదడు ఎవరికైనా మెదడే గదండీ అంటున్నారు మోరిస్‌గారు.

నిట్టూర్పు వచ్చింది. మౌనంగా వెళ్ళి సోఫాలో కూర్చుని బూట్లు విప్పుకుంటుంటే గమనించి,

"శారదా! నీ కొడుకు వచ్చాడు" పిలిచారు. కూడా తెచ్చుకున్న బొట్టు పెట్టిలో చూసి కుంకుమ పెట్టుకుంటున్న శారద హడావిడిగా వచ్చి,

"ఎలా ఉన్నావురా కన్నా? ఎన్నాళ్ళయ్యిందో నిన్ను చూసి" సంబరంగా అంది బుగ్గలు పుణికి ముద్దుచేస్తూ.

సుతారంగా తల్లి చేతులు తప్పించుకొని "తాళాలు ఎవరిచ్చారు? " అడిగాడు

ఆ ప్రశ్న మాధవరావుకి ఆగ్రహం కలిగించింది.

టి.వి కట్టేసి రిమోట్ పక్కన పారేస్తూ "విన్నావా? ఏడాది తర్వాత చూడాలని ఆశపడి వచ్చిన కన్నవాళ్ళను నీ కొడుకు పలకరించిన తీరు. మనమేదో దొంగల్లా తాళాలు పగలగొట్టుకొచ్చినట్లు మాట్లాడుతున్నాడు" భార్యతో అని పైకి లేచి, కొడుకుకేసి సూటిగా చూస్తూ

"నాయనా భీమేశ్వరరావుగారు, మీ ఇంటి తాళాలు పగలగొట్టుకొని వచ్చి దూరాల్సిన ఖర్మ మాకింకా పట్టలేదు. ఇక్కడ నీకేదో విలువ ఏడ్చిందిగా. నీ అమ్మా బాబులమని చెప్పగానే వాడెవడో సగౌరవంగా తీసుకొచ్చి దింపాడు. సరేనా? " కోపంగా చెప్పాడు.

"నా పేరు భీమేష్. పాత పేరు, పాత మనుషుల, పాత జీవితాన్ని ఆ పల్లెటూరిలోనే వదిలేశాను. మీరూ గుర్తుంచుకుంటే బావుంటుంది. ఇంట్లో వంట ఏర్పాట్లు ఏమీ కుదరవు. ఏమైనా తిన్నారా? తెప్పించాలా? " పైకి లేచి షర్టు బటన్స్ విప్పుకుంటూ అడిగాడు.

"అదేమిట్రా కన్నా! నేనుండగా బయట నుండి తెప్పిస్తానంటావు? ఇప్పుడే స్నానం చేశాను. పది నిమిషాల్లో వంట సిద్ధం చేస్తాను. నువ్వు తయారయ్యిరా!" శారద కొంగు నడుములో బిగించి దోపుతూ అంది.

తన గదిలోకి వెళ్ళబోతూ "అమ్మా! ఇంట్లో గిన్నెలు బియ్యం సరంజామా ఏదీ

లేదు. వంట ఎలా చేస్తావు?" విసుగ్గా అడిగాడు.

"ఏమీ లేకపోవడం ఏమిట్రా మేం రాగానే ఆ పిల్ల ఎవరో వేడిగా కాఫీ ఇచ్చి ఆ రొట్టె ముక్కలతో చేస్తారు, ఏంటదీ సాండువిచ్ అదేదో పెట్టింది. మీ నాన్న తిన్నారనుకో. నేను ఆ గడ్డి తినలేక మానేశాను. అవన్నీ ఎలా చేసిందంటావు. మంత్రమా ఏం?" ఆశ్చర్యంగా అడిగింది.

విప్పిన చొక్కా భుజం మీద తుండులా వేసుకొని "అవన్నీ కరెంటు మిషన్లు అమ్మా, ఒక దాంట్లో పాలు, పొడుం వేస్తే క్షణాలలో కాఫీ వస్తుంది. ఇంకోటి టోస్టర్ నూనె, పొయ్యి లేకుండానే బ్రెడ్ లాంటివి కాల్చుకోవచ్చు. వాటిమీద అన్నం కూరలు సాధ్యం కాదు" వివరిస్తున్నట్లు చెప్పి ఫోన్ దగ్గరికి వెళ్ళి కేర్‌టేకర్‌కి రింగ్ చేసి ముగ్గురికి శాకాహార భోజనం పంపమని ఆర్డర్ చేశాడు.

"ఊ! అంటే హోటల్ కూడు తినక తప్పదన్న మాట" సోఫాలో కూలబడి గొణుక్కుంది శారద.

భోజనాల దగ్గర భార్య సైగనందుకొని వచ్చిన పని విషయం కదిపాడు మాధవరావు.

"మీ అమ్మ ఒక్కర్తి చాకిరీ చేసుకోలేకపోతున్నానని కోడల్ని త్వరగా తీసుకురమ్మని నసపెట్టి చంపేస్తోంది. నువ్వు లండన్ నుండి వచ్చి పెద్ద ఉద్యోగం చేస్తున్నావని తెలిసి బంధువులు మా పిల్లనిస్తామంటే మా అమ్మాయిని ఇస్తామంటూ లక్షల లక్షల కట్నాలతో ఎగబడుతున్నారు. నువ్వేమిట్రా అంటే, అసలు నీకు అమ్మా, నాన్న వాళ్ళకి నీపై ఓ బాధ్యత ఉండి ఉంటుందని గుర్తించనే లేనట్లు ప్రవర్తిస్తావు" తను చెప్ప దలచుకున్న విషయాన్ని కదిపాడు.

భీమేష్ మాట్లాడలేదు. త్వరగా ముగిస్తే వాళ్ళని వదిలించుకుని వెళ్ళిపోవచ్చన్నట్లు ఎదురుగా ఉన్న పెరుగును కంచంలోకి గుమ్మరించుకున్నాడు.

"మొన్ననే ఏలూరు నుండి ఓ సంబంధం వచ్చింది. మీ అమ్మకు దూరపు చుట్టం. పిల్ల బాగుంది. డిగ్రీ చదివింది. అన్ని పనులు చక్కగా చేస్తుంది. పది లక్షలు కట్నం. మీ అమ్మకు, జయకు లక్ష లాంఛనాలుగా ఇస్తామన్నారు. మాకైతే బాగా నచ్చింది. అదిగో! మీ అమ్మ ఫొటో తెచ్చింది. ఓసారి చూసి సరే అంటే చాలు నువ్వు. పెళ్ళి ఏర్పాట్లు చేసేసుకుంటాం మేము" సాంబారు కలుపుకుంటూ ఆగి ఆగి చెప్పాడు.

"ఆ అమ్మాయి ఆచూకీ దొరికిందా?" సూటిగా అడిగాడు భీమేష్. మాధవరావు మొహంలో ప్రశాంతత ఎగిరిపోయింది.

"లేదు. అయినా ఆ పిల్ల ఉందో, లేదో... ఉంటే ఎక్కడుందో తెలియదు. మన లోపం లేకుండా వెతికాం లాభం లేకపోయింది. అసలు నీకు ముక్కూ మొహం కూడా జ్ఞాపకం లేని పిల్ల ఆచూకీ కోసం ఆరాలు తీస్తావేమిటిరా? బంగారం లాంటి సంబంధానికి నీళ్ళొదులుకొని" గయ్యిన అరిచాడు.

"ఎందుకంటే మీరు నాతో ఒక అమాయకపు ఆడపిల్ల బంధాన్ని, బాధ్యతను ముడిపెట్టారు కనుక. మీ నిర్ణయాన్ని వ్యతిరేకించే మానసిక, శారీరక సామర్థ్యం లేని వయసులో నాకిష్టం లేదని తెలిసీ మీ పెద్దరికాన్ని అడ్డుపెట్టి పంతాన్ని నెగ్గించుకున్నారు. ఇప్పుడు ఆ పిల్ల కనబడలేదు కనుక ఆనాడు అసలు ఏం జరగలేదని దులిపేసుకుని మరో ఆడపిల్లతో పెళ్ళి అనే ఇంకో బొమ్మలాటకి నేను సిద్ధంగా లేను" ఖచ్చితంగా చెప్పాడు చేతులు కడుక్కుంటూ.

కొడుకు గొంతులోని తీవ్రతకి కాస్త జంకాడు. "నిజమేరా! కానీ, నేనేం చెయ్యను చెప్పు. రాఘవరావు గురించి ఎంత ఆరాతీసినా ఎవరూ సరిగా చెప్పడంలేదు. పిచ్చి పట్టి ఎటో వెళ్ళిపోయాడంటారు కొందరు. కుటుంబ సమేతంగా ఆత్మహత్య చేసుకున్నాడంటున్నారు కొందరు. అసలు బతికున్నాడో లేడో తెలియని మనిషిని ఎక్కడని వెతకను.

పోనీ, ఏ పేపరులోనో, టి.వి.లోనో ప్రకటన ఇద్దామంటే రాఘవరావు ఫొటో కానీ, ఆ పిల్ల ఫొటో కానీ మన దగ్గర లేదు. కనీసం అమ్మాయి పేరైనా గుర్తులేదు" నా తప్పేం లేదన్నట్లు చెప్పాడు.

"అవును ఎలా ఉంటాయి మైనారిటీ తీరని కొడుక్కి పెళ్లిచేశావని తెలిస్తే నీ ప్రభుత్వోద్యోగం ఊడిపోతుందని శుభలేఖలు కూడా వెయ్యనీకుండా జాగ్రత్తపడ్డావు" దెప్పినట్లు అన్నాడు భీమేష్.

మాధవరావుకి చురుక్కుమంది కానీ తన ఆగ్రహాన్ని పంటి బిగువున ఆపుకున్నాడు. "నువ్వే అన్నావుగా! పెళ్లికి ఏ సాక్ష్యాలు లేవని. ఇకనేం ఒకవేళ ఆ పిల్ల బతికే ఉంటే ఈపాటికి మళ్లీ పెళ్లి చేసేసే ఉంటాడు రాఘవరావు. నువ్వు మాత్రం మమ్మల్ని మాటలతో, చేతలతో చంపేస్తున్నావు" భోజనం పూర్తికాకుండానే చేతులు కడిగేసుకుంటూ అన్నాడు.

"ఒక వ్యక్తి తరతరాలుగా ఉండే ఊరిని వదిలి ఆస్తిని అమ్ముకుని తన ఉనికి కూడా ఎవరికీ అందనంతగా బంధువులను, మిత్రులను వదులుకొని వెళ్లిపోయాడంటే ఆయన ఎంత గాయపడి ఉండాలి. బహుశా తేరుకోవడానికి జీవితకాలం చాలదు. ఇంక ఆ అమ్మాయి. ఈ దేశం విధానాలకి ఆడపిల్లకి ఒకసారి పెళ్లే పెద్ద ప్రహసనం. మళ్లీ పెళ్లి అంటే అసాధ్యం" అతని గొంతులో సుడులు తిరుగుతున్న బాధ.

మాధవరావు బదులు చెప్పలేనట్లు ఉండిపోయాడు. అంతవరకు తండ్రి కొడుకుల సంభాషణ మౌనంగా వింటున్న శారద కొడుకు దగ్గరకి వచ్చి తల నిమురుతూ

"నాన్నగారు తొందరపడ్డారు నిజమే. కానీ, ఎన్నాళ్లని ఆ అమ్మాయి గురించే ఆలోచిస్తావు. కాలం మనిషికిచ్చిన వరం మరుపు. అదృష్టమో ఏమోకానీ పెళ్లంటే జరిగింది కానీ మీ ఇద్దరికి తగిన వయసు రాని కారణంగా మేము తొలిరాత్రి ఏర్పాట్లు వంటి పొరపాట్లు చేయలేదు. వ్యక్తిగతంగా ఆ అమ్మాయి ఏమీ కోల్పోలేదు. కనుక మారిన కాలాన్ని బట్టి గతాన్ని పీడకలగా మర్చిపోయి మరో పెళ్లి చేసుకుందేమో కన్నా! నువ్వు పెళ్లిచేసుకుంటే ఆమెకి జరిగే అన్యాయం ఏమీలేదు. ఆలోచించు" బుజ్జగిస్తున్నట్లు అంది.

"ఎలా అమ్మా? నా చదువుకి నా ఎదుగుదలకి ఈనాటి నా డిగ్రీలు నా హోదా అన్నీ ఆనాడు నాన్న అల్లుడు అల్లుడు అని నన్ను చూపించి రాఘవరావుగారి దగ్గర వసూలు చేసినవే కదా! అదంతా గుర్తొస్తే ఒక్కోసారి నేను తినే తిండిమీద కూడా నాకు అధికారం లేదనిపిస్తోంది. నువ్వన్నదే నిజమై ఆ అమ్మాయికి పెళ్లి అయిపోయినా ఫరవాలేదు. కానీ రాఘవరావుగారి నుండి నా చదువు పేరు చెప్పి వసూలుచేసిన సొమ్ము వాళ్లకి అందచేస్తే చాలు. మీరు మళ్లీ ఎవరి మెళ్లో మూడు ముళ్లు వెయ్యమన్నా సంతోషంగా వేస్తాను. వీలైతే వాళ్ల వివరాలు సేకరించండి. ప్లీజ్" వేదనగా చెప్పి మరి అక్కడ ఉండలేనట్లు విసురుగా లేచి తన గదిలోకి వెళ్లి తలుపులు మూసుకున్నాడు. ఏంచెయ్యాలో పాలుపోనట్లు ఉండిపోయారు మాధవరావు, శారద.




శ్రీకాంత్ ఇచ్చిన అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవాలని గట్టి పట్టుదలగా ఉంది దాక్షిణ్య. అందుకే ఆఫీసులు, సమావేశ కేంద్రాలు అలకరించే ప్రత్యేక శిక్షణకు సంబంధించిన ఇంటీరియర్ డెకరేటర్స్‌ని కలిసి అలంకరణలో ఎలాంటి పువ్వులు

ఎప్పుడు, ఎక్కడ ఉపయోగించాలి అనే విషయాలను అధ్యయనం చేసి "న్యూవే" ఆఫీసులో తాను స్టడీ చేసిన అంశాలకు తన ఆసక్తి, అభిరుచులతో ఓ కొత్త రూపాన్ని ఇస్తోంది. సాధారణంగా సమావేశాలు నిర్వహించే హాలులోని పూల అలంకరణ వచ్చిన అతిథుల దృష్టిలో పెద్దగా పడదు. కారణం టేబుల్ మధ్యలో ఓ చిన్న వాజ్ లేదా మూలలో కాస్త పెద్ద సైజు కుండీలో పెట్టే రంగురంగుల ఆల్మండ్ జాతి రకాలు అలా కాకపోతే ఏ కిటికీ దగ్గరగానో ఉంటే క్రోటన్ టైపు ఆకుజాతి రకాలతో అలంకరించడం వల్ల అవి పెద్దగా అందరి దృష్టిని ఆకర్షించవు. కానీ దాక్షిణ్య తన అలంకరణ వచ్చిన అతిథులను ఆహ్లాద పరిచేదిగా ఉండాలని కోరుకునేది. అందుకే ఒక్కోసారి ప్రతివ్యక్తి ముందు నీళ్ళ గ్లాసుతో పాటు చిన్న మట్టి, పింగాణీ లాంటి సన్నటి పాత్రల్లో ఒక విచ్చిన పువ్వు, మొగ్గలను ఉంచేది. కిటికీల దగ్గర కేవలం క్రోటన్ జాతులను కాక తీగనున్నంత సేపు పరిమళించే లతల జాతి రకాలను పొడువుగా అల్లి పెట్టేది. అవి పరిమళంతో పాటు అందాన్ని ఇచ్చేవి. ఏదో ఓ మూల కుండీలో గుత్తులను అలంకరించకుండా గాలివాటు ఉన్న ప్రదేశాలలో సుగంధాలను వెదజల్లే పువ్వులను గుత్తులుగా పెట్టేది. అందువల్ల కృత్రిమంగా ఏ రూమ్ సెంటూ స్ప్రే చెయ్యనక్కరలేకుండానే ఆ సమావేశపు గది అంతా పువ్వుల సువాసన వ్యాపించి దాని పరిమళం అక్కడి వ్యక్తుల శ్వాసలోకే కాక మనసున కూడా నిండేందుకు తోడ్పడేది.

ఆమె అలంకరణ ఎంతగా ఆహుతుల మనసు చూరగొనేది అంటే సమావేశాలకు హాజరయ్యే ఇతర కార్పొరేట్ రంగ వ్యక్తులు ప్రత్యేకంగా ఫ్లోరిస్టు గురించి అడిగి తెలుసుకొని దాక్షిణ్యను కలిసి తమ కార్డులు ఇచ్చి కలవమని కోరేవారు. "న్యూవే"తో తన ఆరు నెల్ల కాంట్రాక్టు సంగతి చెప్పి సుతారంగా తప్పించుకునేది. గీత మాత్రం వచ్చే అవకాశాలు వినియోగించుకోవడానికి నిపుణుల సహకారం మంచిదని చెప్పి "న్యూవే" సంస్థకి ఇంటీరియల్ డెరకరేటర్‌గా పనిచేసే సుధా చావ్లాను పరిచయం చేసింది. సుధ, దాక్షిణ్యకి వృత్తి పట్ల ఉన్న అంకిత భావాన్ని గమనించి తను సేకరించే పుస్తకాలు, వెబ్ సైట్స్ నుండి పుష్పాలంకరణకు సంబంధించిన సమాచారాన్ని దాక్షిణ్యకు తెలియజేసేది. అందుకోసం వారానికి మూడురోజులు దాక్షిణ్యకు ప్రత్యేక శిక్షణా తరగతులు నిర్వహించేది. తన షాపు సమయాన్ని సవరించుకుని తప్పనిసరిగా ఆ క్లాసులకు హాజరయ్యేది దాక్షిణ్య.

ఆరోజు అలాగే ఉదయం ఏడు గంటలకే సుధ దగ్గరకు వెళ్ళేందుకు హడావిడిగా తయారవుతుంటే సావిత్రమ్మ గారు, రాణి చేత ఓ పళ్ళెంలో పూలు, పళ్ళతో వచ్చి, "అమ్మా దక్షా! నీతో మాట్లాడాలి. ఓసారి ఇలారామ్మా" హాల్లోంచి పిలిచారు.

తల దువ్వుకుంటున్నదల్లా దువ్వెన్న చేతిలోనే ఉంచుకొని వచ్చి

"ఏంటండీ" అడిగింది.

"మా రాణికి పెళ్ళి కుదిరిందమ్మా, చెబుదామని వచ్చాను" కుర్చీలో కూర్చుంటూ అంది. చేతిలో పళ్ళెం టీపాయి మీద పెట్టి సిగ్గుగా తలొంచుకుంది రాణి.

"హాయ్, కంగ్రాచ్యులేషన్స్! నీ పెళ్ళి అలంకరణకయ్యే పువ్వులన్నీ మా షాపులోనే తీసుకోవాలి" దగ్గరకెళ్ళి భుజంమీద చెయ్యేసి సరదాగా అంది. సావిత్రమ్మ నవ్వేసింది.

"ఒక్క పువ్వులేమిటీ? పెళ్ళే మీ చేతుల మీదుగా జరగాలనే కోరికతోనే ఇక్కడికి వచ్చాను" చెప్పి హాల్లో ఉన్న వైదేహి దాక్షిణ్య, బామ్మలను ఒకసారి కలయ చూసి

"మీకు చెప్తే ఉంటాను. మా భాస్కరం పదిహేనేళ్ళ వయసులో ఆయన పోయారు. అప్పటినుండి మా కుటుంబాన్ని భాస్కరమే నెట్టుకొస్తున్నాడు. మా పెద్ద పిల్ల పెళ్ళికి

మా బావగారిని పీటల మీద కూర్చోపెట్టి కన్యాదానం జరిపించాం. కానీ, రాణి పెళ్ళికి మా పెద్దాడే కన్యాదానం చెయ్యాలని నా ఆశ. అందుకే ముందు భాస్కరానికి పెళ్ళి చేస్తేనే కొడుకు, కోడలు కన్యాదానం చేస్తారు. ఆ ఫలితం ఇటు భాస్కరానికి అటు నా భర్తకి ఇద్దరికీ దక్కుతుందని నా కోరిక. కానీ ఇంత తక్కువ టైమ్‌లో మా గురించి అన్నీ తెలిసీ మా కష్టసుఖాల్లో ఏ తేడా లేకుండా కలిసిపోయే పిల్ల మీ ఇంట్లో తప్ప నాకు ఎక్కడా కనిపించలేదు. అందుకే మా భాస్కరాన్ని మీ అల్లుడిగా చేసుకోమని పిన్నిగారిని అడిగాను. ఆవిడ ఇంటి బాధ్యత, ఇంట్లో వాళ్ల మంచి చెడ్డలు నీవే చూస్తావని నీతోనే మాట్లాడమన్నారు. అందుకే వచ్చాను" చెప్పింది.

జడ అల్లుకోవడం ముగించి హెయిర్ బ్యాండ్ పెట్టుకుంటున్న దక్ష ఓ వార నీరెండలో కూర్చుని వత్తులు చేస్తున్న బామ్మని చిత్రంగా చూసి "కానీ, మీకు తెలుసో లేదో మా వేదక్కకి ఇంతకు ముందే వివాహమైంది. మా బావ పెళ్లయిన వారానికే ప్రమాదవశాత్తు చనిపోయారు" చెప్పింది. వైదేహి చేతిలో బియ్యం చేటతో వంటింట్లోకి తప్పుకుంది.

సావిత్రమ్మగారు ఇబ్బందిగా కదిలి "నేను వచ్చింది వైదేహి కోసం కాదు" అంది.

దాక్షిణ్య ఆశ్చర్యంగా చూసింది. "మరీ! అంటే మీ ఉద్దేశ్యం చిత్రా! దాని చదువింకా పూర్తి కాలేదు. అప్పుడే పెళ్లి చేసే ఆలోచనే నాకు లేదు" కాఫీ తాగుతున్న చిత్ర అక్క సమాధానానికి చాలా సంతోషించింది.

"బాబోయ్, ఆ ఆర్ట్ సినిమా హీరో లాంటి భాస్కర్‌తో నాకు పెళ్లా?" భయంగా అనుకుంది.

"బావుందమ్మా నువ్వు చెప్పేది. ఈ ఇంట్లో మీ అక్కా, చెల్లి మాత్రమే పెళ్ళీడు వాళ్లన్నట్లు మాట్లాడతావు. నువ్వు ఆడపిల్లవి కాదా? నీకు పెళ్ళి వయసు రాలేదా?" నవ్వుతూ అసలు విషయం చెప్పింది సావిత్రమ్మ. చేతిలోని బ్యాగ్ దాక్షిణ్య ప్రమేయం లేకుండా జారిపోయింది. నమ్మలేనట్లు ఆవిడకేసి బామ్మకేసి మార్చి మార్చి చూస్తూ,

"మీరు, నన్ను అడగడానికి మా బామ్మతో మాట్లాడారా?" గొంతు పెగల్చుకొని అడిగింది.

"భాస్కర్‌కి నిన్ను చేసుకుంటామనే పిన్నిగారిని అడిగాను. ఇన్నేళ్ళుగా చూస్తున్నాను. ఈ కుటుంబం కోసం నువ్వెంత కష్టపడుతున్నావో మాకు తెలుసు. ఈ పెళ్లి కోసం నీ బాధ్యతలు వదులుకోనక్కర లేదు. పక్కవాటానే కనుక నీ వాళ్లని విడిచి వెళ్లే సమస్యా లేదు. ఉన్నదేదో ఒకరికొకరం ఇచ్చి పుచ్చుకుంటాం కనుక కట్నం కానుకలు కూడా మాకు అక్కరలేదు. కాకపోతే మారాణికి ఓ యాభై వేలు కట్నం ఇస్తామన్నాం. అవి కాస్త నువ్వు సర్దగలిగితే పెళ్లయ్యాక భాస్కరం జీతంతో తీర్చేయవచ్చు. ఇవన్నీ ఎవరైనా పెద్ద వాళ్ళని, మధ్యవర్తులను పెట్టుకుని మాట్లాడుకోవలసిన విషయాలు. కానీ నిత్యం ఒకరి సంగతులు మరొకరం చూసుకుంటూ గడిపే మనకి వాళ్లెందుకని నేనే స్వయంగా మాట్లాడడానికి వచ్చాను" వైదేహి తెచ్చిన కాఫీ గ్లాసు అందుకుంటూ చెప్పింది సావిత్రమ్మ.

ఆ గదిలో సావిత్రమ్మ, దాక్షిణ్య తప్ప మిగిలిన వాళ్లంతా ప్రేక్షకులుగానే ఉన్నారు. దాక్షిణ్య మెల్లగా సావిత్రమ్మగారి ఎదుటి కుర్చీలో కూలబడింది.

"మీకెలా చెప్పాలో నాకు తెలియడం లేదు. నాకు పెళ్ళి అనే ఊహ తలుచుకుంటేనే వెగటు వస్తోంది. మీరు మరోలా అనుకోవద్దు. నాకు ఇష్టం లేదు. రాణి కట్నం డబ్బు కోసమే అయితే నా ప్రయత్నం నేను చేసి ఇస్తాను. నెమ్మదిగా తీర్చమని చెప్పండి మీ అబ్బాయికి. మిమ్మల్ని నొప్పిస్తే క్షమించండి" చేతులు జోడించింది.

సావిత్రమ్మ మొహం మాడిపోయింది.

గ్లాసు టీపాయ్ మీద పెట్టేసి రాణికి సైగ చేసి కొంగు భుజాన్న లాక్కుంటూ ఎవరికి చెప్పకుండానే వెళ్ళిపోయింది.

ఆవిడ పూర్తిగా వెళ్లిపోయింది అని నిర్ధారించుకున్నాకా, చటాలున లేచి బామ్మకేసి తిరిగి "నీకు మతిపోయిందా? నాకు సంబంధం మాట్లాడమని నువ్వు ఆవిడను పంపించావా? " ఆగ్రహంగా అడిగింది.

గాజుగోళీల లాంటి కళ్ళెత్తి ఓసారి మనవరాలి ముఖంలోకి చూసి,

"నావల్లే మీ అప్పాచెల్లెళ్ల జీవితాలు నాశనమయ్యాయని మొన్న నువ్వేగా అన్నావు. వేద జీవితాన్ని నేను ఎలాగా బాగుచెయ్యలేను. నువ్వయినా ఈ పెళ్ళి వల్ల సుఖపడతావని ఆవిడ మాట్లాడతానంటే, సరే అన్నాను" నిర్లిప్తంగా బదులిచ్చింది ముసలమ్మ.

చాడు.

ఆగి, అమ్మ అయ్యింది. ఇంక కొడుకు వాయింపులాగుంది అనుకుంటూ మొహం సీరియస్‌గా పెట్టి ఏమిటన్నట్లు చూసింది.

"మా అమ్మ ప్రపోజల్‌ని మీరు తిరస్కరించారట కదా!" దగ్గరగా వచ్చి అడిగాడు.

"నేను త్వరగా వెళ్లాలి. మనం నడుస్తూ మాట్లాడుకుందామా" అడిగింది. అతను అంగీకారంగా తల ఊపి తన సైకిల్‌ని పట్టుకుని ఆమె పక్కగా నడుస్తున్నాడు.

"భాస్కర్‌గారూ, నా గురించి మీకు ఎంత తెలుసో నాకు తెలియదు. మీ గురించి నాకైతే ఏమీ తెలియదు. మీకు బహుశా నా కుటుంబ బాధ్యతలు మాత్రమే తెలిసి ఉండొచ్చు కానీ, వాటికి మించిన సమస్యలు, బంధాలు నాకు చాలా ఉన్నాయి.

**మీకు బహుశా నా కుటుంబ బాధ్యతలు మాత్రమే తెలిసి ఉండొచ్చు. కానీ, వాటికి మించిన సమస్యలు, బంధాలు నాకు చాలా ఉన్నాయి. వాటిని నేను వదిలించుకోలేను. అందుకే కాదన్నాను**



దాక్షిణ్య వెర్రెక్కినట్లు చూసింది. కోపంగా ఏదో అనబోతుంటే వైదేహి ఆమె హేండ్ బ్యాగ్ తెచ్చి ఇచ్చి "ఇప్పటికే ఏడున్నర అయ్యింది. నువ్వెళ్ళు! దక్షని వీధి గుమ్మం కేసి తిప్పుతూ అంది.

"ఛ, ఈ ముసలావిడకి రోజురోజుకి వయసు తప్ప బుద్ధి రావడం లేదు. బుర్ర పిచ్చెక్కించేస్తోంది" విసుగ్గా అంటూ చున్నీ వేసుకొని చిత్ర స్కూటీ దగ్గరకి వెళ్ళి అది పంచర్ అవడం గమనించి

"ఈ రోజు లేచిన వేళే బాగోలేదు. నాఖర్మ. సుధ కూడా వెళ్లిపోయి ఉంటుంది" గొణుక్కుంటూ హడావిడిగా బస్‌స్టాప్ వైపు నడిచింది. సందు చివర మరో ఆటంకం భాస్కర్ రూపంలో అడ్డుకుంది ఆమెను.

"దాక్షిణ్యగారూ, ఒక్క నిమిషం" ఒక పాన్ షాపు దగ్గర నిలబడ్డ భాస్కరం పిలి

వాటిని నేను వదిలించుకోలేను. అందుకే మీ అమ్మగారి మాటను కాదన్నాను. ఐ యాం సారీ" స్పష్టంగా చెప్పింది.

"మీ బాధ్యతలు వాటి భారం నాకు తెలుసు. ఎందుకంటే కుటుంబ బాధ్యతల్ని భరించడం ఎంత కష్టమో నాకు తెలుసు కనుక. అందుకే ఈ పెళ్ళి మీ భారాన్ని కాస్త తగ్గించి, నా బాధ్యతలను పంచుకునేందుకు చేయూత అవుతుందనే అమ్మ మీతో మాట్లాడతానంటే సరే అన్నాను. నా దురదృష్టం మీరు ఒప్పుకోలేదు. కానీ ఒక్క మాట అడగనా? మీరు మాత్రం ఎన్నాళ్లు ఒంటరిగా వైదేహికి తోడుగా ఉండగలరు. త్వరలోనే మీరు, చిత్ర పెళ్లి చేసుకుని వెళ్లిపోతారు. బామ్మగారు పెద్దవారు. చిన్నా బాధ్యత మీరే చూసుకుంటారు. మరి వైదేహి పరిస్థితి ఏమిటి? జీవితాంతం

ఆవిడ చెయ్యని తప్పుకు శిక్షని అనుభవిస్తూ ఒంటరిగా మగ్గిపోవాలా? ఇదెక్కడి న్యాయ మండీ" మృదువుగా అడిగాడు. దాక్షిణ్య అతని మాటలు అర్థం కానట్లు నిలబడిపో యింది. ఆమెకన్నా రెండు అడుగులు ముందుకెళ్లి ఆమె ఆగిపోవడంతో వెనక్కి తిరిగి చూశాడు.

"అంటే మీ ఉద్దేశ్యం మీరు మా వేద క్కను పెళ్ళి చేసుకుంటానంటున్నారా?" అనుమానంగా అడిగింది, దగ్గరకి వస్తూ

"అవును. వేదగారు నాకు బాగా తెలుసు. అమ్మకి చేతిపనుల్లో సాయం, ఆర్థిక సాయం చేసేటప్పుడు ఎదుటివాళ్ళ కష్టాలకు సాను కూలంగా స్పందించే ఆవిడ గుణాన్ని నేను దగ్గరగా గమనించాను. కుటుంబ జీవితం పట్ల మమకారాన్ని గమనించాను. మీరు సంపాదించి తెచ్చి ఇచ్చిన మొత్తాన్ని ఇంట్లో సద్వినియోగవంతంగా నిర్వహించే నేర్పరిత నాన్ని నేను చూశాను. అందుకే ఆవిడైతేనే నా కుటుంబ నిర్వహణకు సరియైన వ్యక్తి అనిపించి, అమ్మ మాట్లాడతాను అంటే, సరే అన్నాను" విచిత్రంగా చూస్తూ చెప్పాడు.



దాక్షిణ్య పెదాలపై చిన్న చిరునవ్వు కదిలి మాయమయ్యింది. భాస్కరం ఉద్దేశం వైదేహి అయినా సావిత్రమ్మగారు విధవరాలిని కన్నా సంపాదనాపరురాలైన తనను చేసుకోవడం లాభదాయకమనుకొని మాటల్ని కదిపింది. దాక్షిణ్య చేసుకోనంటే కొడుకుకి వచ్చి వైదేహికి మళ్ళీ పెళ్ళి చెయ్యరట అని చెప్పింది. కానీ వేదను మనసారా కోరుకున్న భాస్కరం ఆగలేక వచ్చి బయటపడిపోయాడు. నెమ్మదిగా విషయం అర్థం కాసాగింది. ఇద్దరూ బస్టాప్ చేరుకుని కాస్త ఎడంగా నిలబడ్డారు.



భాస్కరంకేసి తిరిగి చేతులు కట్టుకొని, "భాస్కర్, మీకు తెలుసేమో! మా అక్క పెళ్ళయిన వారానికే భర్తను పోగొట్టుకొన్న అభాగ్యురాలు. అది దాని జీవితానికో మచ్చ. మీరు జాలితో దాన్ని ఉద్ధరించాలనుకుంటే ఆ ఉద్దేశ్యాన్ని మానుకోండి. రాణి పెళ్ళికి కట్నం ఏభైవేలు సర్దమని మీ అమ్మగారు అడిగారు. ఊరికే అడిగితే లేదంటామని అక్క పెళ్ళి అని ఆశపెట్టే ఆలోచనైతే ఆ ఊహనే వదులుకోండి. మనిషిగా డబ్బు సాయం చేస్తాను కానీ మా మనసులతో మీ స్వార్థానికి ఆడుకుంటానంటే నేను భరించలేను" సూటిగా అంది.

అభిమానం గాయపడ్డట్టు చూశాడు భాస్కర్ "వైదేహిని ఉద్ధరించాలనే జాలితోనో, డబ్బుకోసమో కాదు. నేనుగా ఇష్టపడి వైదేహిని నా భార్యగా చేసుకోవాలనుకుంటున్నాను. నాలాంటి డైలీ లేబర్‌కి ఇవ్వడం మీకిష్టం లేనట్టుంది. పోనీలెండి" అని వెళ్ళబోతూ ఆగి,

"ఆ! కట్నం కూడా మీ సొమ్ము అక్కరలేదు. నా పాట్లు నేను పడతాను. మిమ్మల్ని ఇబ్బంది పెట్టాను క్షమించండి" వెనుతిరిగాడు. సైకిల్ వెనకగా పట్టుకొని ఆపేసింది.

"ఉదయం ఇంట్లోంచి బయలుదేరుతూ ఈవేళ అస్సలు బాగాలేదని తిట్టుకున్నాను. కానీ ఈ రోజు ఎంత మంచిదో ఇప్పుడు తెలిసింది. మోడు వారిని అక్క బతుకు మీ అండతో చిగురిస్తుందంటే నాకు చాలా ఆనందంగా ఉంది" నవ్వుతూ అంది.

"నిజంగా...!" నమ్మలేనట్లు అడిగాడు భాస్కరం.

అవునన్నట్లు తల ఊపి వాచీ చూసుకుంది. టైమ్ ఎనిమిది దాటింది.

"ప్చ్! ఈపాటికి నేను కలవవలసిన వ్యక్తి వెళ్ళిపోయి ఉంటారు. నాతో షాపుకి వస్తారా? వివరంగా మాట్లాడుకుందాం" అడిగింది.

"మరి సైకిల్...?" అడిగాడు.

కాస్త పక్కగా ఉన్న ఎస్.టి.డి బూత్ గమనించి "అక్కడ పెడదాం" అంది. తను సుధకి ఫోన్ చేసి రాలేకపోయినందుకు క్షమాపణ చెప్పి వచ్చేటప్పుడు సైకిల్ ఆ బూత్‌లోని కుర్రాడికి అప్పగించి, అటుగా పోయే ఆటోని ఆపి షాపుకి పోనీయమంది. మౌనంగా ఆమెను అనుసరించాడు భాస్కర్.




శాంతి నిలయం సిటీకి దూరంగా ప్రశాంతంగా ఉంటుంది. కానీ అక్కడికి బస్సు సౌకర్యం చాలా తక్కువ. ఏ రూటు బస్సో ఎక్కి హైవే మీద దిగి దాదాపు రెండు కిలో మీటర్ల దూరం కాలినడకన వెళ్ళాలి. అందువల్లనే ఎక్కువ శాతం దాక్షిణ్య చిత్ర స్కూటీ పైనే వస్తుంది కానీ చిత్ర కాలేజీకి వెళ్ళడం వల్ల, భాస్కరానికి కొట్టును అలవాటు చెయ్యడం కోసం సుజాతా, మరియమ్మలకు అప్పచెప్పి చాలా రోజులయ్యిందనే భావనతో తండ్రిని చూసేందుకు బయలుదేరింది.

తల వంచుకుని భాస్కర్ మాటలను గురించి ఆలోచిస్తూ నడుస్తోంది. ఏం చెప్పుకున్నాడో కానీ తల్లిని వైదేహిని చేసుకోవడానికి ఒప్పించాడు. వేద మాత్రం ఓ పట్టాన ఒప్పుకోలేదు. ఆమె మనసులో ఏదో మూల తాను నష్టజాతకురాలు, అందుకే భర్తను కోల్పోయాననే ప్రగాఢ భావన నరనరాలలోనూ జీర్ణించుకుపోయింది. ఆమెను కూడా అతనే అంగీకరింపచేస్తున్నాడు. భాస్కర్‌కి అవసరమైన ఆర్థిక సాయంతో పాటు 'న్యూవే' కారణంగా తనకి వస్తున్న అలంకరణ ఆఫర్లను దృష్టిలో ఉంచుకొని భాస్కరం చేత ఫ్యాక్టరీ పని మానిపించి తన షాపు నిర్వహణా పద్ధతులను నేర్పుతూ అతనినీ భాగస్వామిని చేస్తోంది.

మరో పదిరోజుల్లో రిజిస్టర్ ఆఫీసులో వైదేహి, భాస్కరంల పెళ్లికి తేదీని నమోదు చేశారు. గురుదేవునికి ఆ సంగతి చెప్పి వీలైతే తండ్రిని పెళ్లికి తీసుకెళ్లాలి అనుకుంటూ నడుస్తున్న దాక్షిణ్య పక్కనే ఆగిన కారు శబ్దానికి ఉలిక్కిపడి చూసింది.

"హలో, మీరు ఇలా...? ఎక్కడికి?" తల బైటపెట్టి కాస్త ఆశ్చర్యంగా అడిగాడు భీమేష్.

అతణ్ణి అక్కడ చూడడం ఆమెకూ కాస్త ఆశ్చర్యంగా అన్పించింది. "కానీ మీకు చెప్పాలా?" చిరాగ్గా ఎదురు ప్రశ్నించింది.

నవ్వేశాడు. "అక్కరలేదు. కాకపోతే ఒకే దారి అయితే సాయం చేద్దాం అనుకున్నాను. మీకిష్టం లేకపోతే వద్దు. బట్ తెలిస్తే కాస్త నాకు ఇక్కడ శాంతి నిలయం అనే ఆశ్రమం ఉందట. దానికి దారి చెప్పగలరా?" అడిగాడు.

"అక్కడ మీకేంపని?" అనుమానంగా అడిగింది.

"నా స్నేహితుడి నాన్నగారు అక్కడ వాళ్లకి యోగా క్లాసులు చెబుతారట. ఈ రోజు ఆయన రావడం కుదరదట. ఆ విషయం నన్ను చెప్పమంటే వచ్చాను. కానీ అడ్రసు తెలియక అవస్థగా ఉంది"

"కష్టపడి ఇంత దూరం రావడం ఎందుకు? ఫోన్ చెయ్యొచ్చుగా?" భీమేష్‌కి విసుగొచ్చింది.

"మీరేంటండీ? అడ్రస్సు తెలుసా అని అడిగిన పాపానికి లాయర్‌లా నిలదీస్తున్నారు. ఫోన్ నెంబరు తెలిస్తే ఇంత దూరం రావడానికి నేను పిచ్చాడినా?" విసుక్కున్నాడు.

తల వంచుకుని చిన్నగా నవ్వుకుంటూ వచ్చి ముందు డోర్ తెరచుకుని కారులో

కూర్చుంది. ఆమె సూచనల ప్రకారం కారుని నడుపమన్నాడు. "నా పని ఏమిటో చెప్పాను. మీరు వెళ్లేది ఎక్కడికో తెలుసుకో వచ్చా? " అడిగాడు.

"శాంతి నిలయానికి" అభావంగా చెప్పింది. విచిత్రంగా చూశాడు. "అది వృద్ధుల వానప్రస్థాశ్రమం లాంటిదనీ, మాన సికంగా విచలితులైన వాళ్లు మనఃశ్శాంతి కోసం అక్కడ చేరతారనీ విన్నాను. మీరూ అందులో సభ్యులా? " అడిగాడు.

ఇబ్బందిగా కదిలింది దాక్షిణ్య. "నేను... నేను అందులో వాలంటీర్‌గా పనిచేస్తు న్నాను. నా ఖాళీ సమయంలో అక్కడ వారికి చేతనైన సాయం చేస్తాను" అబద్ధం చెప్పింది.

అతని కళ్లలో ఓ ప్రశంస, చిన్న ఆశ్చర్యం కనిపించాయి. "నిజంగా! రియల్లీ యూ ఆర్ గ్రేట్. పువ్వులను ప్రేమించే మీది చాలా సున్నితమైన మనసు అనుకున్నాను కానీ ఇంత మంచి మనసని నేను ఊహించలేదు" అభినందనగా అన్నాడు.

దాక్షిణ్య బదులివ్వలేదు. గిల్టీగా బయట కదిలిపోయే చెట్లని చూస్తూ మౌనంగా ఉండిపోయింది. కారు శాంతి నిలయంలోకి ప్రవేశించింది. ఎందుకో అంతా చాలా హడా విడిగా ఉన్నారు. కారు దిగి అటుగా వెళ్తు న్న రాజమ్మని పిలిచి "ఏం జరిగింది? " అడి గింది.

ఒక్కక్షణం తడబడినట్లు చూసిన రాజమ్మ "వెనకాల ధ్యానమందిరం మీద ఇంకో ఫ్లోర్ వేస్తున్నారమ్మా. ఎప్పుడెళ్లారో, ఎలా పడ్డారో రాఘవరావుగారు అక్కడినుండి కింద రాళ్ల గుట్టమీద పడిపోయారు. ఆశ్రమంలోని డాక్టరు పరీక్షిస్తున్నారు" కంగారుగా అంది. దాక్షిణ్య కళ్లు ఆశ్చర్యంతో భయంతో విచ్చు కున్నాయి. "ఇప్పుడెక్కడున్నారు" అడుగుతూ బాబా గదివైపు కంగారుగా పరిగెత్తింది. విషయం పూర్తిగా అర్థం కాకపోయినా ఆమెను అనుసరించాడు భీమేష్.

"బాబా! రక్తం చాలా పోయింది. వెంటనే ఎక్కించాలి. అది ఇక్కడ సాధ్యం కాదు. సిటీలోకి తీసుకెళ్లాల్సిందే" ఫస్ట్ ఎయిడ్ చేసిన డాక్టర్ బాబాతో చెప్పాడు.

"నాన్నా, నాన్నా! నేను దక్షని వచ్చాను. ఒక్కసారి కళ్ళు తెరు" తండ్రిని పడుకోబెట్టిన బల్లమీదగా వొంగి చెంపలు తడుతూ ఆత్రంగా పిలుస్తోంది. దాక్షిణ్య నీళ్ళు నిండిన కళ్ళతో చూస్తూ.

బాబా ఓదార్పుగా ఆమె భుజం తట్టి "మన ఆశ్రమం వ్యానుని సిద్ధం చెయ్యమని చెప్పు" రాజమ్మకేసి తిరిగి ఆజ్ఞాపించారు.

కాస్త వెనకగా నిలబడిన భీమేష్ ఓ అడుగు ముందుకేసి, "నా కారు గుమ్మం లోనే ఉంది" చెప్పాడు.

డాక్టర్ సైగనందుకొని సిబ్బంది రాఘవ రావుని కారు వెనక సీటులో చేర్చారు. తండ్రి తలని ఒళ్ళో ఉంచుకుని కూర్చుంది దాక్షిణ్య. ఆశ్రమం డాక్టరు, మరో వాలం టీరు భీమేష్‌తో కలిసి బయలుదేరారు.

తండ్రిని హాస్పటల్‌లో చేర్పించి రక్తం ఎక్కించి 'ఆయనకు ప్రాణాపాయం తప్పింది' అని డాక్టరు నోట విన్నాక కానీ దాక్షిణ్య మనసు శాంతించలేదు. స్పృహలోకి వచ్చేందుకు మరో ఆరేడు గంటలు పడు తుందని, తెల్లారాక రమ్మని డాక్టరు చెప్పాక దాక్షిణ్య టైమ్ చూసుకుంది. అర్ధరాత్రి ఒకటి నలభై అయ్యింది. ఇంటి దగ్గర వైదేహి, బామ్మా కంగారు పడతారనే విషయం గుర్తుకు వచ్చి హాస్పటల్ రిసెప్షన్ దగ్గరకి ఫోన్ కోసం వచ్చింది. అప్పటికే ఫోన్ లాక్ చేసి అక్కడి అమ్మాయి వెళ్ళిపోయింది. ఏం చెయ్యాలో అని ఆలోచిస్తూంటే, కాస్త ఓ వారగా ఉన్న బెంచీ మీద దాక్షిణ్య రాక కోసమే నిరీక్షిస్తున్న భీమేష్ దగ్గరకి వచ్చి,

"ఎలా ఉన్నారు? " అడిగాడు.

"మీరింకా వెళ్ళలేదా? " ఆశ్చర్యంగా అడు గుతూనే, "ప్రమాదం తప్పింది. కానీ ఇంకో ఏడు గంటలు గడిస్తే కానీ స్పృహలోకి

రారట" దిగులుగా చెప్పింది.

"ప్రాణాపాయం లేదుగా! బీ హేపీ" ఓదార్పుగా అని "ఈ పక్కనే కాఫీ షాపు ఉంది. కొంచెం కాఫీ తాగితే టెన్షన్ తగ్గుతుంది" చెప్పాడు.

"ఊహూ! ముందు ఇంటికి ఫోన్ చెయ్యాలి. నేను ఇంకా రాలేదని కంగారు పడుతూ ఉంటారు. అసలే బామ్మకు గుండె జబ్బు. బయట పబ్లిక్ ఫోను తీసుందేమో చూసి చేసివస్తాను" చెప్పింది.

భీమేష్ జేబులోంచి తన సెల్‌ఫోన్ తీసిచ్చి.. "దీనితో చేసుకోండి" చెప్పాడు. కాదనకుండా అందుకుంది. ఇంటికి రింగ్ చేస్తే వైదేహి పలికింది.

"అక్కా, నేను. శాంతినిలయం నుండి మాట్లాడుతున్నాను" అబద్ధం చెప్పింది.

"ఎప్పుడో నాలుగింటికి పనుందని వెళ్ళావని భాస్కర్ చెప్పారు. అక్కడేం చేస్తున్నావు? నాన్న ఎలా ఉన్నారు? " అరిచినట్లు అడిగింది.

"ఇక్కడ సాయంత్రం నుండీ ఒకటే వాన అక్కా! ఆశ్రమంలో ఫోను కూడా పోయింది. ఇప్పుడే ఎవరిదో సెల్‌ఫోన్ ఉందని తెలిసీ అడిగి చేస్తున్నాను. నాన్న బాగానే ఉన్నారు. కొంచెం జ్వరంగా ఉందట. ఓ నాలుగు రోజులు రోజూ వచ్చి చూడమన్నారు. మీరేం కంగారుపడొద్దు. నేను వాన తగ్గగానే ఉదయం వస్తాను" చెప్పి పెట్టేసింది.

ఫోన్ తిరిగి ఇస్తుంటే అడిగాడు, "ఈ రాత్రికి ఇంక ఇంటికి వెళ్ళరా? " తల అడ్డంగా ఊపింది.

"నాన్న కళ్ళు తెరిస్తేకానీ, నా మనసు కుదుటపడదు. అదీగాక నాన్న హాస్పటల్లో ఉన్న విషయం ఇంట్లో తెలియడం నాకు ఇష్టంలేదు" చేతులు కట్టుకుని చెప్పింది.

రెండు నిమిషాలు ఏదో ఆలోచిస్తూ మౌనంగా ఉండిపోయిన భీమేష్ "సరే, మరి నేను వెళ్తాను. గీతకి మిమ్మల్ని కలవమని చెబుతాను" చెప్పి బయలుదేరాడు.

ఎందుకో అతను తనని ఒంటరిగా వదిలి వెళ్ళిపోతాననడం దాక్షిణ్యలో నిరుత్సాహాన్ని కలిగించింది. కానీ అతన్ని ఆపే అధికారం, చొరవ తనకి లేదనే ఊహ ఆమెను అదుపు చేసింది. వెళ్తున్న అతన్ని ఉద్దేశించి

"భీమేష్, మీరు చేసిన సహాయానికి కృతజ్ఞతలు" చెప్పింది. చిన్నగా నవ్వాడు.

"ఇప్పుడు కాదు" చెప్పి వెళ్ళిపోయాడు. అర్థం కానట్లు చూస్తుండిపోయింది. అతని మాటలకు అర్థం మర్నాడు ఉదయం ఒక బుట్టలో కాఫీ, టిఫిన్లు, మార్చుకోవడానికి బట్టలతో గీతని వెంటబెట్టుకొని రావడంతో తెలిసింది.

"నిన్న మీ నాన్నగారి తలని ఒళ్లో పెట్టుకోవడంతో మీ చీరంతా రక్తం మరకలయ్యాయి. ఆ బట్టలతో ఇంటికి వెళ్లలేరని గీతకి విషయం చెప్పి మీకు అవసరమైనవన్నీ తెచ్చాం. మీరు ఫ్రెష్ అయి కాఫీ తాగి, టిఫిన్ తినండి. నేను డాక్టర్‌ను కలిసి మీ నాన్నగారి పరిస్థితి కనుక్కొని వస్తాను" చెప్పి వెళ్ళాడు.

వెళ్తున్న అతన్నే చూస్తూ నిలబడిపోయిన దాక్షిణ్య భుజం మీద చెయ్యేసి, "మనమనుకున్నంత చెడ్డవాడు కాదు భీమేష్" అంది గీత. అంగీకారంగా తల ఊపి ఊరుకుంది. మరికాసేపటికి రాఘవరావును పరీక్షించిన డాక్టర్ ప్రాణాపాయం తప్పిందనీ, కానీ మరో వారం హాస్పటల్లో ఉంచాలని చెప్పారు. కళ్ళు తెరిచినా తనని ఏమాత్రం గుర్తించని తండ్రిని గమనించి చిన్నగా నిట్టూర్చి తండ్రికి డాక్టర్ చెప్పిన ఆహారాన్ని గీత వండి తెస్తాననడంతో ఇంటికి బయలుదేరింది.

గీతని ఆమె ఇంటి దగ్గర దింపి, "మీరూ, ఇక్కడ దిగుతారా? " అడిగాడు. సీటు వెనక్కి వాలి అలసటగా కళ్ళు మూసుకొని ఉన్న దాక్షిణ్య కళ్ళు తెరవకుండానే,

"నేను అర్జంటుగా ఇంటికి వెళ్ళాలి" చెప్పింది.

"ప్లీజ్ సార్, దక్షని ఇంటి దగ్గర దింపే యండి" గీత కోరింది.

కారును వెనక్కి తిప్పి "మీరు నిద్రపో తుంటే నాకు దారి తెలియదు" హెచ్చరి కగా అన్నాడు.

నిద్రలేక వుండే కళ్ళని అరచేత్తో వత్తు కుంటూ. తన ఇంటికి వెళ్ళే మార్గాన్ని చెప్పింది. జేబులోంచి ఒక సెల్ ఫోన్ తీసి ఇచ్చి "ప్రస్తుతం ఇది మీకు చాలా అవసరం. హాస్పటల్లో, ఆశ్రమంలో, గీతకి మిమ్మల్ని కాంటాక్టు చెయ్యాలంటే చెయ్య మని ఈ నెంబర్ ఇచ్చాను. మీ ఇంట్లోను, షాపులోనూ కూడా ఇస్తే, మీరు ఎక్కడ ఉన్నా అందరికీ మీరు అందుబాటులో ఉండగలుగుతారు" చెప్పాడు.

"నాకు ఇచ్చేస్తే మీకేవైనా ఫోన్లు వస్తే? " అందుకుంటూ ఇబ్బందిగా అడి గింది.

నవ్వేశాడు "అది నా సెల్ కాదు. మీదే" చెప్పాడు.

ఎందుకో థాంక్స్ చెప్పాలి అనిపించ లేదు ఆమెకు. పైగా రాత్రి అన్న "ఇప్పుడే కాదు" అన్న అతని మాటలు గుర్తొచ్చి మౌనంగా దిగిపోయింది.

* * *

"కష్టాలు చుట్టాలు లాంటివట. వస్తే ఒకేసారి కట్టకట్టుకొని వస్తాయంటారు. ప్రస్తుతం ఈ దాక్షిణ్య స్థితి అలాగే ఉంది" చేతితో నీళ్ళగ్లాసు చుట్టూ సున్నాలు చుడుతూ విషాదంగా అంది దాక్షిణ్య.

"దక్షా! ప్లీజ్ అసలు ఏమయ్యిందో చెప్పు" కోరింది గీత.

"నాన్నకి జరిగిన ప్రమాదం నా మాన సిక స్థైర్యాన్ని దెబ్బతీసింది. ప్చ్ ఎందుకో దేనిమీద ఇదివరకులా మనసు నిలపలేక పోతున్నాను. షాపు బాధ్యత పూర్తిగా భాస్కర్ మీద వదిలేశాను. అతను ఏం చేస్తున్నాడో, షాపు ఏ స్థితిలో ఉందో ఏదీ పట్టించుకోవడం మానేశాను. నువ్వున్నావు

## గరళకంఠుడు.. కోర్టు కేసు

వీరశైవ మతానికి చెందిన కేసును వాది స్తున్నారు రాఘవ. మతం తరపువారుఒక చిన్న అబద్ధం ఆడితే కేసు నిలుస్తుంది. లేకుంటే పోయేలా ఉంది. కానీ వాళ్లు ఛాదస్తులు. చూస్తూ చూస్తూ అబద్ధం ఎలా ఆడాలి అని సంకోచిస్తున్నారు. న్యాయవా దిగా రాఘవ కూడా అబద్ధం చెప్పండని గట్టిగా చెప్పలేకపోతున్నారు.

ఆ పరిస్థితుల్లో చివరి అస్త్రంగా ఆయన 'అయ్యా.. లోకకల్యాణం కోసం మీ శివుడు విషాన్నే తాగాడు. దాన్ని కంఠంలోనే దాచు కుని గరళ కంఠుడయ్యాడు. ఎందరికో సేవ లుచేసే మీరు మతాన్ని రక్షించుకోవడం కోసం చిన్న అబద్ధం చెబితే దోషం అవు తుందా? ఆలోచించండి' అని నిర్ణయాన్ని వారికే వదిలేశారు.

శివుడిని ఇలా ప్రస్తావించేసరికి మతం తరపువారు దారికొచ్చారు. కేసు గెలిచారు.



ఇంతవరకు
నాన్నగారు
ఓ నిశ్శబ్ద
స్వరంలా
ఎవరినీ తన
ప్రవర్తనతో
బాధించకుండా
ఉన్నారు.
కానీ ట్రీట్‌మెంట్
విఫలమైతే
అది ఆయన
లోని రాక్షస
ప్రవృత్తిని
రెచ్చగొట్టి
మనిషిని
వయొలెంట్‌గా
తయారు
చేస్తుందట

కనుక ఆ 'న్యూవే'ది రొటీన్‌గా నెట్టుకొస్తున్నాను అంతే. సుధని కల వడం కూడా మానేశాను. నా మనసంతా ఇప్పుడు నాన్నకి ఏ చికిత్స చేయిస్తే మామూలు మనిషి అవుతారనే విషయం చుట్టూనే తిరుగుతోంది" చెప్పడం ఆపింది.

"అవును. భీమేష్ చెప్పారు. ఆపరేషన్ చేస్తేనో, ఏదో షాక్ ట్రీట్‌మెంట్ ఇస్తేనో మామూలు మనిషి అవ్వొచ్చని డాక్టర్ అన్నారట కదా!" అడిగింది.

కప్పులోని ఐస్‌క్రీం కెలుకుతూ, "మొన్న ఏక్సిడెంట్ జరిగినపుడు నాన్న బ్రెయిన్‌స్కాన్ తీసిన డాక్టర్ రిపోర్టులు చూసి చెప్పారు. ఇందులో ఉన్న సమస్య- ఆపరేషన్ ఫెయిల్ అయితే నాన్న నాడీ వ్యవస్థ మీద దాని దుష్ప్రభావంతో ఆయన ఎప్పటికీ కోమాలోకి వెళ్ళడం కానీ... లేదా అసలు స్పర్శాజ్ఞానమే ఎరగని పేరలైజేషన్ స్థితిలోకి కానీ వెళ్ళిపోతారట" చెప్పింది.

"అమ్మో! అది చాలా ప్రమాదం. ఇప్పటికే ఆయన మిమ్మల్ని మర్చిపోయారని నువ్వు దిగులు పడుతున్నావు. ఇంక కదలిక కూడా లేని బొమ్మలా మారితే ఊహకే భయమేస్తోంది" గీత భయంగా అంది.

అవునన్నట్లు తలూపి "అదే నా భయం కూడా. పోనీ షాక్ ట్రీట్‌మెంట్ ఇప్పిద్దామా అంటే, శారీరకంగా అది చాలా బాధని కలిగిస్తుంది. సరైన చోట షాక్ తగలకపోతే, ఇంతవరకు నాన్నగారు ఓ నిశ్శబ్ద స్వరంలా ఎవరినీ తన ప్రవర్తనతో బాధించకుండా ఉన్నారు. కానీ ట్రీట్‌మెంట్ విఫలమైతే అది ఆయనలోని రాక్షస ప్రవృత్తిని రెచ్చగొట్టి మనిషిని వయొలెంట్‌గా తయారు చేస్తుందట. నిజానిజాలు చెప్పడం వాళ్ళ ధర్మం కనుక డాక్టర్లు ఈ చికిత్స వల్ల వచ్చే లాభాలు, నష్టాలను వివరించారు. నేనే ఎటూ తేల్చుకోలేకపోతున్నాను. కేవలం నెగిటివ్ ఫలితాల గురించే ఆలోచించి ఏ వైద్యం వద్దు అనుకోలేకపోతున్నాను. అలాగని ఏదో ఒక చికిత్సకి సిద్ధపడి మనిషిగా కూడా నాన్నని దూరం చేసుకోడానికి ధైర్యం చాలడం లేదు. ఆలోచనలతో తల పగిలిపోతోంది" టేబుల్ పైన మోచేయి ఆన్చి దానిమీద తల ఆన్చుకుంటూ బాధగా అంది దాక్షిణ్య.

ఓదార్పుగా ఆమె తలమీద చెయ్యేసి "దక్షా! కొంచెం ఓర్చుకో. అంతా మనల్నే చూస్తున్నారు" మెల్లగా హెచ్చరించింది గీత.

"నేను మొహం కడుక్కొని వస్తాను" లేచి రుమాలుతో కళ్ళు ఒత్తుకుంటూ టాయిలెట్ కేసి వడివడిగా వెళ్ళింది దాక్షిణ్య.

"జీవితంలో పోరాడేకొద్దీ దీనికి సమస్యలు మరీ ఎక్కువవుతున్నాయి భగవంతుడా! మా దక్షకి అలుపు రానీయకుండా ఆదుకొనే అండను ప్రసాదించు" తల వెనక్కి వాల్చి కళ్ళు మూసుకుని భగవంతుని ప్రార్థిస్తున్న గీత టేబుల్‌పైన టకటకా కొట్టిన శబ్దానికి తేరుకొని బేరర్ అనుకుంటూ, "రెండు కోల్డ్ కాఫీ" యధాలాపంగా ఆర్డర్ ఇచ్చింది.

"నన్ను చేసి తెమ్మంటారా మేడమ్" ఎదురుగా ఉన్న భీమేష్ చిరునవ్వుతో అడగడంతో ఉలిక్కిపడి గభాలున లేచి "సారీ సార్. బేరర్ అనుకున్నాను" కంగారుగా అంది.

"మీరంతా కాలేజీ జీవితం ముగియకుండానే ఉద్యోగాలకి వచ్చేయడం వల్లేనేమో, మీకింకా స్టూడెంట్స్‌లాగ పెద్దవాళ్ళని చూడగానే లేచి నిలబడే అలవాటు పోలేదు" వెక్కిరింతగా అంటూ ఆమెను కూర్చోమని సైగచేసి ఎదురుగా కూర్చుంటూ "అది సరే, నీ ఒక్కర్తికి రెండు కాఫీలు ఆర్డర్ ఇచ్చావు. నేను వస్తానని ముందే తెలుసా?" అడిగాడు.

"అబ్బే, లేదు సార్. దక్ష కూడా వచ్చింది. మొహం కడుక్కోవడానికి టాయిలెట్‌కి వెళ్ళింది"

"ఇంకా ఏమీ తినకుండా, తాగకుండానే చేతులు కడిగేస్తోందా ఏమిటీ?" అంటూ అటుగా వచ్చిన బేరర్‌ని పిలిచి మూడు కాఫీలు ఆర్డర్ ఇచ్చి అడిగాడు.

"వాళ్ళ నాన్నగారి ఆరోగ్యం విషయంలో ఏ నిర్ణయం తేల్చుకోలేక అవస్థపడుతోంది" గీత చెబుతుండగానే కాస్త తేటపడిన ముఖంతో వచ్చిన దాక్షిణ్య భీమేష్‌కి విష్ చేసి గీత పక్కన కూర్చుంది.

"మీరు ఇక్కడికి మమ్మల్ని చూసి వచ్చారా...?" కాస్త ఆశ్చర్యంగా అడిగింది. చురుక్కుమన్నట్లు చూసి తను వేసుకొన్న సూటు, నెక్‌టై, లాప్‌టాప్ చూపిస్తూ, "ఇలా తయారయ్యి ఆడపిల్లల వెనకపడితే అసహ్యంగా ఉంటుంది కదూ!" అని నవ్వేశాడు. ఇద్దరూ అతనితో శృతి కలిపారు.

"మీరు వచ్చి పదినిమిషాలేమో కానీ, నేను రెండు గంటలుగా ఈ హోటల్‌లోనే ఉన్నాను. పైన ఆర్. కె. గ్రూపు కంపెనీ మీటింగ్ జరుగుతోంది. వాళ్ళ హోటల్ నిర్మాణాలన్నీ మన 'న్యూవేనే చూస్తోంది. దానికి సంబంధించిన రిపోర్టును అందజేయడానికి వచ్చాను. ఇప్పుడే ముగిసింది. ఎంతైనా మీటింగ్ కదా! తలుపులు మూసి వాయించేసరికి తల వాచిపోయింది. కాఫీ తాగుదామని రెస్టారెంట్‌లోకి వస్తే కుర్చీలో నిద్రపోతున్న గీత కనిపించి పలకరిద్దామని పిలిస్తే కాఫీ ఆర్డర్ ఇచ్చింది" జరిగింది చెప్పాడు. ముగ్గురూ మరోసారి నవ్వుకున్నారు. మెల్లగా దాక్షిణ్యలోని టెన్షన్ తగ్గుముఖం పట్టింది. అది గమనించి.

"దక్షా, అతిచనువు అనుకోకపోతే మీ నాన్నగారి విషయంలో నాదో సలహా" చెప్పమంటావా అన్నట్లు అడిగాడు.

"నాన్న ఈ రోజు నాకు ప్రాణంతోనైనా దక్కడానికి కారణం మీరు. తప్పకుండా చెప్పండి"

"నేను డాక్టర్‌తో అన్ని వివరాలు మాట్లాడాను. నాకైతే ఆపరేషన్ కన్నా షాక్ ట్రీట్‌మెంట్ మంచిది అనిపిస్తోంది. అదైతే ప్రాణానికి ఏ మాత్రం హాని ఉండదు. తొంభై శాతం సరైన ప్రాంతంలోనే షాక్‌ని ఇస్తారు కనుక మెంటల్ డిస్టర్బెన్స్ ఉండదనేదే నా ఉద్దేశం"

"నాకూ సార్ ఆలోచనే మంచిదనిపిస్తోంది దక్షా..." సపోర్టు చేసింది గీత. వాళ్ళిద్దరి మాటలు మౌనంగా వింటున్న దాక్షిణ్య నీరసంగా నవ్వింది.

"అక్క పెళ్ళి దగ్గరకి వస్తోంది. అది పూర్తయ్యాక ట్రీట్‌మెంట్ చెయ్యమని డాక్టర్‌కి చెబుతాను" చెప్పింది.

బేరర్ తెచ్చిన కప్పులను ఇద్దరి వైపు జరుపుతూ, "మరో విషయం నీ సొంత సమస్యల ఒత్తిడిని నేను కాదనను. కానీ దాని వల్ల నీ వృత్తి నిర్లక్ష్యానికి గురి అవుతోంది. ఇంతవరకు శ్రీకాంత్‌కి ఆఫీసు డెకరేషన్ నువ్వు స్వయంగా చెయ్యడం లేదని తెలియదు. ఒకవేళ తెలిస్తే నీతో కాంట్రాక్టునే కాన్సిల్ చెయ్యవచ్చు నీ మిత్రులుగా నేను, గీత నీ వ్యక్తిగత జీవితంలో ఎంతైనా సహాయపడతాం. కానీ శ్రీకాంత్‌ని మేం శాసించలేం కదా! కనుక జాగ్రత్తగా ఉండు" హెచ్చరికగా చెప్పాడు. మాట్లాడలేదు

దాక్షిణ్య. కాఫీ తాగుతూ మౌనంగా ఉండిపో యింది.

ఆపై వారి మధ్య పెద్దగా సంభాషణ జర గలేదు. బిల్లు చెల్లించి బయటకి వస్తోంటే ఎదురుగా వచ్చే జంటను గుద్దుకొని యధా లాపంగా సారీ చెప్పబోయిన దాక్షిణ్య కళ్ళు ఆశ్చర్యంగా విచ్చుకున్నాయి. "చిత్రా!" నమ్మ లేనట్లు పిలిచింది.

పాతికేళ్ళలోపు కుర్రాడి భుజాలకి చేతుల్ని పెనవేసి కొద్దిగా అతనిపై వాలి నుంచున్న చిత్ర అక్కని చూడగానే అతన్ని వదిలేసి బెదురుగా చూస్తూ "అక్కా..." గాభరాగా పిలిచింది.

ఒక్క క్షణం తడబడినట్లు చూసినా చిత్ర కన్నా త్వరగా తేరుకున్న ఆమె పక్క యువ కుడు, "ఓహ్! మీరేనా చిత్ర చెప్పే అక్క. మీ పేరు దాక్షిణ్య కదూ. మేము మిమ్మల్ని కల వాలని ఇప్పుడే అనుకుంటున్నాం. అనుకో కుండా మీరే కలిశారు. నా పేరు చంద్రమౌళి. నేను సత్యం కంప్యూటర్స్‌లో పని చేస్తున్నాను" తనని తాను పరిచయం చేసుకున్నాడు.

"దారికి అడ్డంగా నిలబడి పరిచ యాలు పలకరిం పులు అవస రమా? ఆకలిగా ఉంటే, లోపలికి



వెళ్ళండి తర్వాత మాట్లాడుకోవచ్చు లేదా మాతో రండి ఎక్కడైనా కూర్చుని ప్రశాంతంగా మాట్లాడుకోవచ్చు మీరు పదండి" దాక్షిణ్యకి ఒక అడుగు వెనకగా ఉన్న భీమేష్ కాస్త గంభీరంగా అన్నాడు. చిత్ర, చంద్రా ఏమీ తేల్చుకోనట్లు నిలబడిపోయారు. ముగ్గురూ భీమేష్ కారు దగ్గరికి వచ్చారు. వాళ్ళ వెనకగా వచ్చిన చంద్ర.

"మేమిద్దరం నా బైక్ మీద వస్తాం. ఎక్కడికి రమ్మంటారు" అడిగాడు.

"ఇక్కడికి దగ్గరలోనే మా గెస్ట్‌హౌస్ ఉంది. అక్కడైతే ప్రశాంతంగా మాట్లాడుకోవచ్చు" చంద్రకి అడ్రస్ చెప్పి స్టీరింగ్ ముందు కూర్చున్నాడు భీమేష్.

వెనుదిరిగి బైక్‌వైపు వెళుతున్న చంద్రం చిత్రని అడిగాడు. "అంత కమేండింగ్‌గా మాట్లాడుతున్నారు. మీ అక్కా ఆయన మాటని మన్నిస్తోంది. ఇంతకీ ఎవరాయనా? "

భీమేష్‌తో దాక్షిణ్య పరిచయం ఎంతో, ఎలాంటిదో తెలియకపోయినా మగాళ్ళతో పెద్దగా స్నేహాన్ని పెంచుకోని అక్కగారు అతని కారులో రెండు మూడుసార్లు ఇంటికి వచ్చిన విషయం గుర్తొచ్చి కాస్త తడబాటుగానే "ఆయనా... భీమేష్‌గారు. మా అక్కకి కాబోయే భర్త" అబద్ధం చెప్పేసింది. చెల్లెలు చెప్పిన అసత్యం ఎరగని దాక్షిణ్య కారుకన్నా వేగంగా సాగిపోయే ఆలోచనలతో చిత్ర తెచ్చే కొత్త సమస్య గురించి చింతిస్తూ కూర్చుంది.



భాస్కర్ మెల్లగా ఫ్లోరిస్టు షాపుకి అలవాటు పడుతున్నాడు. నిజానికి అతనికి అందులో పెద్ద భారమైన డ్యూటీ ఏం లేదు. రోజూ పువ్వులు నర్సరీ నుండి తేవడం అబ్దుల్లా చూసుకుంటాడు. ఆర్డర్ల ప్రకారం సుజాత, మరియమ్మ తయారు చేస్తారు. అతని పని అంతా కావలసిన రకాలు, కొత్త ఆర్డర్లు బుక్‌చేసి డబ్బులు వసూలు చేసుకోవడం మాత్రమే దాక్షిణ్య చెప్పింది. తను షాపుకి వచ్చినా రాకపోయినా అమ్మకాలన్ని బ్యాంకులో జమచేసి ఒకటవ తేదీన అందరితోపాటు ఫ్యాక్టరీ జీతానికి తగ్గకుండా తగిన మొత్తాన్ని జీతంగా తీసుకోమని. ఆమె చెప్పిన ప్రకారమే చేస్తూ, మంచి ఆర్డర్లు అనుకున్న వాటిని చొరవగా ఒప్పుకుంటూ, వ్యాపార లక్షణాలు అలవరచు కుంటున్నాడు. అందుకే ఈమధ్య దాక్షిణ్య షాపువైపుకే రాకపోయినా తానుగా నడపగలిగే స్థాయికి చేరుకున్నాడు. ఆరోజు అతను ఆర్డర్ చెయ్యవలసిన పువ్వుల రకాలు సరిచూసుకుంటుంటే ముప్పై ఏళ్ళ వ్యక్తి వచ్చాడు.

"నిన్న తెల్ల గులాబీలతో ఒక బాస్కెట్ బొకే ఆర్డర్ ఇచ్చాను. తయారయ్యిందా? " అడిగాడు.

ఆర్డర్ బుక్ చూసి "ద్విజేంద్రసింగ్ పేరుతో ఉంది. ఒక్క నిమిషం" అని, సుజాతని పిలిచాడు. ఆమె లోనికి వెళ్ళి తీసుకొచ్చింది.

బిల్లు చెల్లిస్తూ, "మీరు బొకేనీ మేము చెప్పినచోట డెలివరీ కూడా చేస్తారా? " అడిగాడు.

"అడ్రసు ఇస్తే మా కుర్రాడి చేత పంపిస్తాం" మిగిలిన చిల్లర ఇస్తూ చెప్పాడు.

"ఒక్క నిమిషం అదిగో ఆ ప్రక్క తెల్ల వ్యాన్ కనిపిస్తోందే, అందులో నా భార్య ఉంది. ఆమె శారీరక వికలాంగురాలు. దీనిని ఆమెకి చూపించి తీసుకొస్తాను. అడ్రస్సు ఈ కార్డులో ఉంది. అక్కడ అందజేస్తే చాలు" రిక్వెస్టింగ్‌గా కోరాడు.

ఆ వ్యక్తి బొకే డబ్బులు చెల్లించి వేయడంతో భాస్కర్‌కి అందులో అభ్యంతరం కనిపించలేదు.

"మీ ఇష్టం" తన అంగీకారం తెలియజేశాడు.

అన్నట్లుగానే పదినిమిషాల్లో వ్యాను నుండి తిరిగి వచ్చి, "నా భార్యకి మీ బొకే

చాలా బాగా నచ్చింది. ఇకపై మీకే ఆర్డర్ ఇస్తానంది. మీ షాపు నంబరు ఏమైనా ఉందా? " చిరునవ్వుతో అడిగాడు.

"ఇదిగో బొకే మీద అంటించిన ఈ స్టిక్కర్ మీద షాపు పేరు పరిమళ ఫ్లోరిస్టు, ఫోన్ నెంబరు ఉన్నాయి. ఈ విజిటింగ్ కార్డు కూడా మీ దగ్గర ఉంచండి" సంతోషంగా అందించాడు భాస్కర్.

దానిని అందుకుని జేబులో పెట్టుకొని "ఈ బొకే అందుకోవలసిన మా బావకి ఓపెన్ హార్టు సర్జరీ కోసం ఈరోజే సాయంత్రం ఆరు గంటల ఫ్లయిట్ కి ముంబాయి వెళ్లపోతున్నాడు. కనుక మీరు ఆ లోపుగానే దీనిని ఆయనకి అందేలా చూడాలి" కోరాడు ద్విజేంద్ర.

"డోంట్ వర్రీ సార్!" అని డెలివరీ బాయ్‌ని పిలిచి అడ్రస్ ఇచ్చి వెంటనే అతన్ని ద్విజేంద్ర కళ్ల ముందే బొకెతో పంపించి వేశాడు.

చాలా సంతోషిస్తున్నట్లు చూశాడు ద్విజేంద్రసింగ్. "మీ సర్వీస్ కూడా చాలా ఆకట్టుకుంటోంది. ఐ ప్రామిస్ యూ. ఇకపై నాకు ఏ పువ్వులు కావలసి వచ్చినా మీ దగ్గరే కొంటాను" అభిమానంగా అని సెలవు తీసుకొని వెళ్లిపోయాడు.

ఒక విలువైన కస్టమర్‌ని సంపాదించినందుకు సంతోషిస్తూ 'ఈయన గురించి దాక్షిణ్యకి చెప్పాలి. లేదంటే నేను లేనప్పుడు వస్తే ఏమైనా నిర్లక్ష్యంగా ఉంటే మంచి కస్టమర్ ఆఫర్ చెయ్యి జారిపోతుంది' అనుకున్నాడు.

* * *

"నా పేరు చంద్రమౌళి. నేను సత్యం కంప్యూటర్స్‌లో సాఫ్ట్‌వేర్ ఇంజనీరుగా పని చేస్తున్నాను. నా వయసు ఇరవై నాలుగు. నా డిగ్రీ ఫైనలియర్‌లో ఉండగానే నేను క్యాంపస్ ఇంటర్వ్యూలో సెలక్ట్ అయ్యాను. మా నాన్నగారు మిలట్రీలో హవల్దార్‌గా పనిచేసి రిటైరై ఇక్కడ ఒక కాస్మోటిక్ షాపు నడుపుతున్నారు. చిత్ర మా షాపుకి తరచు వచ్చేది. అలా పరిచయం అయింది. మా ఇష్టాలు, అభిప్రాయాలు కలిశాయి. తన డిగ్రీ పూర్తి అవడం కోసం ఇంకా పెద్దవాళ్లకి మా విషయం చెప్పకుండా దాచాం. కానీ ఇంట్లో నా పెళ్లికి వత్తిడి పెరుగుతోంది. ఎలాగో చిత్రకి రెండు నెలల్లో ఫైనల్ సెమిస్టర్ అయిపోతుంది. కనుక మీకు ముందు విషయం చెప్పి మీ ద్వారా మా పెద్దవాళ్లని ఒప్పించాలనుకున్నాం. అనుకోకుండా మీరే కలిశారు" దాక్షిణ్య నిర్లిప్తంగా పక్కన కూర్చున్న చెల్లెలికేసి చూసింది. ఆమె ముద్దరాలిలా తల వంచుకుని కూర్చుంది. ఎందుకో దక్షకి ఈ తతంగం విసుగుగా అనిపిస్తోంది. వాళ్లిద్దరూ నిర్ణయాలు తీసుకుని ఏదో చెప్పాలి అన్నట్లు తనకి చంద్రంతో చెప్పించినట్లు అనిపిస్తోంది.

తన బ్యాగ్ తీసుకుని కుర్చీలోంచి పైకి లేచి, "మీ ఇద్దరికీ ఇష్టమే అయినప్పుడు నాకేమిటి అభ్యంతరం? కాకపోతే మా ఇంట్లో పెద్ద మా అక్క వైదేహి. రేపు నేను, వైదేహి, గీతా వచ్చి మీ పెద్దాళ్లతో మాట్లాడతాం" చెప్పాలన్నట్లు చెప్పి గీతకేసి తిరిగి "వెళ్దామా? " అడిగింది.

"ఒక్క నిమిషం మేడమ్" కంగారుగా పిలిచాడు చంద్రమౌళి. వెనక్కి తిరిగి చెప్పమన్నట్లు చూసింది. అంతలో చేతిలో కూల్ డ్రింక్స్‌తో వచ్చిన భీమేష్ వాటిని టీపాయ్ మీద పెట్టి, "అప్పుడే మాటలు- పూర్తయిపోయాయా? " మూతలు ఓపెన్ చేస్తూ అడిగాడు.

"ఇంకా లేదు బ్రదర్, ఇప్పుడే మొదలయ్యాయి. మీరు కూడా కూర్చోండి"

"ప్లీజ్ మీరు కూడా కూర్చోండి" దాక్షిణ్యని కోరాడు చంద్రమౌళి. గీత మెల్లగా చెయ్యి నొక్కడంతో వచ్చి మళ్లీ సోఫాలో కూర్చుంది. కూల్ డ్రింక్స్ అందరికీ అందించింది గీత. అంతా ఊరికే వాటిని చేతిలో పట్టుకొని చల్లదనాన్ని పరిశీలిస్తూ చంద్రం

## అద్భుతాహారం




మనం రోజూ వినియోగించే కూరగాయలలో అద్భుతాలు సృష్టించేవి ఉన్నాయి. అందుకే అవి మిరకిల్ ఫుడ్‌గా గుర్తింపు పొందుతున్నాయి. కానీ ఆ విషయమే మనకి పూర్తిగా తెలియదు. అవేమిటంటారా... "టమోటాలండీ"... ఆఁ... అలా హాశ్చర్య పోకండి... టమోటాలు నిజంగా మిరకిల్ ఫుడ్డే అని నొక్కి వక్కాణిస్తున్నారు. న్యూఢిల్లీలోని ప్రివెంటివ్ మెడిసిన్ అండ్ న్యూట్రిషన్‌లో పని చేస్తున్న డాక్టరు మఖీజా టమోటాలకుండే ఎర్రరంగు (లైకోపీన్)లో మన శరీరానికి కావల్సిన విటమిన్లు లభ్యమవ్వటమే గాకుండా, అది కాన్సర్ వ్యాధికి ముఖ్యంగా ప్రోస్టేట్ క్యాన్సర్‌లను నివారించే ఔషధంలా కూడా ఉపకరిస్తుందంటున్నారు. యాంటీ ఆక్సిడెంటయిన లైకోపీన్ అపాయకరమైన ఫ్రీరాడికల్స్‌ని మన శరీరం నుండి తొలగిస్తుంది. ఈ లైకోపీన్ కేవలం టమోటాల్లోనే గాక అన్ని రకాల పండ్లు, కూరగాయలకుండే ప్రకృతి సహజమైన రంగులో లభ్యమవుతుంది. లైకోపీన్ అడపా దడపా వచ్చిపోయే వేర్ అండ్ టియర్ వ్యాధుల్ని సైతం ప్రతిఘటిస్తుంది.

ఇంకేం, చవగ్గా టమోటాలు కళ్ళముందుండగ, జేబులు ఖాళీ అయ్యే దవాఖానాలెందుకు దండగ!

మాటల కోసం ఎదురు చూస్తున్నారు.

చంద్రం, భీమేష్ పక్కపక్కనే దాక్షిణ్యకి ఎదురుగా కూర్చున్నారు. దక్ష వెనక గీత, భీమేష్ పక్కగా చిత్ర నిలబడి చంద్రం చెప్పేది వినసాగారు.

"మా నాన్నగారు చాలా కాలం క్రితం మిలట్రీలో దేశ సరిహద్దుల దగ్గర ఉండడం వల్ల నేను, మా అక్కా, అమ్మా మా అమ్మమ్మ తాతగారింట్లో పెరిగాం. కనుక మా ఇంట్లో పెద్దవాళ్ల ఒత్తిడి ఎక్కువ. నాన్నగారు కూడా వాళ్ళు ఒప్పుకున్న దానినే సమర్థిస్తారు" అంటూ ఆపాడు.

"పెద్దవాళ్ళ చాదస్తాలు నాకు తెలుసు. కట్నాలు, లాంఛనాలు అడుగుతారు అంతేగా. మీకేం భయం అక్కరలేదు. మా చిత్ర పేర ఐదు లక్షల దాకా డబ్బు ఉంది. మీ వాళ్ళు కోరిన మొత్తం నేను ఏర్పాటు చెయ్యగలను" దాక్షిణ్య బదులిచ్చింది.

"నో, నో. సమస్య కట్నం కాదు. చిత్ర మీ కుటుంబం గురించి అన్ని వివరాలు చెప్పింది. మీ పెద్దక్క వైదేహి విడో అని అంది. మీరు ఆవిడతో మా ఇంటికి మాట్లాడానికి వస్తే, మా అమ్మమ్మ ఒప్పుకోదేమోనని" సందేహిస్తున్నట్లు మింగేశాడు.

దాక్షిణ్య కళ్ళు కోపంతో ఎర్రబడ్డాయి. "మా అక్కకి మరో పదిరోజుల్లో పెళ్ళికాబోతోంది. చిత్ర ఆ సంగతి మీకు చెప్పలేదా?" సీరియస్‌గా అడిగింది.

"చెప్పింది కానీ ఏమో పెద్దవాళ్ళు కదా! వాళ్లకి సెంటిమెంట్ అడ్డొస్తే మొత్తానికి పెళ్ళే చెడిపోతుంది" నసిగాడు.

"అయితే ఏం చెయ్యను? మా బామ్మని పంపనా? ఒకళ్ళ మూర్ఖత్వానికి, ఇంకోళ్ళ చాదస్తం సరిగ్గా సరిపోతుంది" హేళనగా అడిగింది.

చంద్రం మోహం ఎర్రబడింది. "మీరంత

వ్యంగ్యంగా మాట్లాడనక్కరలేదు. మీరూ, భీమేష్ కాబోయే భార్యాభర్తలని చిత్ర చెప్పింది. మీరిద్దరూ వచ్చి మాట్లాడితే చాలు" చిన్నపిల్లాడిలా అలిగినట్లు అన్నాడు.

చేతిలో సీసాని బిగించి పట్టుకుంటూ, చిత్రకేసి మింగేసేలా చూస్తూ "ఏమిటి? " అర్థం కాన్నట్లు అడిగింది.

చిత్ర ఎందుకైనా మంచిదని భీమేష్ వెనక ఒదిగి నుంచుంది. దక్ష కోపం చిత్ర మీదకి మరలకుండా భీమేష్ వెంటనే కలగ జేసుకొని పైకి లేస్తూ, "ఒకే చంద్రమౌళీ! రేపు నేను, దక్ష మీ పెద్దవాళ్ళని కలుస్తాం. ఇప్పటికే లేటయ్యింది. చిత్రని మేం దింపుతాం సరేనా? " చేతిని ముందుకు చాపుతూ వెళ్ళమనే అర్థం వచ్చేలా అన్నాడు. చంద్రం వీడ్కోలు తీసుకొని వెళ్ళి పోయాడు. భీమేష్ అతని ఇంటి అడ్రస్ కనుక్కొంటూ బైక్ దాకా సాగనంపడానికి వెళ్ళాడు.

అచేతనంగా కూర్చుండిపోయిన దక్షకి సమీపంగా వెళ్ళి, "అక్కా! మొన్నో రోజు భీమేష్ సార్ చంద్రంతో నన్ను చూసి పల కరించి, ఈరోజు నిన్ను కలిసేలా ప్రోగ్రాం ఏర్పాటు చేశారు. నిన్ను హోటల్‌లో చూసి మాకు ఫోన్ చేస్తేనే నేను, చంద్రం వచ్చాం. మరి, అన్ని చేసిన భీమేష్‌గారు మనకి ఏమీ కారని చెబితే ఏం బాగుంటుంది. అందుకే ఏం చెప్పాలో తోచక..." నసుగుతున్నట్లు చల్లగా అసలు విషయం చెప్పింది.

దక్ష నమ్మలేనట్లు చిత్రనే గుడ్లు అప్ప గించి చూస్తూండిపోయింది. గాఢంగా నిట్టూర్చి, "చిత్రా, నువ్వేం చేశావో నీకు బాగా తెలుసు. కొట్టడానికి చిన్నపిల్లవి కావు. తిట్టడానికి ఏదీ తెలియనితనంతో చెయ్యలేదు. నాకు అర్థమైనది ఒక్కటే. నువ్వు చాలా ఎదిగిపోయావు" చివరి మాట నొక్కి పలుకుతూ అంది.

లోపలికి వచ్చిన భీమేష్ "రేపు ఉదయం తొమ్మిదిన్నరకి మనల్ని రమ్మన్నాడు చంద్ర మౌళి. నువ్వు రెడీగా ఉంటే నేనొచ్చి పికప్ చేసుకుంటాను" దక్షతో చెప్పాడు.

ఎవ్వరూ మాట్లాడలేదు. "ఇప్పటికే ఆల స్యమయ్యింది. మేము వెళతాం సార్" గీత చెప్పింది.

"నో థాంక్స్, చిత్రా పద" గంభీరంగా అని, "సారీ సార్ రేపు ఉదయం మీరు రాన క్కరలేదు. మంచో చెడో ఈ విషయాన్ని నేను డీల్ చేసుకుంటాను" అంతే ఖచ్చి తంగా చెప్పి ముందుకు నడిచింది దాక్షిణ్య. సాలోచనగా నిలబడిపోయిన భీమేష్ వంక బేలగా చూస్తూ అక్కని మౌనంగా అనుస రించింది చిత్ర.

* * *

సాధారణంగా దిగువ మధ్యతరగతి స్థాయి కుటుంబాలలోని పదిహేను, ఇరవై ఏళ్ల వయసు మధ్య యువకులు కుటుంబ బాధ్యతల పట్ల ఏమాత్రం ఆసక్తి లేకుండా ఉంటారు. అందుకు నిదర్శనం ద్విజేంద్ర సింగ్ బొకేని డెలివరీ చెయ్యడానికి బయలు దేరిన డెలివరీ బాయ్ శ్రీను. శ్రీను పరి మళా ఫ్లోరిస్టులో పనిచేస్తున్న సుజాత సొంత తమ్ముడు. కుటుంబం గౌరవంగా గడవడానికి ఇంట్లో ప్రతి ఒక్కరు కష్టపడి అంతో ఇంతో తెస్తేనే కానీ జరగనిస్థితి ఆమె కుటుంబానిది. ఇంటి పరిస్థితి అర్థం చేసు కొని శ్రీను నిర్లక్ష్యం కారణంగా చదువు పదవ తరగతితోనే ఆగిపోయిన తమ్ముడిని చిన్నా చితకా పనుల్లో పెట్టినా ఎక్కడా నిల కడగా ఉండకపోవడంతో ఎదురుగా తను ఉంటే తప్పనిసరిగా పని నేర్చుకుంటాడని దాక్షిణ్యను బతిమాలి షాపులో డెలివరీ బాయ్‌గా చేర్పించింది సుజాత.

దగ్గర ప్రాంతాలకు సైకిల్ మీద పంపినా, దూర ప్రాంతాలకు ఆటో ఫెయిర్ ఇవ్వడం తోపాటు రోజుకి యాభైరూపాయలు జేబుఖ ర్చుకు ఇస్తుండడంతో ఇంటి అవసరాల మాట ఎలా ఉన్నా తన అవసరాలకు, సర దాలకు సుజాతపైన ఆధారపడి తిట్లు తినే

అవస్థ తప్పినందున బుద్ధిగానే చేస్తున్నాడు. కాకపోతే కుర్ర మనసు ఎక్కడైనా ఎవరైనా స్నేహితులు ఎదురైతే నిర్వహించవలసిన కర్తవ్యం మరుపుకి వస్తుంది. ఇప్పుడూ అంతే. ఎయిర్‌పోర్టుకని బొకేతో బయలుదేరిన శ్రీను లిఫ్టు ఇచ్చే బైక్‌వాలా కోసం ఎదురు చూస్తుంటే ఒకప్పుడు అతనితో చదివిన హైస్కూల్ ఫ్రెండ్ మహేష్ బైక్‌మీద ఇంటర్‌నెట్‌కి వెళ్తూ శ్రీనుని గుర్తుపట్టి పలకరించాడు.

“ఏరా శ్రీనూ! బొకేతో బయలుదేరావు? ఎక్కడికేంటీ? ” మహేష్ ఖరీదైన దుస్తులు, బైక్ గమనించి, 'డెలివరీ బాయ్‌గా పనిచేస్తున్నాను' అని చెప్పడానికి నామోషీ కలిగి, “బేగంపేటలో మా అంకుల్ ఒకాయన బర్త్‌డే. అమ్మ బొకే ఇచ్చి విష్‌చేసి రమ్మంటే వెళ్తున్నాను” నేర్పుగా చెప్పాడు.

దాక్షిణ్య షాపు యూనిఫాం నిర్వహించదు కనుక జనరల్ జీన్స్, టీషర్టులో ఉన్న శ్రీను మాటల్ని నమ్మిన మహేష్ “అంకుల్‌ని విష్ చెయ్యడానికేగా వెళ్లేది. నాతో రా! కాసేపు ఇంటర్‌నెట్‌లో గేమ్స్ ఆడుకుని వెళ్లొచ్చు” తేలిగ్గా అంటూ వెనక ఎక్కమని సైగ చేశాడు. ఆడే, పాడే వయసులో ఉన్న శ్రీను మహేష్ మాటల్ని కాదనలేదు. సంతోషంగా వెనక ఎక్కి కూర్చున్నాడు. మహేష్ విదేశీ గర్ల్ ఫ్రెండ్స్‌తో ఛాటింగ్ చేసి, స్పీడ్ గేమ్స్ ఆడడంలో మునిగిపోయిన శ్రీనుకి ముంబాయి ఫ్లయిట్ బొకే డెలివరీ గుర్తొచ్చి హడావిడిగా ఎయిర్‌పోర్టుకి వెళ్లేసరికి రెండు నిమిషాల ముందే ఫ్లయిట్ టేకాఫ్ తీసుకుందని తెలిసి రెండు క్షణాలు అయోమయంగా నిలబడిపోయి ఆలోచనలో పడ్డాడు.

ఫ్లయిట్ మిస్సయ్యింది, డెలివరీ చెయ్యడం కుదరలేదు అని చెప్పి వెనక్కి వెళ్లిపోయి షాపులో వాపసు ఇచ్చేద్దామంటే, భాస్కర్‌కన్నా ముందు సుజాత రెండు గంటల సమయం ఎయిర్‌పోర్టుకి వెళ్లడానికి చాలలేదా అని ఆరాలు లాగి అందరి ముందు చడామడా తిట్టేస్తుంది. ఆలోచిస్తూనే కారు పార్కింగ్ దాకా వచ్చేసిన శ్రీను ఒక్కసారి అటూ ఇటూ చూసి తననెవరూ ప్రత్యేకించి గమనించడంలేదు అనుకోగానే విండో తెరిచి కనిపిస్తున్న ఒక మారుతీ జెన్‌లో ఆ బొకేనీ పారేసి జేబులోంచి రసీదు కాగితాన్ని తీసి ద్విజేంద్రసింగ్ చెప్పిన వ్యక్తి పేరు ఎదురుగా అర్థం కానట్లు తనే ఓ సంతకాన్ని కెలికేసి దానిని జేబులో పెట్టేసుకుని జాలీగా విజిల్‌వేస్తూ షాపు ముఖం పట్టాడు.




**రా**త్రి జరిగిన సమావేశంతో తనకి ఏమాత్రం సంబంధం లేనట్లు మొహం పెట్టి సుధని కలిసేందుకు వెళ్ళడానికి కాజువల్ చుడీదార్‌తో తయారయ్యింది దాక్షిణ్య.

“అక్కా! భీమేష్‌గారు వచ్చారు. చంద్ర ఇంటికి వెళ్దామన్నారుగా!” నసుగుతున్నట్లు వచ్చి చెప్పింది చిత్ర.

తను పట్టుకు వెళ్ళాల్సిన పేపర్స్, డిజైన్లు సర్దుకుంటున్న దాక్షిణ్య ఒక్కసారి చేస్తున్న పని ఆపి వెనక్కి తిరిగి చిత్రని సూటిగా చూస్తూ “నువ్వు, చంద్రం ఇష్టపడితేనే నాకేం అభ్యంతరం లేదని నిన్ననే చెప్పాను. కానీ నేను భీమేష్‌తో వెళ్ళి చంద్ర పెద్దవాళ్ళని కలవడం మాత్రం అసాధ్యం. తన పెద్దవాళ్ళని ఎలా ఒప్పించుకుంటాడన్నది అతని సమస్య, నీ సమస్య. అరేంజ్‌డ్ మేరేజా, రిజిష్టర్డు మేరేజా అనేది నువ్వు చంద్రతో మాట్లాడి తేల్చుకో. పెళ్ళి నువ్వెలా

## స్వామీజీ సలహా

రాఘవ తాను శివాజీ పాత్ర పోషిస్తున్న ఓ నాటకానికి రామకృష్ణ మఠానికి చెందిన ఓ స్వామీజీని స్వయంగా ఆహ్వానించారు. ఆయన వచ్చి నాటకం చూసి వెళ్లారు. మర్నాడు రాఘవ ఆయనను కలిసి తన నటనపై ఆయన అభిప్రాయం కోరారు.

దానికాయన ప్రశాంతంగా-'శివాజీ ఒక యోధుడు.. కార్యశూరుడు. కర్మవీరుడు.. మీరు ఆ లక్షణాలన్నీ ఆ పాత్రలో చూపాలి. కానీ రంగస్థలంపై మీ ఇష్టం వచ్చినట్లు పచార్లు చేశారు.. చేతులు తిప్పారు. నిజమైన యోధుడు ఎప్పుడూ తన ఎడమచేతిని కదిలించడు. మీ చేతుల కదలికలు శుద్ధవైదికుల్లా ఉన్నాయే తప్ప, మరాఠా యోధుడికిమల్లే లేవు..' అని నిర్మొహమాటంగా చెప్పారు.

అప్పటికే మహానటుడిగా పేరొందినా.. రాఘవ ఆయన సునిశితపరిశీలనకు ఆశ్చర్యపోయి నమస్కారం చేసి లేచివచ్చారు.




కోరితే అలా చెయ్యడానికి నేను సిద్ధం. కనుక భీమేష్‌ని వెళ్ళమని చెప్పు" ఖచ్చితమైన స్వరంతో గంభీరంగా చెప్పింది.

అక్క గొంతులోని స్థిరత్వాన్ని గమనించి నీళ్ళు నిండిన కళ్ళతో విసురుగా ఆ గదిలోంచి బయటకి వెళ్ళిపోయింది చిత్ర. భీమేష్‌కి ఎదురుపడడం ఇష్టం లేని దాక్షిణ్య మళ్ళీ సర్దిన కాగితాలనే సర్దుతూ అతని కారు స్టార్టయ్యే శబ్దం కోసం ఎదురు చూడసాగింది.

"దాక్షిణ్యా, లోపలికి రావచ్చా" గుమ్మం దగ్గర నిలబడి కర్టెన్ కొద్దిగా తప్పించి లోనికి తొంగి చూస్తూ అడుగుతున్న భీమేష్‌ని చూసి ఉలిక్కిపడి,

"మీరు వెళ్ళలేదా? " తడబాటుగా అడిగింది.

"చంద్ర మన ఇద్దరినీ రమ్మన్నాడు. నేను ఒక్కడినే ఎలా వెళ్ళను? " అడుగుతూనే తన వెనకే వచ్చిన చిత్రని ఉద్దేశించి, "చిత్రా! మీ అక్కకి పెద్ద తరహాగా కనిపించే లాంటి మంచి పట్టుచీర తీసి ఇయ్యి" ఆర్డర్ వేశాడు.

"నాకు ఇష్టం లేదు అంటుంటే మీ దౌర్జన్యం ఏమిటి? " కోపంగా అడిగింది.

"మనం చేసే అన్ని పనులూ మనకి ఇష్టమయ్యే చెయ్యం. ఒక అరగంట నువ్వు ఓర్చుకొనే అయిష్టం చిత్రా, చంద్రంలకి నూరేళ్ళ ఆనందాన్ని ఇస్తుంది అనుకుంటే మరీ నా ప్రజెన్స్ నీకు అంత కష్టం కాదు. ఆలోచించు" చెప్తూనే చిత్ర తెచ్చిన పసుపు రంగుకి కుంకుమ రంగు బోర్డరు ఉన్న పట్టుచీరను ఆమె చేతుల్లో పెట్టి చిత్రకి సైగ చేసి బయటకి నడిచాడు. ఏం చెయ్యాలో తోచనట్లు ఉండిపోయింది దాక్షిణ్య.

"ఈ కుటుంబంతో ఏ సంబంధం లేకపోయినా అతనే చిత్ర భవిష్యత్తు గురించి ఆలోచిస్తుంటే, నువ్వు మొండికేయడం సబబు కాదేమో దక్షా!" లోపలికి వచ్చిన వేద చెల్లెలికి నచ్చచెబుతున్నట్లు అంది.

ఆ వత్తిడికి తలవంచి పట్టుచీర, అల్లిన జడ, తలలో పువ్వులు, మెడలో రెండు మూడు గొలుసులు, నుదుట ఓ మాదిరి బొట్టుతో పెద్ద తరహాలోనే సిద్ధమై వచ్చింది దాక్షిణ్య. ఆమెను చాలా సార్లు చీరలో చూసినా నిండైన అలంకరణలో

చూసి దృష్టి మరల్చలేనట్లు ఉండిపోయాడు భీమేష్.

ఆ చూపుల్ని లక్ష్య పెట్టకుండా "వెళ్దామా...?" నిర్లిప్తంగా అడిగింది.

"ఆ! నేను రెడీ" తేరుకున్నట్లు అంటూ కాఫీ కప్పు టీపాయ్ మీద పెట్టి బయటికి దారితీశాడు.

వాళ్ళ కారు బయలుదేరుతుంటే చిత్ర ఓ గులాబీ కోసుకొచ్చి అక్కకి ఇస్తూ "ఆల్ ది బెస్ట్" అని విష్ చేసింది.

దానిని అందుకొని కారులో ఉన్న సాయి బాబా ఫొటో ముందు ఉంచింది దాక్షిణ్య.

"చిత్ర ఆ పువ్వు నీ చీరకి మేచ్ అవుతుం దని తలలో పెట్టుకోమని ఇచ్చింది. దేము డికి పెట్టమని కాదు" భీమేష్ అన్నాడు.

"ఇప్పటికే తలలో తట్టెడు పువ్వులు న్నాయి. ఇదేం తక్కువవ్వలేదు. అయినా నాకు తెలిసి ప్రతి పువ్వు ఆడదాని జడలో కన్నా దేముడి పాదాలకు చేరాలనే ఎక్కువ కోరుతుంది" బదులిచ్చింది.

భీమేష్ చిన్నగా నవ్వాడు. "పువ్వులతో సావాసం వల్ల నీకు వాటి మౌన భాష కూడా వచ్చేసినట్లుంది" టీజింగ్‌గా అడి గాడు.

వెంటనే బదులివ్వలేదు. రోడ్డు మీదనే దృష్టి నిలిపి ఉండిపోయింది. "ఇంకా ఎంత దూరం వెళ్ళాలి" విసుగ్గా అడిగింది.

"దగ్గరికి వచ్చేశాం" బదులిచ్చాడు.

"నేను మీకు కొన్ని విషయాలు చెప్పాలి. లేకపోతే పరాయివాళ్ళ ముందు ఇబ్బంది పడాలి" తడబడుతున్నట్లు చెప్పింది.

"నిజమే, చెప్పు" అంగీకరించాడు.

"చంద్ర పెద్దవాళ్ళతో మనిద్దరిలో ఎవరు మాట్లాడినా, రెండోవాళ్ళు కలగజేసుకోకూ డదు. లేకపోతే నేనొకటి, మీరొకటి అన్నట్లు మాట్లాడితే అంతా రసాభాస అవుతుంది"

"నువ్వే మాట్లాడు. చిత్ర నీ చెల్లెలు కనుక అదే మంచిది" భీమేష్ సూచించాడు.

కాస్త రిలాక్సింగ్‌గా గాలి పీల్చుకుంది. "చిత్ర పేరనున్న సేవింగ్స్ గురించి, వైదేహి అక్క మళ్ళీ పెళ్ళి గురించి, నాన్న మానసిక దుస్థితి గురించి ఇప్పుడే చెప్పేస్తాను. వాళ్ళకి మా సంబంధం అయిష్టం అయితే రేపు నా వాళ్ళని కారణాలుగా చూపిస్తే నేను భరించలేను" సాలోచనగా చెప్పింది.

"నీ ఇష్టం. నేను కేవలం సహాయకుడిగా మాత్రమే వస్తున్నాను. ఏదైనా కానీ మన కారణం వల్ల చంద్రం దూరమయ్యాడనే ఫీలింగ్ చిత్రకి కలగకుండా ఉంటే చాలు" చంద్రం చెప్పిన ఇంటి నెంబర్‌ని కళ్ళతోనే వెతుకుతూ చెప్పాడు.

ఎక్కువ శ్రమ పడనక్కర లేకుండానే గేటు బయట వీళ్ళ రాకకై ఎదురుచూస్తున్న చంద్రం ఉత్సాహంగా చెయ్యి ఊపి వీళ్ళకి స్వాగతం పలికాడు. కాస్త పక్కగా పార్కు చేసిన కారు నుండి భీమేష్‌తో కలసి పట్టు చీరలో సాంప్రదాయంగా దిగుతున్న దాక్షి ణ్యను సంతృప్తిగా చూస్తూ "తాతయ్యా, అమ్మమ్మ మీ కోసమే ఎదురు చూస్తూ న్నారు" ఇద్దరినీ లోనికి తీసుకెళుతూ అన్నాడు.

ఎగువస్థాయి మధ్యతరగతి ఇంటిని సూచిస్తున్న ఆ పరిసరాలను గమనిస్తూ లోనికి అడుగుపెట్టారు. హాలులో సోఫాలో డెబ్బై ఏళ్ళ వయసు దాటిన వ్యక్తి కూర్చుని టి.వి.లో వార్తలు చూస్తూన్నాడు. జుట్టంతా తెల్లబడి, ముఖం ముడతలు పడినా శరీ రంలో ఏదో ధృడత్వం లాంటిది ఓ తరం మనుషుల శారీరక దారుఢ్యానికి నిదర్శ నంలా కనిపిస్తోంది.

"తాతయ్యా, భీమేష్‌గారు, దాక్షిణ్య గారూ వచ్చారు" చంద్ర గట్టిగా చెప్పాడు. కానీ ముసలాయన పలకలేదు. టి.వి. మీంచి దృష్టి మరల్చలేదు. చంద్రం ఇబ్బందిగా చూశాడు.

"ఒరేయ్ మీ తాతయ్యకి ఎదురుగా వార్తలు పెట్టి పక్కనే బాంబు పేల్చినా విన పడదని నీకు తెలియదా?" లోపలి నుండి

# ఎవరెస్ట్ సోయగం

'హిమగిరి సొగసులు మురిపించును మనసులు' అనడానికి ఈ దృశ్యమే నిదర్శనం. చిత్రంలో అరుణ వర్ణంలో కనిపిస్తున్నది ఎవరెస్ట్ పర్వతం. సంధ్యా సమయంలో సూర్యకిరణాల నునుస్పర్శతో నిలువెల్ల పులకించి అరుణిమ దాల్చిన ఈ సమున్నత శిఖర సోయగం అబ్బురమన్పిస్తోంది కదూ!



వస్తున్న ఓ అరవై ఏళ్ళు పైబడిన స్త్రీ చేతిలో పువ్వుల పళ్ళెంలోని ఒక్కో పువ్వునూ హాలు లోని దేముని పటాలతో పాటు గాంధీ, నెహ్రూ, అల్లూరి, తిలక్ వంటి దేశభక్తు లకు కూడా పెట్టి నమస్కరిస్తూ అంది.

వాళ్ళని కూర్చోమని సోఫా చూపించి ఆవిడ దగ్గరకి వచ్చి "కనీసం నువ్వయినా పలకరించు అమ్మమ్మా బాగోదు" దగ్గరగా వచ్చి లోగొంతులో ముసలామెను కోరాడు చంద్రం.

"ముందా టి.వి కట్టేసి వాళ్ళకి మంచి నీళ్ళో, కాఫీ, టీలో ఇవ్వు. ఇదిగో ఈ పువ్వుల అలంకరణ అవ్వగానే నేను వచ్చే స్తాను" చెప్పింది.

చంద్రం టి.వి ఆఫ్ చెయ్యాలని వచ్చాడు. అందరి దృష్టీ అప్రయత్నంగా వార్తల్లోని అంశం పైన పడింది.

నిన్న సాయంత్రం బేగంపేట విమానాశ్ర యంలో హోమ్ మినిస్టరు సొంతకారులో పేలిన బాంబు కారణంగా ప్రాణనష్టం ఏమీ జరగకపోయినా, బాంబు విస్ఫోటనం దాడికి చుట్టుపక్కల కార్లు పాదచారులు, కొందరు వ్యక్తులు తీవ్రంగా గాయపడ్డారని తెలు స్తోంది. ఈ మధ్య నగరంలో తరచు జరు గుతున్న తీవ్రవాద దాడులు, మానవ బాంబుల హత్యాయత్నాలతో భీతిల్లిన నగర ప్రజానీకం జరిగిన సంఘటనకు ఆందోళన వ్యక్తం చేస్తున్నారు. ప్రభుత్వం ఇది హోమ్ మంత్రిని చంపేందుకు దుష్టశక్తులు పన్నిన కుట్ర అని పేర్కొంటుండగా ఇంటలీజెన్సీ వర్గాలు దీనిని గ్రహించడంలో, అదుపు చెయ్యడంలో విఫలమయ్యాయని ప్రతిపక్షాల వారు తీవ్రంగా విమర్శించారు. దీనిపై ఇంటలీజెన్స్ ఛీఫ్ యోగేంద్ర మా ప్రతిని ధితో మాట్లాడుతూ (ఏభై ఏళ్ళలోపుగా ఉన్న వ్యక్తిని మీడియా చుట్టుముట్టి ప్రశ్నల వర్షం కురిపిస్తోంది.)

"జరిగిన దుర్ఘటనకు సంబంధించి అన్ని వివరాలు సేకరిస్తున్నాం. ప్రాథమిక విచా రణ అనంతరం సాధ్యమైనంత తొందరలో దాడికి పాల్పడిన వ్యక్తులు, కారణాలను వెలి కితీస్తాం" గంభీరంగా చెప్పి చుట్టూ చేరిన విలేకరులను తప్పించుకొని వెళ్ళిపోయాడు.

చూస్తున్న అందరిలో ఏదో స్తబ్దత అలు ముకుంది. మరోసారి శిథిలమైన కారుని, గాయపడిన వ్యక్తులను చూపించి వార్తల మధ్య ప్రకటనలకు విరామాన్ని ప్రకటిం చాడు న్యూస్‌రీడర్.

చంద్రంకన్నా ముందే టి.వి. ఆఫ్ చేసిన ముసలాయన "మేము జైళ్ళకి వెళ్ళి, లాఠీదె బ్బలు, పిస్తోలు గుళ్ళు భరించి వీళ్ళకి విలు వైన స్వతంత్ర భారతాన్ని అందిస్తే వీళ్ళు దీనిని బాంబుల రక్తసిక్త భారతావనిగా మార్చేస్తున్నారు. అసలు అహింస అనే పదానికి అర్థమే మర్చిపోయారు" ఎవరో తెలియకపోయినా భీమేష్, దక్షల వంక చూసి ఆవేదనగా అన్నాడు.

మౌనంగా తలూపారు ఇద్దరూ. చంద్రం చొరవగా ఇద్దరినీ పరిచయం చేసేందుకు ఉద్యుక్తుడయ్యాడు.

* * *

భాస్కర్ షాపుకి చేరుకుని ఆరోజు వచ్చిన స్టాకుని డెలివరీ చెయ్యవలసిన ఆర్డర్స్‌ని చెక్ చేస్తూంటే సుజాత అడిగింది.

"మేడమ్ ఈరోజు కూడా రారా సార్"

భాస్కర్ తల ఎత్తకుండా చెప్పాడు. "తెలి యదు. ఏదో పనిమీద ఉదయాన్నే వెళ్ళారు" అని.

"న్యూవే డెకరేషన్ రెగ్యులర్‌గా అవు తోందా? " అడిగాడు.

"ఇప్పట్లో మీటింగ్స్ ఏవీలేవని గీత చెప్పారు. రోజువారీ ఆఫీసు డెకరేషన్ గీత ఉంది కనుక నేను వెళ్ళి పువ్వులు మార్చివ స్తున్నాను" సుజాత చెప్పింది.

ఫోన్ మోగడంతో చేస్తున్న పని ఆపి రిసీ వర్ ఎత్తాడు. "హలో, పరిమళా ఫ్లోరిస్ట్సు. ఎవరు కావాలి? " ప్రశ్నించాడు.

"మిస్టర్, నేను ద్విజేంద్రసింగ్‌ని మాట్లాడు

తున్నాను. మీరు మమ్మల్ని మోసగించారు. మేము చెప్పిన టైమ్‌కి, వ్యక్తికి మీరు మా బొకే పంపలేదు. ఆ విషయం మేము పర్స్‌నల్‌గా ఫోన్‌చేసి మా బావ ద్వారా విషయం తెలుసుకొన్నాం" అతని గొంతులో ఆగ్రహం పలికింది. భాస్కర్ అయోమయానికి గురయ్యాడు.

"ఒక్క నిమిషం సార్," అని శ్రీను

తెచ్చిన డెలివరీ రిసీట్స్ బుక్ తీసి ద్విజేంద్రసింగ్ ఇచ్చిన వివరాల ప్రకారం చూశాడు. అందులోని రిసీవర్స్ సైన్ గమనించి "లేదు సార్, ఎక్కడో పొరపాటు జరిగింది. మా బాయ్ మీరు చెప్పిన వ్యక్తికి బొకేని అందజేశాడు. ఆయన మాకు సంతకం కూడా చేసి ఇచ్చారు. మీకు ఎవరో తప్పుడు సమాచారం ఇచ్చాడు" ద్విజేంద్ర పెద్ద కస్టమర్ కావడంతో మర్యాదగా బదులిచ్చాడు భాస్కర్.

"షటప్, ఆ రాస్కెల్ ఎవరిని ఎవరనుకొని ఇచ్చేశాడో... అసలు వ్యక్తికి మాత్రం మా బొకే అందలేదు. పేరు, ఫ్లయిట్ వివరాలు వ్యక్తి సీటు, నెంబరుతో సహా స్పష్టంగా ఇచ్చినా సరిగా అందించలేని చెత్త సంస్థను మీదే చూశాను" అంటూ నానా తిట్లు తిట్టి ద్విజేంద్ర ఫోన్ కట్ చేశాడు.

ఏం మాట్లాడాలో తోచనట్లు ఉండిపోయిన భాస్కర్ మెల్లగా ఫోన్ క్రెడిల్ చేసి "సుజాతా, శ్రీను వెళ్ళిపోయాడా? " అడిగాడు. సుజాత బయటకి తొంగిచూసి వెళ్ళబోతున్న తమ్ముడిని కేకేసి పిలిచింది. సైకిల్ స్టాండ్ వేసి లోనికి వచ్చాడు శ్రీను.

"నిన్న సాయంత్రం ముంబాయి ఫ్లయిట్‌లో వెళ్ళే వ్యక్తికి నవ్వు బొకే ఇవ్వలేదా...? " సూటిగా చూస్తూ అడిగాడు.

ఉలిక్కిపడ్డ శ్రీను, తల సర్దుకుంటున్నట్లు తన ఉలికి పాటును దాచుకుంటూ, "అదేమిటి సార్, మీ ముందే బయలుదేరిపోయానుగా, సంతకం కూడా పెట్టించాను. మీకెందుకొచ్చింది అనుమానం? " ఆశ్చర్యం నటించాడు.

ఏమీ లేదన్నట్లు తల అడ్డంగా ఊపి, అతన్ని వెళ్ళమన్నట్లు సైగచేశాడు. "బతుకు జీవుడా" అనుకుంటూ జారుకున్నాడు శ్రీను.

"సార్. పువ్వులేం తినే పదార్థాలో, డబ్బో కాదుగా తినేసో; ఖర్చుపెట్టో అబద్ధం చెప్పడానికి. ఇచ్చే ఉంటాడు సార్. వాళ్ళే ఎక్కడో పొరపాటుపడి ఉంటారు" జరిగిన సంభాషణ బట్టి విషయం అర్థమయిన సుజాత సహజమైన సోదర ప్రేమతో తమ్ముడిని సమర్థిస్తూ అంది.

భాస్కర్ అంగీకారంగా తల ఊపాడు. కానీ ఎందుకో అతనికి ఏదో అసంతృప్తిగా అనిపించసాగింది. జరగకూడనిది ఏదో జరుగుతోంది అనిపిస్తోంది.




"తాతయ్యా. వీరు భీమేష్, దాక్షిణ్యా. చిత్ర చిన్న అక్క బావగార్లు" ముసలాయనకి చెప్పి "మా తాతగారు రామచంద్రరావు గారు. స్వాతంత్ర సమరయోధులు." కాఫీ ట్రేతో వచ్చిన ముసలమ్మను చూపిస్తూ "మా అమ్మమ్మ పేరు శాంతమ్మగారు" ఒకరికొకరిని పరిచయం చేశాడు.

"మా అమ్మాయి, అల్లుడు కావేరి పుష్కరాలకి వెళ్ళారు. దానిదో చాదస్తం. అల్లుడు మిలట్రీలో ఉన్నన్నాళ్ళు ఇల్లు కదిలేది కాదు. ఇప్పుడతను రిటైరై వచ్చినప్పటి నుండి ఆ ఉత్సవాలకి వెళదాం, ఈ తీర్థాల్లో మునుగుదాం అంటూ దేశమంతా తిప్పుతోంది" కాఫీలందిస్తూ అంది శాంతమ్మ.

మరి ఇప్పుడెలా అన్నట్లు ఆందోళనగా మొహాలు చూసుకున్నారు భీమేష్, దాక్షిణ్యా.

అది గమనించి. "మీరేం కంగారుపడ కండి. మా అల్లుడు బంగారం. మీ సంబంధం మాకు నచ్చితే వాళ్లకి నచ్చినట్లే" ముసలాయన భరోసా ఇచ్చాడు. వచ్చిన విషయం చెప్పమన్నట్లు సైగచేశాడు భీమేష్.

చేతిలో కప్పు టీపాయ్ మీద పెట్టి "నేనె ప్పుడూ ఇంత పెద్దరికం వహించలేదు. ఏమైనా పొరపాటుగా మాట్లాడితే క్షమిం చాలి" అంటూ దాక్షిణ్య పైకిలేచి.

"ప్లీజ్, నాక్కొంచెం ఇబ్బందిగా ఉంది నేను నిలబడి మాట్లాడవచ్చా" అనడిగింది.

ఆమె అనీజీనెస్ అర్థం చేసుకొని "ఫరవా లేదమ్మా, నీ ఇష్టం" అన్నారు రామచంద్రరా వుగారు.

"మీ చంద్రమౌళి ప్రేమించిన చిత్ర నా చెల్లెలు. మా నాన్నగారి పేరు రాఘవరావు. సొంతూరు కాకినాడ దగ్గర చిన్న పల్లె టూరు. అమ్మ లేదు. చిత్ర పుట్టిన ఐదేళ్లకే పాముకాటుతో చనిపోయింది. మా అక్క వైదేహి భర్త చిన్న వయసులోనే చనిపోవ డంవల్ల ఇతర సంఘటనలవల్ల నాన్నకి మతిస్థిమితం తప్పింది. నేను, బామ్మా, అక్కా, చిత్రా మా ఊళ్లో ఉన్న కొద్దిపాటి ఆస్తులను అమ్మేసి ఏడేళ్ళక్రితం ఈ ఊరు వచ్చి స్థిరపడ్డాం" ఒక్క క్షణం ఆగి బలంగా ఊపిరి పీల్చి వదిలి మళ్ళీ చెప్పడం మొదలు పెట్టింది. "ఇప్పుడు ఫరవాలేదు. నేను ఒక ఫ్లోరిస్ట్స్ షాపు నడుపుతున్నాను. మా ఆస్తులు అమ్మగా వచ్చిన డబ్బును ఆనాడే మా బామ్మ మా ముగ్గురి పేరనా వేసింది. చిత్ర పేర ఐదు లక్షలుంది. మా వైదేహి అక్కకి కూడా త్వరలో మళ్ళీ పెళ్లి జరగబో తోంది. నాన్నగారికి చికిత్స చేయిస్తున్నాం. త్వరలోనే నయమవుతుందన్నారు డాక్టర్లు" చెప్పి ఆ దంపతుల్ని చూసింది.

స్కూల్లో పిల్లలా చేతులు కట్టుకుని కొద్దిగా పచార్లు చేస్తున్నట్లు ఆ కాస్త ప్లేసు లోనే అటూ ఇటూ తిరుగుతూ చెబుతున్న ఆమెనే పరిశీలనగా చూస్తూ శ్రద్ధగా వింటు న్నారు ఆ వృద్ధ దంపతులు. దక్ష తన చూపు మరల్చుకొని మళ్ళీ మొదలుపెట్టింది.

"మా చిత్ర డిగ్రీ ఫైనల్ ఇయర్ చదువు తోంది. దానికి బ్యూటీ కోర్సు చెయ్యడం ఇష్టం. హాబీగా అది నేర్చుకుంటోంది. సంగీతం రాదు కానీ గొంతు బాగుంటుంది. హిందీ పాటలు బాగా పాడుతుంది. వంట అంత బాగా రాదు. కానీ చాలా మంచి మనసు. తను తినేది ఏదైనా కాస్తయినా పక్కవాళ్ళకి పెట్టకుండా తినదు" చెల్లెలు గుణగణాలు వర్ణిస్తూ హాల్లోని ఫొటోలను కలయచూస్తున్న దక్ష ఓవైపు గోడకి లార్జ్ సైజ్‌లో సుభాష్ చంద్రబోస్‌తో కలిసి ఉన్న సైనికుల ఫొటో ఆకర్షించడంతో చెప్పడం ఆపి అప్రయత్నంగా అటు నడిచింది.

అది గమనించక "మీ చెల్లెలు వివరాలన్నీ మా చంద్రం చెప్పాడు. మాక్కావలసింది మీ కులగోత్రాలు, వంశం మంచి చెడ్డలు" అంటున్నదల్లా భర్త వారించడంతో ఆగిపో యింది శాంతమ్మ.

ముసలాయన లేచి దక్ష దగ్గరకి వచ్చాడు. "ఏమిటమ్మాయ్, అలా చూస్తు న్నావు. నేను వయసులో ఉన్నప్పుడు అజా ద్-హింద్‌ఫౌజ్‌లో కమెండోగా పనిచేశాను. అప్పుడు మా నాయకుడు నేతాజీతో కలిసి తీయించుకున్న ఫొటో ఇది" సగర్వంగా మీసం మెలేశాడు.

అవునా... అన్నట్లు చూసి "ఇదే ఫొటో మా ఇంట్లో కూడా ఉంది" చెప్పింది. ముస లాయన కళ్ళు ఆశ్చర్యంగా విచ్చుకున్నాయి. "దక్షిణ భారతదేశం నుండి అజాద్-హింద్ ఫౌజ్‌లో కమెండో స్థాయికి ఎదిగిన వాళ్ళు అరడజను మంది మాత్రమే. మేము ఒక్క ళ్ళమే ఈ ఫొటో కాపీలు తీసుకున్నాం. ఇంతకీ ఇందులో ఆ వ్యక్తి ఎవరు?" ఆత్రంగా అడిగాడు.

"మీకు కుడిపక్క నుంచున్న వ్యక్తి మా తాతగారు" వేలితో పాయింట్ చేసి చూపిస్తూ చెప్పింది.

"నువ్వు సూర్యమూర్తి మనవరాలివా? మరి చెప్పవేం. మీ తాతా నేనూ ప్రాణ స్నేహితులం. స్వాతంత్ర్యం వచ్చాక కూడా కలిసి కొన్ని ఉద్యమాలలో పాల్గొన్నాం. మా పిల్లల బాధ్యతలు, వాళ్ళ పిల్లల పెంపకాలు మా మీద పడ డంతో మేము దూర మయ్యాం. దానికితోడు మీ తాతయ్య చనిపోవడం, ఎందుకో మీరు హఠాత్తుగా సర్వవరం వదిలి వెళ్ళిపోవ డంతో కాలక్రమంలో మెల్లగా మీ సంగతులు మరుపుకు వచ్చాయి అంతే" దక్ష భుజం చుట్టూ చెయ్యేసి ఆర్ద్రమైన గొంతుతో అంటూ శాంతమ్మగారి దగ్గరకి తీసుకొచ్చి,



"శాంతా! మన సూర్య మూర్తి ఇంటి పిల్లకి ఇంకా వంకలేమిటీ? అమ్మాయ్! నేను చెబుతున్నాను ఈ పెళ్ళి ఖాయం. నువ్వు నిశ్చిం తగా పెళ్ళికి ఏర్పాట్లు చేసుకో వచ్చు" సంబరంగా అన్నాడు రామచంద్రరావు.

ఒక్క శాంతమ్మగారికి తప్ప అక్కడ అందరికీ ఆ మాట పన్నీటి జల్లులా అనిపించింది. ఒకరినొకరు చూసుకొని సంతో షంగా నవ్వుకున్నారు.

దాక్షిణ్యా, భీమేష్, చంద్రం ముగ్గురి కళ్ళలోనూ సంతృప్తితో కూడిన వెలుగు వచ్చింది. పెద్దల అండ, అనుభవం వాళ్ళు ఈ లోకంలో లేకపోయినా పిల్లలకు ఉపకారంగా ఎలా పరిణమిస్తాయో తెలిసి వచ్చిన దాక్షిణ్య "థాంక్స్ తాతగారు" సూర్యమూర్తికో, రామ చంద్రరావుకో తెలియనట్లు కృతజ్ఞతగా

అంది.

"కంగ్రాచ్యులేషన్స్"భీమేష్ చంద్రాన్ని అభినందించాడు.

"థాంక్స్, శుభవార్త చిత్రకి చెబుతాను" అంటూ సెల్ తీసుకొని బయటికి వెళ్ళిపోయాడు. అక్కడ అందరిలోనూ శాంతమ్మ గారే ఏదో అసంతృప్తిగా ఫీలవుతోంది. అది గమనించని రామచంద్రరావుగారు "శాంతా! శుభవార్త విన్నాక నోరు తీపి చెయ్యాలని మర్చిపోయావా... ఏం? వెళ్ళి స్వీట్లు తీసుకురా" అన్నారు. భర్త ఆదేశంతో దాక్షిణ్యనే సాలోచనగా చూస్తున్నదల్లా తేరుకొని లోనికి వెళ్ళి పళ్ళెంలో స్వీట్లతో వచ్చి ఒక్కొక్కరికీ అందించింది. భర్తకి, భీమేష్‌కి ఇచ్చాకా దాక్షిణ్యకి అందిస్తూ,

"రాఘవరావుకి ఇద్దరా, ముగ్గురా కూతుళ్ళు?" అనుమానం తీర్చుకోడానికి అడిగినట్లు అడిగింది.

"ముగ్గురండీ నేను రెండో అమ్మాయిని. చిత్ర ఆఖరి అమ్మాయి" బదులిచ్చింది.

ఆవిడ కళ్ళు ముడుచుకున్నాయి.

"రాఘవరావు పెద్ద కూతుళ్ళు ఇద్దరికీ చిన్న వయసులోనే పెళ్ళిళ్ళు చేసేశాడు. పెద్దపిల్ల పెళ్ళికి మేము వెళ్ళాం కూడా. మరి ఇతను మీ ఆయనా...?" భీమేష్‌కేసి సందేహంగా చూస్తూ అడిగింది. పెదాలు బిగించి మౌనంగా ఉండిపోయింది దక్ష. ఆమె ఇబ్బంది గమనించి,

"ఆఁ! అవునండీ" భీమేష్ చెప్పబోయాడు.

కానీ దక్ష ఒప్పుకోలేదు. శాంతమ్మగారిని సూటిగా చూస్తూ, "మీరన్నది నిజమే. నాకు, మా అక్కకి చిన్న వయసులోనే పెళ్ళిళ్ళయ్యాయి. కానీ ఈయన మా ఆయన కాదు. నా స్నేహితుడు" స్పష్టంగా చెప్పింది.

"మీరిద్దరూ కాబోయే భార్యాభర్తలని పరిచయం చేశాడు మా చంద్రం" ఆవిడ గొంతులో ఆగ్రహం ధ్వనించింది.

దక్ష బదులివ్వలేనట్లు తల తిప్పుకుంది.

శాంతమ్మ మొహం కఠినంగా మారిపోయింది. "పెళ్ళంటే మా తరానికి కొన్ని నమ్మకాలు ఉన్నాయి అమ్మాయి. నా దృష్టిలో ఆడదానికి ఒకటే మనువు, ఒకటే బ్రతుకు. ఏ కారణంగానో భర్త కొంతకాలం దూరం అయ్యాడని మరో పెళ్ళికి సిద్ధమైన నీ చెల్లెలితో నా మనవడి పెళ్ళి జరగడం నాకిష్టం లేదు." ఆవిడంత ఖచ్చితంగా చెప్పడంతో అంతా బిత్తరపోయినట్లు నిలబడిపోయారు.

"శాంతా ఏమిటా వాగుడు" రామచంద్రరావుగారు వారించబోయారు.

**ఆడదానికి ఒకటే మనువు, ఒకటే బ్రతుకు. ఏ కారణంగానో భర్త కొంతకాలం దూరం అయ్యాడని మరో పెళ్ళికి సిద్ధపడ్డావు నువ్వు. అలాంటి నీ చెల్లెలితో నా మనవడి పెళ్ళి జరగడం నాకిష్టం లేదు.**



దక్ష పైకి లేచింది. "ఆవిడను మాట్లాడనీయండి తాతగారూ! అనుమానాలతో అపార్థాలతో ఈ పెళ్ళి జరగడం నాకు ఇష్టం లేదు" దక్ష ఆయన్ని అడ్డుకుంది.

ఆ మాట శాంతమ్మ ఆవేశాన్ని రెచ్చగొట్టింది. "ఇంత స్పష్టంగా విషయం అర్థమౌతుంటే అపార్థానికి అవకాశమెక్కడ ఉంది. నీ భర్త ఏ కారణంగానో నిన్ను వదిలేశాడు. ఇంక అలాంటి మొగుడు నాకు అక్కరలేదని ఇతనితో రెండో పెళ్ళికి సిద్ధపడ్డావు. రేపు నీ చెల్లెలు నీ దారిలో నడవదని నమ్మకం ఏమిటీ? భర్త దూరమైన ప్రతీ ఆడదీ మరో మగాడిని నీలా వెతుక్కుంటోందా? నా కూతుర్నే చూడు. పాతికేళ్ళుగా నా అల్లుడు మిలట్రీలో ఉండి ఏడాదికో, రెండేళ్ళకో నాలుగురోజులుండి వెళ్ళిపోయేవాడు.

అయినా మా అమ్మాయి భర్త వచ్చేదాకా ఇల్లు కదలకుండా అతనితోనే లోకం అన్నట్లు బతికింది. ఈ రోజు తన భర్తతో సంతోషమైన జీవితం గడుపుతోంది. ఓర్పు, సహనం ఆడదానికి దేముడిచ్చిన వరాలు. అవి వదులుకొని శారీరక వాంఛలకు తల వంచితే స్త్రీ జాతి పరువేపోతుంది" కడిగేస్తున్నట్లు అంది.

ఆవేశంతో ఆవిడ తన శీలం మీద వేసే నిందల్ని పంటిబిగువున భరిస్తూ గట్టిగా కళ్ళు మూసుకొని తనని తను అదుపు చేసుకోసాగింది దాక్షిణ్య.

ఆమె అనుభవించే చిత్రవధను పసిగట్టిన భీమేష్‌లో ఆగ్రహం కలిగింది. "బామ్మగారూ! మీరు పెద్దవారు. నిజానిజాలు తెలుసుకోకుండా దారుణమైన నిందలు వేసి అవమానించవద్దు" హెచ్చరించాడు.

దాక్షిణ్య వెంటనే అడ్డుకుంది. "నా వల్ల మీరు కూడా నిందలపాలు కావడం నాకు చాలా సిగ్గుగా, బాధగా అనిపిస్తోంది భీమేష్. బట్ ఇక్కడ దోషిని నేను కనుక సంజాయిషీ కూడా నేనే చెప్పుకుంటాను" అని శాంతమ్మకేసి తిరిగి సూటిగా చూస్తూ, "మీరు చెప్పింది నిజం బామ్మగారూ! భర్త దూరంగా ఉన్నంత మాత్రాన భార్య మరొకరిని వెతుక్కోనక్కరలేదు. కానీ తాళి మాత్రమే కట్టి ఆ ఒక్క నేరానికి నా కుటుంబాన్ని ఆర్థికంగా, సాంఘికంగా పలచన చేసి నా తండ్రిని పిచ్చివాడిని చేసి ఉన్న ఊరుని, అయినవాళ్లని మాకు మేముగా దూరం చేసుకొనే దుస్థితిలో వదిలేసిన మనిషిని ఎక్కడో దూరతీరాలలో నా కోసం వేచిచూస్తున్నాడు కనుక అతని క్షేమం కోసం ఇక్కడ నేను శ్రావణమాసాలు, సౌభాగ్య వ్రతాలు చేసే సహనం నాకు లేదు. ఎందుకంటే నాకు ప్రతి రోజూ నా తండ్రి ఆరోగ్యం కోసం, వృద్ధురాలైన బామ్మ, విధవరాలైన అక్కా, చదువుకునే చెల్లెలు, లోకంలోని కల్మషం ఎరుగని పసివాడు- వీళ్ళందరినీ చూసుకోవలసిన బాధ్యతతో జరిపే యుద్ధంలో నా కళ్ల ముందుండే బతుకును గెలవడమే లక్ష్యం" ఎందుకో ఆ మాట అంటుంటే ఆమె గొంతు సన్నగా ఒణికింది. వాళ్ళందరి ముందు తన బాధ చెప్పుకోవడం ఆమెకే అసహ్యంగా అనిపించింది. అందుకే "క్షమించండి నాలాగే నా చెల్లెలు ప్రవర్తిస్తుందనే మూర్ఖత్వాన్నే మీరు నమ్మితే నేనేం చెయ్యలేను. కానీ సూర్యమూర్తి మనవరాలనో, దాక్షిణ్య చెల్లెలుగానో కాక చిత్రని మీ మనవడు ఇష్టపడిన మంచి అమ్మాయిగా చూస్తే మీ సంబంధం మాకెప్పుడూ ఇష్టమే. ఉంటాను" చేతులు జోడించి చెప్పి భీమేష్ కేసి తిరిగి "వెళదామా?" అడిగింది. వెళ్లబోతున్న ఆమె చెయ్యి పట్టి ఆపి "అనవసరంగా తొందరపడుతున్నావేమో! ఒక్కసారి ప్రశాంతంగా కూర్చుని వివరంగా మాట్లాడుకుంటే, అన్ని సమస్యలు పరిష్కారమౌతాయి. ఆలోచించు" నచ్చచెబుతున్నట్లు అన్నాడు భీమేష్.

నిర్లిప్తంగా అతని మొహంలోకి చూస్తూ "చిత్రా, చంద్రం పెళ్ళికి మీరెంత ఆత్రపడుతున్నారో నాకు తెలుసు. కానీ ఎంతసేపు కూర్చుని మాట్లాడినా వాదన పెరుగుతుందే తప్ప నిజాలు ఎవరి తృప్తికోసమో అబద్ధాలై పోవు. అయినా మాటలతో వాళ్ళని ఒప్పించగలననే నమ్మకం ఉంటే మీ ఇష్టం. నేను షాపుకి వెళ్లాలి" చెప్పి చెయ్యి విడిపించుకుని బయటకు నడిచింది.

ఆమెని అనుసరించాలో, అక్కడే ఉండి మాట్లాడాలో తేల్చుకోలేనట్లు తడబడిన భీమేష్ ఒక నిర్ణయానికి వచ్చి "తాతగారు, వీలైనంత త్వరలో నేను మీతో నిజానిజాలు వివరంగా మాట్లాడతాను. ఈలోగా మీరు తొందరపడి చంద్రంకి కానీ, చిత్రకి కానీ పెళ్ళి కేన్సిల్ అయ్యిందని చెప్పొద్దు ప్లీజ్" బతిమాలాడు.

బయట గార్డెన్‌లో తిరుగుతూ చిత్రతో సెల్‌లో మాట్లాడుతూ మురిసిపోతున్న

మనవడిని గమనించి అంగీకారంగా తలూపాడు తాతగారు.

ఆయనకి కృతజ్ఞతలు చెప్పి చంద్రంకి దూరం నుండే చెయ్యూపి వీడ్కోలు చెప్పి కారు దగ్గరకి వచ్చాడు భీమేష్.

అప్పటికే దాక్షిణ్య ముందు సీట్లో కూర్చుని ఎటో చూస్తూ నీళ్లు నిండిన కళ్లతో ఏదో ఆలోచిస్తోంది. భీమేష్‌ని గమనించి హడావిడిగా రుమాలుతో కళ్లు తుడుచుకొని బయటకి చూస్తుండిపోయింది.

భీమేష్ సెల్ మోగడంతో మాట్లాడి ఆఫ్ చేశాడు.

ఎవరు చేశారు? ఎందుకు చేశారనే ఆసక్తిని కనపరచలేదు దాక్షిణ్య. కానీ పది నిమిషాల ప్రయాణానంతరం కారు సిటీ పరిసరాలు దాటి వెళ్తుండడం గమనించి "ఇదేమిటీ...? ఇలా ఎక్కడికి వెళ్తున్నాం!" ఆశ్చర్యంగా అడిగింది.

"శ్రీకాంత్ ఫోన్ చేశాడు. విజయవాడలో ఏదో డీల్ సెటిల్ చెయ్యడానికి వెళ్లమన్నాడు" క్లుప్తంగా చెప్పాడు.

"దానికి నేను కూడా ఎందుకు? నేను షాపుకి వెళ్లి చాలా రోజులయ్యింది" ఆమె గొంతులో అసహనం తొంగి చూసింది.

చురుక్కుమన్నట్లు చూశాడు భీమేష్. "నువ్వడక్కుండానే నేను చాలా సార్లు నా పనులు మానుకుని వచ్చాను. ఒక్కసారి నువ్వు నాతో రాలేవా? " సూటిగా అడిగాడు.

ఇబ్బందిగా కదిలిన



దక్ష షాపుకి ఫోన్ చేసి భాస్కర్‌కి చెప్పి పర్మిషన్ తీసుకుంది. భాస్కర్ ఏమీ అభ్యంతరం పెట్టలేదు. ద్విజేంద్రసింగ్ ఆరోపణ గురించి చెబుదామనుకొని దానికొక ముగిసిపోయిన కథగా భావించి మిన్నకుండిపోయాడు.

* * *

హుందాగా, గంభీరంగా ఉండే ఇంటలీజెన్స్ ఆఫీసు భవనం ముందు వేగంగా వచ్చి ఆగింది యోగేంద్ర కారు. డోరు తెరిచిన ఇన్‌స్పెక్టర్ చూసి "మిస్టర్ గౌతమ్, ఎయిర్‌పోర్టు బాంబు బ్లాస్ట్ కేసుకు సంబంధించిన ఫ్లోరెన్సిక్ లాబ్ రిపోర్టు వచ్చిందా? " తన రూమ్ కేసి నడుస్తూ అడిగాడు.

"ఎస్ సార్, అన్నీ మీ టేబుల్ మీద ఉన్నాయి"చెప్పాడు గౌతమ్.

"ఇంతవరకు ఏ తీవ్రవాద సంస్థ అది తమ చర్యేనని ప్రకటించలేదు కదూ? " మళ్ళీ ప్రశ్నించాడు.

"నో సర్, చూడబోతే ఎవరో హోమ్‌మినిస్టరు మీద వ్యక్తిగత కక్షతో దాడి జరిపినట్లు కనిపిస్తోంది" గౌతమ్ అన్నాడు.

"అంటే హోమ్ మినిస్టరు ముంబాయి వెళ్తున్నారని తెలిసి దాడి చేశారన్నమాట. కానీ మనిషి ఉన్నాడో లేదో చూసుకోకుండానే పేల్చేశారంటావా కారుని" అనుమానంగా అన్నాడు.

"బహుశా ఇది మెంటల్ వార్నింగేమో సార్. మేము తలుచుకుంటే మనిషినైనా లేపేస్తామని చెప్పే హెచ్చరికగా ఎమ్టీ కారుని పేల్చేసి ఉండొచ్చు" మేబీ... తన సీట్లో కూర్చుంటూ సాలోచనగా తలూపిన యోగేంద్ర ఎదురుగా ఉన్న లాబ్ రిపోర్టు ఫైల్ తెరుస్తూ "ఏమంటున్నాయి రిపోర్టులు? " అడిగాడు.

"ఫ్లోరెన్సిక్ రిపోర్టు ప్రకారం బాంబుబ్లాస్ట్

గాయపడిన వ్యక్తుల రక్తపు మరకల వంటి వాటిని పక్కన పెట్టి విస్ఫోటానికి గురైన హోమ్ మినిస్టర్‌గారి కారును కూలంకషంగా పరిశీలించిన సిబ్బంది కాలిన పువ్వుల రేకులు, వెదురు బుట్ట అవశేషాలు వంటి గుర్తుల వల్ల ఈ నిర్ణయానికి వచ్చారు" రిపోర్టు ఫైల్ చేతిలోకి తీసుకుని ముఖ్య మైన వివరాలు చదివాడు గౌతమ్.

"బాంబు బ్లాస్టింగ్ రేంజ్ ఎంత? "

దాదాపు వంద మీటర్ల పరిధి కలిగిన సాధారణ బాంబు. కాకపోతే మెటల్ డిటె క్టర్లకి అందని ప్రత్యేక ప్లాస్టిక్ మెటీరి యల్‌తో తయారు చెయ్యబడింది. మరో విషయం సార్. ఇది ముందుగానే ఫిక్స్ చేసిన టైమ్‌బాంబ్. దేరీజ్ నో రిమోట్ కంట్రోల్ సిస్టమ్ ఇన్ ఇట్"

"అంటే, ఆ ఫ్లైయిట్‌కి హోమ్‌మినిస్టరు ముంబాయి వెళుతున్నారని గ్రహించి ముందుగానే టైమ్ ఫిక్స్ చేసి బొకేలో పెట్టి ఆయనకి ఇచ్చారు. ఏ కారణంగానో అది ఫ్లైయిట్‌లోకి తీసుకెళ్ళకుండా కారులోకి చేర్చ బడడంతో ఒక పెద్ద విమాన దుర్ఘటన తప్పడమేకాకుండా వందలాది ప్రాణాలు రక్షింపబడ్డాయి. నో, గౌతమ్ ఒక ఉన్నతస్థాయి రాజకీయవేత్తతో పాటు అందరు అమాయకుల ప్రాణాలతో చెలగాట మాడాలని చూసిన ఆ వ్యక్తుల్ని మనం వద లకూడదు. ఏమైనా క్లూ దొరికిందా? " ఆతృ తగా అడిగాడు.

"బాంబు ఫ్లవర్ బొకేలో పెట్టారు అన్నదొ కటే ముఖ్యమైన 'క్లూ' సార్. కాకపోతే సంఘటనా స్థలంలో మనకి ఇదిగో ఈ సగం కాలిన నేమ్ స్టిక్కర్ మాత్రం దొరి కింది" అంటూ ఒక చిన్న పాలిథీన్ రేప ర్‌లో సీజ్ చేసిన కాగితం ముక్కను అందించి "బహుశా ఇది ఆ బొకేని పార్సిల్ చేసిన ఫ్లోరిస్టు సంస్థ పేరై ఉండవచ్చును సార్" చెప్పాడు.

మల్టీషేడ్ కలర్‌లో మెరుస్తున్న "PAR" అనే అక్షరాలను గమనిస్తూ "అంటే ఆ ఫ్లోరిస్టు షాపు పేరు ఈ మూడక్షరాలతో మొదలవుతూ ఉండవచ్చు. నువ్వో పని చెయ్యి. టెలిఫోన్ డైరక్టరీ ద్వారా ఈ అక్ష రాలతో మొదలయ్యే ఫ్లోరిస్టు షాపుల వివ రాలు సేకరించు. వాటిని లిస్ట్ అవుట్ చేసి ఆర్డర్ బుక్ ద్వారా దాన్ని నిన్న సాయంత్రం ముంబాయి ఫ్లైయిట్ టైమ్‌కి బాస్కెట్ బొకేలు ఎంతమందికి సప్లయ్ చేశారో, బుక్ చేసిన వాళ్ళ పేర్లు, వివరాలు, ఎవరి పేరున పంపబడ్డాయి అనే వివరాలు నాకు రేపు ఉదయానికల్లా సిద్ధంగా ఉండాలి" ఆర్డర్ వేస్తున్నట్లుగా చేయవలసిన పనిని అప్పగిం చాడు యోగేంద్ర.

అతను చెప్పిన వాటికి సరేనన్నట్టుగా తలూపి గౌతమ్ స్టిఫ్‌గా నిలబడి సెల్యూట్ చేసి వెంటనే ఆ పనిమీద బయలుదేరాడు.

* * *

"సో, నీకు పెళ్ళయ్యింది. నీ భర్త నిన్ను వదిలివేశాడు. నాకెప్పుడూ చెప్పలేదేం? " రోడ్డుమీద నుండి దృష్టి మరల్చకుండా అడి గాడు.

"మన మధ్య పరిచయం స్నేహం స్థాయిని చేరలేదనే నేను అనుకుంటున్నాను. అలాంటప్పుడు నా వ్యక్తిగత విషయాలు ప్రతీదీ మీతో చెబుతానని, చర్చిస్తానని మీరెలా అనుకుంటున్నారు మిస్టర్" అంతే సూటిగా తిరిగి ప్రశ్నించింది.

భీమేష్ నొచ్చుకోలేదు. చిన్నగా నవ్వే శాడు. "విజయవాడ కనీసం నాలుగు గంటల ప్రయాణం. పోనీ, ఇప్పుడు చెప్పవ చ్చుగా! ఐ థింక్, చిత్ర పెళ్ళి విషయం మాట్లాడటంకోసం నన్ను నీతో తీసుకెళ్ళడా నికి నువ్వు అంగీకరించడంలోనే మన స్నేహం స్థాయి పెరిగిందనుకుంటాను" ఓరగా చూస్తూ అన్నాడు.

ఒకసారి అతని కళ్ళలోకి చూసి మెల్లగా చెప్పడం మొదలుపెట్టింది. "మాది తూర్పు గోదావరి జిల్లాలో ఓ చిన్న పల్లెటూరు.

వారానికి రెండుసార్లు లేదా అంతకన్నా ఎక్కువసార్లు మాంసాహారాన్ని తీసుకునే మగువలలో 29% మందికి టైప్-2 మధుమేహం వచ్చే అవకాశముంది. వారానికి ఐదు సార్లు అంతకంటే ఎక్కువసార్లు మాంసాహారం తీసుకునే మహిళల్లో 43% మందికి టైప్-2 మధుమేహం వచ్చే

## మహిళలూ, మీరు మాంసాహారులా ...?



అవకాశముంది. ఇదేంటండీ, ఇలా భయపెడుతున్నారు అంటారా? మేం కాదండి... హార్వార్డ్ వైద్య కళాశాల బ్రిగ్‌హోమ్ ఉమన్స్ హాస్పిటల్‌కు చెందిన వైద్యశాస్త్రవేత్తలు చేస్తున్న హెచ్చరికలండి ఇవి... ఎనిమిదేళ్ళపాటు మాంసాహారం తీసుకునే మహిళల మీద జరిపిన పరిశోధనల్లో ఈ విషయం తేలిందని వారు రూఢిగా చెప్తున్నారు. ఫాస్ట్ ఫుడ్లూ, ఆయిలీఫుడ్లలో మాంసాహారాన్ని చేర్చటం వల్ల ఈ ప్రమాదం మరింతగా పెరుగుతుందని వారంటున్నారు. మీట్ బర్గర్‌లకు, ఫాస్ట్ ఫుడ్లకీ ఫుల్‌స్టాప్ పెడతారా... మధుమేహ భూతాన్ని కొనితెచ్చుకుంటారా? మీ ఇష్టం. తేల్చుకోండి అంటున్నారు.

నాన్నకి తరతరాల వారసత్వపు భూములు, సొంత ఇల్లు ఉండేది. నాన్నకి ఊహ తెలిసినప్పటి నుండి తాతయ్య స్వాతంత్ర్య ఉద్యమం, స్వరాష్ట్ర ఉద్యమం, ఆంధ్రా ఉక్కు ఇలా ఏవేవో కారణాలతో రాజకీయంగా ఇల్లు పట్టకుండా తిరుగుతూ ఉండేవారట. బామ్మకి అవేవి తెలియవు. చాలామంది బిడ్డలు పుట్టుకతోనే చనిపోతే ప్రాణాలతో దక్కిన నాన్నే సర్వస్వంగా బతికింది. తండ్రికి కుటుంబ బాధ్యత పట్టకపోవడంతో అమ్మ మాటే వేదంగా బతికేవారు మా నాన్న. మేనమామ కూతుర్ని పెళ్ళిచేసుకుని ఉన్న పొలం పుత్రతో సుఖంగా గడిపే నాన్న జీవితంలో తొలిదెబ్బ పదేళ్ళలోపున్న ముగ్గురు పసిపిల్లలను ఆయన మీద వదిలి భార్య అర్ధాంతరంగా మరణించడం. అయినా సర్దుకున్నారు. ముగ్గురినీ కంటికి రెప్పలా సాకుకొన్నారు. ఏనాడూ అమ్ముంటే బాగుండును అనే భావన మాలో రేగకుండా జాగ్రత్తగా పెంచుకొచ్చారు. "కొందరికి కొన్ని మూర్ఖపు నమ్మకాలుంటాయి. ఎందుకు? అంటే వాళ్ళకే తెలియదేమో. అలాగే మా బామ్మకి, ఆడపిల్లలకి పన్నెండేళ్ల లోపుగానే పెళ్ళి జరిగితీరాలి అన్నది ప్రగాఢ విశ్వాసం. నాన్న కాదనలేదు. బామ్మ కోరిక మన్నిస్తూ ప్రయత్నించారు. మరో రెండేళ్ళకి కానీ బామ్మ మెచ్చిన వరుడు దొరకలేదు. ఇకపై ఆలస్యం అనర్థం అనుకుంటూ మూడు ముళ్ళు వేయించి, మూడు నిద్రలు జరిపించింది. దురదృష్టం అక్కని శాపంలా వెంటాడి మోటబావిలో స్నానానికి వెళ్ళిన బావ ఊబిలో చిక్కి ఊపిరి కోల్పోయాడు. తను పెళ్ళి పేరుతో పొందిందెంతో పోగొట్టుకున్నదెంతో తెలియకుండానే అక్క విధవరాలే కాదు, ఓ బిడ్డకి తల్లి కూడా అయ్యింది'

' తలచుకుంటే గతం మనసును కెలుకుతోందేమో బాధగా ఆగిపోయింది.

"ఆ తరవాత? "

కాస్త సర్దుకుని కూర్చుని చెప్పడం మొదలెట్టింది. "అక్క జీవితం మొదట్లోనే మొగ్గగానే

అప్పటికే తొమ్మిదో నెల గర్భిణిగా ఉన్న అక్కని చూసిన నాన్న ఏంచెప్పుకున్నాడో గానీ, వాళ్లచేతే అబ్బాయి చదువయ్యాకే మూడు రాత్రుల తతంగం చేసుకుంటాం అనిపించి నన్ను రక్షించాడు

వాడిపోవడం నాన్నకి తగిలిన రెండో ఎదురు దెబ్బ. మూడోది వృద్ధాప్యం కారణంగా తాతగారు చనిపోవడం. క్రమంగా ఆయన మాట్లాడడం తగ్గించేశారు. అమ్మ చెప్పిన పనిని అమలుచేసే కొడుకుగానే ఉండిపోయారు. చిత్రంగా అక్క జీవితం పెళ్లి పేరుతో విషాదంగా మారినా బామ్మ ధోరణి మారలేదు. రాఘవా! దక్షకి పదమూడు వస్తోంది. సుబ్బారావు పంతులు ఎవరో మంచి కుర్రాడు ఉన్నాడని చెప్పాడు. పిల్లాడు పదవతరగతి పాసై కాలేజీ చదువులు చదువుతున్నాడట. తండ్రి పేరు మాధవరావు. తాలూకా ఆఫీసులో గుమాస్తాగా పనిచేస్తున్నాడు. పోయి మాట్లాడిరా" అని చెప్పింది.

"వేద పెళ్లి పేరుతో ఎంత నష్టపోయిందో చూసి కూడా దక్షకి అప్పుడే పెళ్లెందుకమ్మా" నాన్న నసిగినట్లు అన్నారు. నాకు తెలిసి బామ్మ మాటకి నాన్న నోటి నుండి వెలువడ్డ మొదటి వ్యతిరేకత అది. దానికే బామ్మకి చాలా కోపం వచ్చింది. నాన్నతో చాలా పోట్లాడింది. వాదించే శక్తిలేని నాన్న బామ్మ చెప్పిన కర్మసిద్ధాంతానికి లొంగి నా పెళ్లికి ఏర్పాట్లు చేశాడు"

"గుళ్లో పెళ్లి చూసినట్లు బొమ్మరింట్లో బొమ్మల పెళ్లి చేసినట్లు ఎవరి ఇష్టాయిష్టాలతో సంబంధం లేకుండా నాకూ పెళ్లయిపోయింది. అప్పటికే తొమ్మిదో నెల గర్భిణిగా ఉన్న అక్కని చూసిన నాన్న ఏంచెప్పుకున్నాడో గానీ, వాళ్లచేతే అబ్బాయి చదువయ్యాకే మూడు రాత్రుల తతంగం చేసుకుంటాం అనిపించి నన్ను రక్షించాడు. మా మామగారిది గవర్నమెంటు ఉద్యోగం కావడం, నేనింకా పెద్దమనిషి కాకపోవడంతో, అబ్బాయి పై కాలేజీకి వెళ్లేదాకా మీ అమ్మాయిని మీ దగ్గరే ఉంచుకోండని వెళ్లిపోయారు"

"ఆ తరవాత ఎప్పుడూ నీ భర్త తరఫువాళ్లు నిన్ను కలవలేదా? "

"నన్నంటే, నాన్నని కలిసేవారు ఆరునెల్లకోసారి మా మామగారు. మీ అల్లుడికి కాలేజీ ఫీజు కట్టాలి. పరీక్షల ఫీజు కట్టాలి. ఏదో డొనేషన్ కట్టాలి అంటూ వేలకి వేలు వసూలు చేసుకుని వెళ్లేవాడు. మగపిల్లాడి తండ్రి అడిగితే ఆడపిల్ల తండ్రి కాదనకూడదు అని బామ్మ అనేది. దాంతో నాన్న ఏ పొలమో పుట్రో అమ్మి అల్లుడికి ముడుపు చెల్లించేవాడు" నిరసనగా అంది.

"అంటే మీ నాన్నగారి దగ్గర ఉన్నదంతా వసూలు చేసుకుని ఆయన నుండి వచ్చేదేం లేదని గ్రహించి మీ అత్తగారు నిన్ను వదిలివేశారా? " సందేహంగా అడిగాడు.

చేతులు కట్టుకుని ఆలోచిస్తూ పెదవి విరిచింది. "అదేమో, నాకు తెలీదు. నా టెన్త్ పూర్తయిన కొత్తలో మా మామగారు, అతను వచ్చారు. ఢిల్లీ స్కూల్ ఆఫ్ మేనేజ్‌మెంట్స్‌లో అతనికి సీటు వచ్చిందట. అక్కడ డిగ్రీచేసి ఎం.బి.ఎ. చేస్తే విదేశాలకెళ్లి

పెద్ద చదువులు చదివేందుకు అవకాశం వస్తుందని చెప్పి నాన్న దగ్గర పెద్ద మొత్తంలో డబ్బు పట్టుకుని వెళ్లారు. అదే చివరిసారి వాళ్లు మా ఇంటికి రావడం. నేను టెన్త్ ఫస్టుక్లాసులో పాస్ అయ్యాను. ఆ పల్లెటూర్లో కాలేజీ సదుపాయం లేనందున నేను మా అత్తారింటికి కాకినాడ వెళ్లిపోతే చదువుకి బాగుంటుందని భావించిన నాన్నగారు సుబ్బారావు మాస్టారిని తీసుకుని మా మామగారి ఇంటికి వెళ్లారు. అక్కడ తగిలింది నాన్న తేరుకోలేని షాక్. మా మామగారు ఉద్యోగానికి రాజీనామా చేసి, ఉన్న ఇల్లు ఖాళీచేసి వెళ్లిపోయారు. ఆర్థికంగా చితికిపోయారని, ఎవరికీ చెప్పకుండా హఠాత్తుగా ఎక్కడికో వెళ్లిపోయారని, ఆయన ఆచూకీ ఎవరికీ తెలియదని చుట్టుపక్కల వాళ్లు చెప్పారు. నాన్న చేష్టలుడిగిన మనిషిలా ఉండిపోయారు. అంతవరకు ఆయన్ని భగవంతుడే మోసం చేశాడని, అంతా తన దురదృష్టమనే నిరాశతోనే ఉండేవారు. తొలిసారి ఓ మనిషి చేతిలో దారుణంగా మోసపోవడం విపరీతమైన మానసిక వత్తిడికి గురిచేసింది. ఆరోజు నాకింకా గుర్తు. నాన్న నిద్రలో నడిచొచ్చే మనిషిలా మాస్టారు భుజం పట్టుకుని నడిపిస్తూంటే వచ్చారు. అక్క కొడుకుని కాళ్లమీద పడుకోపెట్టుకుని ఆడిస్తున్న నేను నాన్న స్థితిని గ్రహించలేదు. బాబుని అక్కకి అందించి "నాన్నా! నా కాలేజీ అప్లికేషన్ తెచ్చావా?" దగ్గరకివెళ్లి చెయ్యిపట్టుకుని ఆశగా అడిగాను. నాకు తెలిసి నాన్న వెళ్లింది నాకు అప్లికేషన్ తేవడానికి మాత్రమే.

నాన్న నుండి నేను ఏ మాత్రం ఊహించని ప్రతిస్పందన వచ్చింది. ఆయన చెయ్యి నా తలపై వాలి నన్ను దగ్గరికి తీసుకుంది. "నాశనం చేసేశాను. సర్వ నాశనం చేసేశాను" గొణుగుతున్నట్లు అంటుండగానే కిందకి జారిపోయారు. నాన్నకి ఏమయ్యిందో తెలియని అయోమయం, భయం, బాధ ఆయన్ని నాన్నా అని అరుస్తూ కుదుపుతున్న మా గొంతుల్లో పదే పదే ధ్వనించింది" చెప్తుండగానే దాక్షిణ్య కళ్లలోకి కన్నీళ్లు ఉబికి వచ్చాయి. భీమేష్ కారుని ఓ పక్కగా ఆపేశాడు. దాక్షిణ్య ఏమనుకుంటుందోనని కూడా ఆలోచించకుండా ఆమె తలని తన భుజాలకి ఆన్చుకొని మెల్లగా, ఓదార్పుగా తల నిమురుతూ ఉండిపోయాడు. పది నిమిషాలకి ఆమె దుఃఖం సద్దుమణిగింది. భీమేష్ వెనకి సీట్లోకి వంగి అక్కడున్న వాటర్ బాటిల్ అందుకుని దాక్షిణ్యకిచ్చాడు. కిందకి దిగి మొహం కడుక్కొని కొద్దిగా నీళ్లు తాగింది. కాస్త దూరంలో కనిపిస్తున్న కొబ్బరి బొండాలను కొని తెచ్చి బలవంతాన తాగించాడు. వాటిని ముక్కలు చేయించి కొబ్బరి తీయించి ఓ పేపర్ ప్లేటులో పెట్టించుకొచ్చాడు. అప్పటికి దాక్షిణ్య బాగా తేరుకుంది. కొబ్బరి తినేదాకా ఆగి కారు స్టార్టు చేశాడు. కిటికీలోంచి వచ్చే చల్లటి గాలికి మెల్లగా దాక్షిణ్య మనసు సేదతీరింది.

"ఆర్ యూ ఫీలింగ్ వెల్...?" అడిగాడు.

కళ్లు మూసుకొని "ఆ" అని తలూపింది.

"దెన్, లెట్స్ కంటిన్యూ... యువర్ లైఫ్ స్టోరీ" చాలా మామూలుగా అన్నాడు.

"వ్హాట్...?" ఉలికి పడ్డట్టు కళ్లు పెద్దవి చేసి చూసింది అతడివైపు.

"ఎందుకంత ఆశ్చర్యం. నువ్వు మధ్యలో ఆపేసిన కథని పూర్తి చేయమన్నాను అంతేగా!"

వెంటనే మాట్లాడలేదు. పూర్తిగా అతనివైపు తిరిగి పరీక్షగా చూసింది.

"ఏంటలా చూస్తున్నావు?"

"ఊహూ! ప్రతి మనిషీ మరో మనిషి జీవితం గురించి తెలుసుకోవడానికి ఎందుకంత ఆత్రపడతాడు" అర్థం కానట్టు అడిగింది.

భుజాలు ఎగరేశాడు. "ఏమో, బహుశా

మానవ స్వభావపు బలహీనతేమో. తన గురించి కన్నా పక్కవారి గురించి తెలుసుకోవాలనే లక్షణం లేకపోతే ఇన్ని వేల నవలలు, సినిమాలు ఎలా వస్తాయంటావు" నవ్వేశాడు.

దక్ష కూడా చిన్నగా నవ్వేసింది.

"విషయాన్ని పక్కదారి పట్టించకుండా సూటిగా విషయానికి రా!"

"చెప్పడానికి ఇంకేముంది. వాళ్ళు మోసం చేశారు. నాన్నకి మతి చలించింది. ఊళ్లో వాళ్ళ సానుభూతి మాటలు, చాటు మాటు హేళనలు భరించలేక మిగిలిన ఆస్తి అమ్మి సుబ్బారావు మాస్టారు సాయంతో హైదరాబాద్ వచ్చేసి కొత్త జీవితం మొదలు పెట్టాం. దట్సాల్" సింపుల్‌గా చెప్పింది.

భీమేష్ తల అడ్డంగా ఊపాడు. "ఇంత వరకు నువ్వు చెప్పిన కథలో రాఘవరావు గారి భంగపాటు తప్ప దాక్షిణ్య ప్రమేయం ఎక్కడా లేదు. నాక్కావలసింది దాక్షిణ్యలోని అమాయకత్వాన్ని జయించిన దక్ష ఆత్మ స్థైర్యం, కార్యదక్షతకు దారి తీసిన పరిస్థితులు. శిల లాంటి తన జీవితాన్ని తనకి తానుగా శిల్పంగా మలచుకున్న ఈ కొత్త దాక్షిణ్య వ్యక్తిత్వ వికాసం తాలూకు వివరణ కావాలి" తనకి కావలసిన దానిని స్పష్టంగా అడిగాడు.

"ఎందుకు?" విస్మయం కదిలింది ఆమె గొంతులో.

పెదవి విరిచి తల అడ్డంగా ఊపాడు తెలియదన్నట్లు.

దాక్షిణ్య రెట్టించలేదు. తనని తాను తరచి చూసుకుంటున్నట్లు కొన్ని నిమిషాలు మౌనంగా ఉండిపోయింది. భీమేష్ ఆమెని కదిలించలేదు.

"నాన్నకి మతి స్థిమితం తప్పిందని డాక్టర్ నిర్ధారించారు. చిన్న ఊరు, ఎన్నో ఏళ్ళుగా ఉంటున్న కుటుంబం కావడంతో ప్రతి ఒక్కరూ వచ్చి పరామర్శల పేరుతో, సానుభూతి సాకుతో మాకు ఓదార్పు నివ్వకపోగా గాయాన్ని కెలికి బాధ పెట్టే మాటలని పోయేవారు. ఒకసారైతే మేము లోపల ఏదో పనిలో ఉండగా నాన్న ఒంటరిగా నడుచుకుంటూ దిగుడు బావికేసి వెళ్ళిపోయాడు. ఎవరో పుణ్యాత్ములు చూసి తీసుకొచ్చినా మతి చెడిన మనిషిని పట్టించుకోకుండా వదిలేశామనే నిందలు, నిష్ఠూరాలు తట్టుకోలేని బామ్మ, సుబ్బారావు మాస్టారి సాయంతో ఉన్న కాస్త భూమి, ఇల్లు వచ్చిన ధరకి అమ్మించి మా ముగ్గురి పేరునా వేయించింది. తన మేనల్లుడు గిరీశం హైదరాబాద్‌లో ఉన్నాడని మమ్మల్ని ఆదుకుంటాడనే నమ్మకంతో అతడికి ఓ చిన్న టెలిగ్రాం ఇచ్చి ఒంటరిగా ముగ్గురు ఆడపిల్లలతో, ఓ పసివాడితో బామ్మ హైదరాబాద్ మహానగరంలో అడుగు పెట్టింది.

ఉదయం గడిచి రాత్రయ్యింది. గిరీశం రాలేదు. తెగించిన బామ్మ తన కొంగునున్న అడ్రస్ కాగితంతో ఆటోలో గిరీశం ఇంటిని వెతుక్కుంటూ బయలుదేరాం. తీరా వెళ్ళేసరికి ఆ ఇంటికి తాళం వేసి ఉంది. ఆరాతీస్తే ఢిల్లీ వెళ్ళారు ఎప్పుడొస్తారో తెలియదన్నారు పక్కవాళ్లు. ఎంత బతిమాలినా ఆ చుట్టుపక్కల జనం ఎవ్వరూ మాకు ఆశ్రయం ఇవ్వడానికి ఇష్టపడలేదు. కానీ మమ్మల్ని తీసుకొచ్చిన ఆటోవాలా ముందుకొచ్చాడు "మాజీ, నా పేరు అబ్దుల్లా. నేను ముసల్మానుని. పాతబస్తీలో నా ఇల్లుంది. చిన్న బేటీలతో చీకటితో ఏడకిపోతారు. నా ఇంటికి రండ్రి" అన్నాడు. బామ్మ సనాతన ధర్మం ఓ ముస్లిం ఇంట్లో గడిపేందుకు ఇష్టపడలేదు. అదుగో బహుశా అప్పుడు మీరన్న దక్ష బయటకి వచ్చిందేమో. నాకు తెలియకుండానే బామ్మ చాటు ఉండే నేను స్వయం నిర్ణయం తీసుకోవడమే కాదు. బామ్మని ఆదేశించాను కూడా.

"బామ్మా, మనం అబ్దుల్లాతో వెళ్తున్నాం" అన్నాను దృఢస్వరంతో. ఏమనుకుందో ఏమో సణుక్కుంటూనే బామ్మ నా నిర్ణయా

నికి తల వంచింది. అబ్దుల్లా ఇల్లు చిన్న దైనా మనసు చాలా పెద్దది. ఆ రాత్రికి అతను పెట్టింది తిని ఉన్నచోట సద్దు కున్నాం. ఉదయాన్నే అబ్దుల్లాని తీసుకుని బయలుదేరాను. కానీ గిరీశం కోసం కాదు అద్దె ఇంటికోసం. ఈనాడు మేముంటున్న ఇల్లు ఆనాడు అబ్దుల్లా చూపించిందే. ఓనర్ కొడుకు దగ్గరకి వెళ్ళిపోతుంటే అద్దె కెళ్ళిన మేము కొనుక్కుని భాస్కర్ కుటుంబానికి అద్దెకిచ్చాం.

దేవుడెప్పుడూ కూడా మనిషి రూపంలోనే వస్తాడట. అలా వచ్చిన దేవుడు అబ్దుల్లా. అతనే చిత్రని స్కూల్లో చేర్చేందుకు, నేను కాలేజీలో చేరేందుకు సహకరించాడు. ఇంక మేం గిరీశం ఇంటివైపు కూడా తొంగి చూడ లేదు. ఎఫ్.డి.ల మీద వడ్డీలతో బతుకు బండి మొదలుబెట్టాం. గీత స్నేహం నాకో అండ, ఓదార్పు అయ్యింది. ఇంటి బాధ్యత మెల్లగా నా చేతుల్లోకి తీసుకున్నాను. కాలేజి తరఫున నిర్వహించిన సేవా కార్యక్రమంలో నాకు 'శాంతి నిలయం' గురించి తెలిసింది. మరో ఆలోచన లేకుండా నాన్నని అందులో జాయిన్ చేసేశాను. చదువు పూర్తయ్యింది. ఏం చేయాలన్న దానిపై నాకు ముందు నుంచీ ఓ ఊహ ఉంది. పల్లెటూరిలో పెర గడం వల్ల కావచ్చు పువ్వులంటే అభిమానం, అవగాహనా ఉంది. సిటీలోకి వచ్చిన తర్వాత పుట్టిన పాపాయికి శుభాకాంక్షలు మొదలు మరణించే వ్యక్తులకు తెలిపే కండోలెన్స్‌ల వరకు పువ్వులను అందంగా గుచ్ఛాలుగా పేర్చి అందించే నవీన సంప్రదా యంలో దాగున్న జీవిత సూత్రం అర్థమ య్యింది. దాన్నే వృత్తిగా, ప్రవృత్తిగా చేసుకు న్నాను. ఇదీ మీరు తెలుసుకోవాలనుకున్న దాక్షిణ్య జీవిత పర్వం" రిలాక్స్‌గా వెనక్కి వాలి చిరునవ్వుతో అంది.

"హైదరాబాద్ వచ్చేశాక నీ భర్త గురించి, అతని కుటుంబం గురించి ఎంక్వయిరీ చెయ్యలేదా?

## నీకునూ లోకువైతినా?

రంగస్థలంపై నాటకం రసవత్తరంగా సాగుతోంది.

నందరాజుల ఇంట తీవ్ర అవమానానికి గురై వ్యథచెందుతున్న చాణక్యుడి పాత్రలో రాఘవ నటవైభవం సాగుతోంది. అందరూ తన్మయులై తిలకిస్తూ ఉన్నారు. అంతలో ఎక్కడనుంచి వచ్చిందో ఓ కుక్క నేరుగా రంగస్థలంపైకే ఎక్కి ఆయన ఎందుట నిలబడింది. దాన్ని గమనించి ప్రేక్షకులు ఘొల్లుమన్నారు.

రాఘవ తడబడలేదు. నాటకంలో లేక పోయినా తడుముకోకుండా, 'ఓయీ శునక రాజమా! నీకునూ నేను లోకువైతినా? ఇటేల వేంచేసినాడవు?' అన్నారు.

కుక్కరాక కూడా నాటకంలో భాగమే కాబోలని అల్లరిచేసిన ప్రేక్షకులు నాలుక కొరుక్కున్నారు.




"ఆ అవకాశం, అవసరం రెండూ రాలేదు. ఒకసారి ఇంటి బాధ్యతలు మీదేసుకొన్నాక నా గురించి, నా వైవాహిక జీవితం గురించి ఆలో చించుకొనే తీరికే నాకు దొరకలేదు" పెదవి విరుస్తూ అంది. "కాకపోతే, అప్పుడప్పుడు నా వయసు అమ్మాయిలు భర్త, పిల్లలతో సంతో షంగా తిరగడం చూసినా కాలం గడిచి ఇన్ని సంవత్సరాలైనా నిర్నిమేషంగా ఉండిపోయిన నాన్నగార్ని చూసినా ఎక్కడో ఏదో ఉక్రోషం

ఉబికి వస్తుంది. ఏనాడైనా నా భర్త అని పిలవబడే ఆ వ్యక్తి ఎదురైతే కాలర్ పట్టుకొని చెంపలు వాయించి భర్తగా నీ బాధ్యతను నెరవేర్చడం చేతకానపుడు నా బతుకుతో ఆటలాడే హక్కు నీకెక్కడిదని నిలదీయాలనిపిస్తుంది" అంటూ గట్టిగా నిట్టూర్చి "ఇవన్నీ కేవలం ఊహలు మాత్రమే. ఎందుకంటే, వాస్తవంలో అతనెక్కడున్నాడో, రూపేమిటో, పేరేమిటో కూడా నాకు తెలియదు" నీరసంగా నవ్వుతూ అంది.

భీమేష్ మొహంలో ఏదో వేదన తొంగి చూసింది. పైకి మాత్రం "సిల్లీ నీ భర్త పేరు కూడా నీకు తెలియకపోవడం ఏమిటి? శుభలేఖలోనో ఎవరో ఒకరు పిలవడం వల్లో నీకు తెలిసి ఉండలిగా? " విచిత్రంగా చూస్తూ అడిగాడు.

"నా పెళ్ళికి శుభలేఖలు, సాక్ష్యాలు లేవు. ఎవరో కొందరు అటువైపు ఇటువైపు నలుగురు పెద్దల సమక్షంలో అన్నవరంలో జరిగిపోయింది. ఫొటోలు వీడియోలు లాంటివేవీ లేవు. ఎందుకో మగపెళ్ళివారు ఇష్టపడలేదు అన్నారు. ఇంక పేరంటాలా నాన్న అల్లుడు అనేవారు. అంతా మన దక్ష మొగుడు అనేవాడు ఆc! వాళ్ళమ్మ మాత్రం 'కన్నా' అని పిలిచేది"

"అది మాత్రం ఎలా గుర్తుంది? " నవ్వాడు.

"నా ఫ్రెండ్స్, బంధువులు ఏడిపించేవారు. అతను నల్లగా ఉండేవాడు. మన దక్ష మొగుడు వాళ్ళమ్మ పిలిచినట్లు కన్నయ్య రంగేనే" అంటూ. గుర్తుండడానికి కారణాన్ని వివరించింది.

భీమేష్ కూడా నవ్వేశాడు "మరి, డబ్బు కోసమో గానీ, ఎందుకోసమైనా గానీ అన్ని సార్లు వచ్చాడు. కాస్తయినా రూపం గుర్తు లేదా? " ట్రాఫిక్‌లో జాగ్రత్తగా డ్రయివ్ చేస్తూ అడిగాడు.

దాక్షిణ్యకి చిరుకోపం వచ్చింది "ఆc, మీసం పెట్టి, కళ్ళజోడు తీసేస్తే అచ్చం మీలాగే ఉంటాడు" వెక్కిరింతగా అంది.

భీమేష్ ఎంతగా ఉలిక్కిపడ్డాడంటే, అప్రయత్నంగా సడన్ బ్రేకుతో కారాపేశాడు.

"నిజంగా? " నమ్మలేనట్లు అడిగాడు.

అతని మొహంలోకి ఒకసారి పరీక్షగా చూసి పకపకా నవ్వేసింది. "మరేంటీ లేకపోతే పేరే తెలియదంటే ఇంక రూపేం గుర్తుంటుంది. పైగా అది పల్లెటూరు. అడుగడుగునా అతనెప్పుడొచ్చినా నన్ను నా వాళ్ళ నుండి కాపురం పేరుతో దూరం చెయ్యడానికే వస్తున్నాడన్నట్లు మాట్లాడేవాళ్ళు. దాంతో అతనున్న కాసేపు నేను ఆ పరిసరాలకే వెళ్ళేదాన్ని కాను" చెప్పి "సరే కానీ తమరెందుకు అంత కంగారు పడ్డారు" టీజింగ్‌గా అడిగింది.

భీమేష్ సద్దుకున్నాడు "నీ కన్నాని నేనేనని నా కాలర్ పట్టుకుంటావని భయమేసి" వెక్కిరించాడు. కారు డోరు తెరుచుకు కిందకి దిగుతూ కాస్త పరిశీలనగా వింటే, ఆ మాటల్లో ఏదో ఆశాభంగం ధ్వనించడం గమనించవచ్చు కానీ, దాక్షిణ్య అతని ఫీలింగ్స్ గమనించలేదు "పెద్ద గొప్పే" అందంగా మూతి తిప్పింది

"దిగుతావా? హారతులు పట్టాలా? " మళ్ళీ టీజ్ చేశాడు.

"ఇదేనా మీరు కలవవలసిన వ్యక్తులుండే చోటు" జుట్టు సరి చేసుకుంటూ చుట్టూ కలయచూస్తూ అడిగింది.

"కాదు ఇది హోటల్, ఇప్పుడు టైం రెండవుతోంది. రూమ్ తీసుకొని ఫ్రెష్ అయ్యి భోజనం చేశాక నేను నా క్లయింట్‌ని కలిసి వస్తాను. నువ్వు నేనొచ్చేదాకా విశ్రాంతి తీసుకోవచ్చు" హోటల్‌లోకి నడుస్తూ చెప్పాడు.

రూమ్ తీసుకుని లిఫ్ట్‌కేసి నడుస్తుంటే, సెల్ రింగయ్యింది. నెంబరు చూసి ఆన్ చేసి "శ్రీ... విజయవాడలోనే ఉన్నాం. మూడింటికి కలవాలి అన్నావుగా, భోజనం చేసి వెళ్తాను" చెబుతూనే "దక్షా తాళాలివిగో" చేతిలో గుత్తిని ఆమెవైపు విసిరాడు.

ఉలిక్కిపడ్డాడు శ్రీకాంత్ "దక్ష...? ఆ

అమ్మాయి అక్కడెందుకుంది? " అయోమయంగా అడిగాడు.

"నాలుగు గంటలు ఒంటరిగా కారులో ప్రయాణం బోరు కదా! అందుకే కంపెనీకి సాయం తెచ్చుకున్నాను" కొంటెగా చెప్పి "ఓ.కె. ఈవినింగ్ నేనే ఫోన్ చేసి ఏ విషయం చెబుతాను" అని లైన్ కట్ చేసేశాడు.




"స్ట్రేంజ్" చేతిలో సెల్‌నే విచిత్రంగా చూస్తూ పైకే అన్నాడు. అర్థం కానట్లు చూసింది గీత.

"నీ ఫ్రెండ్ దాక్షిణ్యలో ఏదో మాయ ఉంది. భీమ నాకు ఏడేళ్ళుగా తెలుసు. మొదటిసారి ఢిల్లీ మేనేజ్‌మెంట్ కాలేజిలో తోటి తెలుగు వ్యక్తిగా పరిచయమయ్యాడు. ఇద్దరం కలిసే డిగ్రీలు చేశాం. ఇద్దరం కలిసే ఎమ్.బి.ఎ. చేసి లండన్ వెళ్ళాం. చదివే సబ్జెక్టు, అప్రంటీస్‌గా చేసే జాబ్ అన్నీ ఒకేచోట చేశాం. ఒకే రూమ్‌లో ఉన్నాం. ఉన్నది షేర్ చేసుకుని తిన్నాం" చెబుతూ టేబుల్ అంచున కూర్చుని వింటున్నావా అన్నట్లు గీతకేసి చూశాడు.

"అయితే!? " అడిగింది.

"ఎందుకో ఆడ పిల్లలతో స్నేహం, పరిచయాలంటే అయిష్టంగా ఉండేవాడు. కనీసం చాటింగ్‌కి కూడా ఇంట్రస్టు చూపించేవాడు కాదు. అదేదో తనకి నిషిద్ధమన్నట్లు, ఆ అర్హత తనకి లేనట్లు మాట్లాడేవాడు. అలాంటిది నీ ఫ్రెండ్ ఏం మాయ చేసిందో విజయవాడ దాకా ఆమెని తీసుకొని వెళ్ళాడు. అదీ జస్టు కంపెనీ కోసమట. నాకింకా ఆశ్చర్యంగానే అన్పిస్తోంది". అతని గొంతులో ఆ ఆశ్చర్యం తొంగి చూసింది.

గీత మాత్రం పెదాలు బిగించి సీరియస్‌గా చూసింది. "సార్, ఓ మాట చెప్పనా? ఒక ఫ్లోరిస్టుగా దక్ష మీ అగ్రిమెంట్ ప్రకారం పని చెయ్యకపోతే నిలదీసే అధికారం మీకుంది. అలాగే ఒక కోపార్ట్‌నర్‌గా భీమేష్ తన ఆఫీసు విధులను సరిగా నిర్వహించకపోయినా మీరు ప్రశ్నించవచ్చు. కానీ వాళ్ల వ్యక్తిగత జీవితంలోకి మనం తొంగి చూసి కూపీ లాగడం తప్పు కదూ!" సూటిగా అడిగింది.

ఇబ్బందిగా నవ్వాడు శ్రీకాంత్. "నో, నో గీతా, నువ్వు అపార్థం చేసుకుంటున్నావు. భీమేష్‌తో హఠాత్తుగా దాక్షిణ్య కారణంగా ఇంత మార్పు ఎలా వచ్చిందనే ఆశ్చర్యమే తప్ప నేను వాళ్ల వ్యక్తిగత జీవితానికి అడ్డు రావాలనుకోవడం లేదు. పోనీ యాజ్ ఎ ఫ్రెండ్, నువ్వు చెప్పు దక్ష భీమేష్‌ని ఇష్టపడితే నువ్వు ఆమెని ప్రోత్సహిస్తావా? "

చేతిలో పెన్సిల్‌ని గుండ్రంగా తిప్పుతూ "దక్ష జీవితం ఎప్పుడూ చిరునవ్వులతో, సంతోషంతో అది ప్రేమించే పువ్వుల్లా కళకళలాడాలని కోరుకునే వ్యక్తుల్లో నేను మొదటిదాన్ని సార్. భీమేష్ ఆమెకు ఆ అదృష్టాన్ని, ఆనందాన్ని అందిస్తారంటే నేనే దగ్గరుండి వాళ్లని ఒకటి చేస్తాను" చెప్పింది.

చకితుడైనట్లు ఉండిపోయాడు శ్రీకాంత్. మొదటిసారి గీతను తన దగ్గర జీతానికి పనిచేసే వ్యక్తిగా కాక నిర్మలమైన స్నేహతత్వం, నిండైన ఆత్మ స్థైర్యం కలిసిన అందాల యువతిగా గుర్తించినట్లు ఆమెనే పరిశీలనగా చూస్తుండిపోయాడు.

అతని చూపులు తెలియని ఇబ్బంది కలిగించడంతో "ఓ.కె. సార్, నేను వెళ్ళి టెండర్ ప్రిపేర్ చేస్తాను" చేతిలో కాగితాలతో పైకి లేచింది.

"ఒక్క నిమిషం" డోర్ దాకా వెళ్ళిన ఆమెను ఆపాడు. తిరిగి చూసింది.

"నువ్వు చూపించే ఈ స్నేహతత్వం కేవలం దక్ష ఆడపిల్ల కనుక ఆమెకి మాత్రమే పరిమితమా? " సందేహంగా అడిగాడు.

విచిత్రంగా చూసి ఫకాల్న నవ్వేసింది గీత. "సార్, స్నేహం వ్యాపారం కాదు. ఆడా, మగ, స్థాయి, అంతస్థు, అర్హత వగైరా వగైరా చూసి చెయ్యడానికి. మన మనసుకి దగ్గరగా వచ్చే ఎవరితోనైనా స్నేహం స్వచ్ఛంగానే చేస్తాం" చెప్పి వెళ్ళిపోయింది.

శ్రీకాంత్ మాత్రం అలాగే ఆలోచిస్తూ కూర్చుండిపోయాడు. మరో అర గంటకి గీత టేబుల్ కి ఫోన్ చేసి, "ఇందాకా నువ్వు చెప్పిన దాంట్లో, స్నేహం ఒక్కటే మనసుకి దగ్గరగా వచ్చే వ్యక్తులతో స్వచ్ఛంగా చెయ్యగలమా? ప్రేమైతే కుదరదా? " అడిగాడు.

"ఏమయ్యింది ఇతనికి ఇలాంటి ప్రశ్నలేస్తున్నాడు" ఆశ్చర్యంగా అనుకుంటూ "మే బీ సార్. ప్రేమైనా అంతేననుకుంటాను. ఎందుకంటే అదీ మనసు ద్వారా జరిగే అసంకల్పిత చర్య కదా!" పైకి మాత్రం సమాధానంగా అంది. శ్రీకాంత్ ఫోన్ పెట్టేశాడు.

గీత లంచ్ చేసి రాగానే మళ్ళీ మోగింది "నేను శ్రీకాంత్"- వచ్చేటప్పుడు దారిలో ఏ దిష్టి గుమ్మడికాయ మీదో కారు నడుపుకు వచ్చేసి ఉంటాడు. గంటకోసారి తినేస్తున్నాడు అనుకుంటూ "చెప్పండి సార్" అడిగింది. టేబుల్ పైకి ఎక్కి కూర్చుని.

"ఇది కొంచెం నీ పర్సనల్. ఏమీ అనుకోకు. నువ్వు ఎవర్నయినా, ఎవరైనా నిన్ను ప్రేమించారా? " తడబడుతూ తడుముకుంటూ అడిగాడు.

"సార్...? " అర్థంకానట్లు రెట్టించింది.

"ఆహా! నీకు అభ్యంతరం లేకపోతేనే చెప్పు" నసిగాడు.

గీత కాస్త సర్దుకుంది "ఇప్పటివరకు నాకంత సీన్ లేదు సార్" పెదవి విరిచి తల అడ్డంగా ఊపింది.

"థాంక్స్, థాంక్యూ వెరీ మచ్" సంతోషంగా అంటూనే "గీతా, నా పైన నీ అభిప్రాయమేమిటి? " అడిగాడు.

మాట్లాడేది ఫోన్ అయినా, శ్రీకాంత్ ఏం మాట్లాడేది ఇతరులకు వినపడదు అని తెలిసినా చాలా ఇబ్బందిగా, అంతా తననే పట్టి పట్టి చూస్తున్న ఫీలింగ్ తట్టుకోలేక, "సార్, స్టాఫ్ అంతా నన్నే చూస్తున్నారు. ఈ ప్రశ్న లేంటి సార్! ప్లీజ్ మీరు మరోలా అనుకోవద్దు. ఫోన్ పెట్టేస్తున్నాను. నవ్వు మొహం పెట్టి గొణుగుతున్నట్లు చెప్పి, "ఓ.కె.సార్, ఫైల్ రెడీ సార్. సరే సార్" అని గట్టిగా అంటూ ఫోన్ పెట్టేసి రిలాక్స్‌గా గాలి పీల్చుకొని కూర్చుని 'ఈ రోజుకి ఆఫ్‌డే లీవ్ పెట్టి వెళ్ళకపోతే బాస్ తిక్క ప్రశ్నలతో నా తల తినేసేలా ఉన్నాడు' గొణుక్కుంటూ ఓ తెల్ల కాగితం తీసి లీవ్ లెటర్ రాయడానికి సిద్ధపడుతుంటే శ్రీకాంత్ కేబిన్ గుమ్మం దగ్గర ప్రత్యక్షమై,

"గీతా, మనం సైట్ దగ్గరకి వెళ్ళాలి కమ్ విత్‌మి" కమేండింగ్‌గా పిలిచాడు.

గతుక్కుమన్నట్లు చూస్తూ, "సార్, తలనొప్పిగా ఉంది. నేను ఇంటికి వెళ్ళిపోదాం అనుకుంటున్నాను" నంగి నంగిగా అంది కళ్ళు చిట్లించి చుస్తూ. శ్రీకాంత్ వ్యతిరేకించలేదు.

"దెన్ ఓ.కె. నాతో రా, నిన్ను దింపేసి నేను సైట్ దగ్గరకి వెళ్తాను" పిలిచాడు.

ఇరుక్కుపోయినట్లయి తప్పనిసరిగా హేండ్ బ్యాగ్ భుజానికి తగిలించుకుని తల వంచుకొని బయలుదేరింది. కారు బయలుదేరే వరకు మౌనంగా ఉన్న శ్రీకాంత్ "నా గోల తట్టుకోలేక వెళ్ళిపోతున్నావు కదూ!" అడిగాడు.

"లేదుసార్, నిజంగానే" నసిగినట్లు బదులిచ్చింది.

"సరే, నా మీద నీ అభిప్రాయం చెప్పు వదిలేస్తాను"

"మీకేం సార్, సామర్థ్యమున్న వ్యాపార

వేత్త. సిబ్బంది మంచి చెడ్డలు గ్రహించే మంచి బాస్".

చెబుతుండగానే "గీతా ప్లీజ్, నాక్కావలసింది ఒక సెక్రటరీగా నాపై నీ అభిప్రాయం కాదు. ఒక ఆడపిల్లగా నాలాంటి మగాడి పట్ల నీ అభిప్రాయం ఫ్రాంక్‌గా చెప్పు"

"జీవితంలో కష్టపడకుండానే అన్నీ అమరినా, లేజీగా కూర్చుని తినాలనే కోరిక లేదు. జీవితాన్ని అనుభవిస్తారు కానీ విచ్చలవిడిగా కాదు. కుటుంబాన్ని ప్రేమిస్తారు. స్నేహానికి విలువిస్తారు. ఇవి మీ బలాలు" చెప్పడం ఆపింది.

"వేరీగుడ్, మరి బలహీనతలు" ఉత్సాహంగా అడిగాడు.

"బుర్రలో పడే ఆలోచన వెంటనే ఆచరణలోకి వచ్చేయ్యాలని ఆత్రపడతారు. స్వయం నిర్ణయశక్తి ఉన్నా ఎక్కువ భీమేష్ మీద ఆధారపడిపోతారు. డబ్బు తాలూకు అహం 'న్యూవే' ఛైర్మన్ అనే దర్పం ప్రదర్శించేందుకు తాపత్రయపడతారు. ఈ రెండేళ్ళలో నేను గమనించిన అంశాలైతే ముఖ్యంగా ఇవే" విశ్లేషిస్తున్నట్లు చెప్పింది.

శ్రీకాంత్ మొహంలో సంతోషం తొంగి చూసింది. "ఓ.కె. మరి నాలాంటి వ్యక్తిని ప్రేమించడానికి, పెళ్ళిచేసుకోడానికి ఏ ఆడపిల్లైనా ఇష్టపడుతుందా? " రెండు క్షణాలు శ్రీకాంత్‌నే పరిశీలనగా చూసి తనని తాను నెత్తిమీద చిన్నగా కొట్టుకుంది "ఛ మట్టిబుర్ర ఇందాకటి నుండి ఏమిటీ ప్రశ్నలు అనుకుంటున్నా కానీ ఎందుకు అడుగుతున్నారని ఆలోచించనే లేదు. నా కర్థం అయ్యింది లెండి సార్. మీరు ఎవరో అమ్మాయిని లవ్ చేస్తున్నారు. తీరా మీరు ఐ లవ్ యూ చెప్పాకా కాదంటుందేమో ననేభయంతో ముందు ఆ అమ్మాయి అడిగే ప్రశ్నలన్నీ నా దగ్గర క్లియర్ చేసుకుంటున్నారు. యామైరైట్ సార్? " ఉత్సాహంగా అడిగింది.

"నీ ఆలోచనలెప్పుడూ రైటే! మరీ చెప్పు. ఏ అమ్మాయి అయినా నన్ను ఇష్టపడుతుందా? "

"ఊరుకోండి సార్. ఏ అమ్మాయి అయినా మీకు "ఐ లవ్ యూ" చెప్పడం తన అదృష్టంగా భావిస్తుంది" గీత చెబుతుండగానే పక్కగా ఓ ఆటో బయ్యిన హారెన్ మోగించుకుంటూ దూసుకుపోయింది.

"ఏమనీ..." వినపడనట్లు గట్టిగా అడిగాడు.

కాస్త దగ్గరగా జరిగి "ఐ లవ్ యూ" కొద్దిగా బిగ్గరగా చెప్పింది.

"ఓం! థాంక్యూ గీతా, ఐ టూ" చెప్పి ఆమె కుడిచేతిని పెదాలకు ఆన్చుకొని చిన్నగా ముద్దు పెట్టుకున్నాడు.

తుళ్ళిపడ్డట్టు చేతిని గభాలున లాక్కొని "సార్? " నమ్మలేనట్లు అంది.

ఆమె వైపు తల తిప్పి చిన్నగా నవ్వాడు. మెల్లగా మైకం వీడినట్లు తేరుకుంటూ తల అడ్డంగా ఊపింది. "వద్దు సార్, నా గురించి మీకేం తెలియదు. పెళ్ళి, ప్రేమ చాలా పెద్ద బాధ్యతలు, బంధాలు. పైపై మెరుగులకి ఇష్టాలు పెంచుకోవడం మంచిది కాదు" గంభీరంగా అంది.

శ్రీకాంత్ తొందరపడలేదు "వ్యక్తిగా నీ స్వభావం నాకు రెండేళ్ళగా తెలుసు. ఇక నీ వ్యక్తిగత జీవితం అంటావా? మంచైతే ఎప్పటికీ నీ సుగుణంగా నీతోనే వస్తుంది. చెడైతే నిజంగానే అది గడిచిపోయిన గతం. దానిని తరచి చూసుకోవలసిన అవసరం మనకి లేదు. నేను నీకు నచ్చానా లేదా అన్నది మాత్రమే. ఈ క్షణాన నాకు కావలసిన సమాధానం"

ఏం సమాధానం చెప్పాలో తోచనట్లు ఉండిపోయింది గీత. వాళ్ళు వెళ్ళవలసిన సైట్ రావడంతో "నువ్వు ఇక్కడే ఉండు. నేను కాంట్రాక్టర్ని కలిసి వస్తాను" అని శ్రీకాంత్ కారుని ఓ పక్కగా పార్కుచేసి దిగి వెళ్ళిపోయడు.

"దక్షా, ఈ క్షణాన నా పక్కన నువ్వుంటే

## మూడ్... మూడ్... ఫుడ్ మూడ్!



మూడ్ ఉన్నప్పుడు రాసే వాళ్ళని, మూడ్ ఉన్నప్పుడు పాడే వాళ్ళని, మూడ్‌ని బట్టి పని చేసే వాళ్ళని చూశాం గానీ, మూడ్‌ని బట్టి ఫుడ్డు తినడమంటే అదీ పని వత్తిడి తగ్గించుకోవడానికి ఫుడ్డు తినడమంటే ఏదో వింతగానే అన్పిస్తుంది. కదూ!

బాస్‌తో మీటింగా? ! టెన్షన్ టెన్షన్... అయినా భయపడకండి. మీటింగ్‌కి ముందు ఒకటి,రెండు గంటల ముందు కార్బోహైడ్రేట్లు ఎక్కువగా ఉండే స్నాక్స్ తింటే ఆ తర్వాత మీ బాస్‌నైనా, భార్యనైనా ధైర్యంగా ఎదుర్కో వచ్చుట. "ఆల్కహాలిజమ్, క్లినికల్ & ఎక్స్ పిరిమెంటల్ అనే అంశంపై పరిశోధన జరిపిన శాస్త్రవేత్తలు మెదడులో ఉండే సెరటానిన్ ప్రమాణాల్లో అసమానతలుండటం వల్లనే డిప్రెషన్, ఉద్వేగం, కోపం కల్గుతాయంటున్నారు. కాని కార్బోహైడ్రేటెడ్ డైట్ అంటే విత్తనాలు, బీన్స్ వంటివి- తినడం వల్ల మెదడులోని సిరటానిన్ ప్రమాణాలు పెరిగి వత్తిడి తగ్గుతుందంటున్నారు.

ఆకు కూరలతో చేసిన సలాడ్‌లో B6 విటమిన్లు ఎక్కువగా ఉంటాయి. వీటివల్ల ఫీల్ గుడ్ హార్మోన్లు అంటే సిరోటినిన్, జోపమైన్, నోర్ పైన్ నెఫ్రీన్ వృద్ధవుతాయట. ఈ B6 విటమిన్లు తక్కువగా ఉంటే... టెన్షన్, డిప్రషన్ పెరుగుతాయంటున్నారు... జర్నల్ ఆఫ్ న్యూరో సైన్స్ రిసెర్చి ఆఫ్ నర్సింగ్ పరిశోధకులు. విటమిన్ 'సి' తీసుకోవడం వల్ల వత్తిడి తగ్గించే స్ట్రెస్ హార్మోన్ల ఉత్పత్తి ఆగిపోతుందని అలాబామా యూనివర్సిటీ శాస్త్రజ్ఞులు చెబుతున్నారు. అలాగే చేపలు, చాక్లెట్స్, పళ్ళు వంటివి మీలో పెరిగే వత్తిడిని తగ్గిస్తాయనీ అంటున్నారు.

ఆc.. మీకూ మూడొచ్చినట్టుంది.. ఫుడ్డు కోసమేనా!

ఎంత బాగుండును" బాధగా అనుకుంటుంటే, ఆమె దృష్టి శ్రీకాంత్ కోటులోంచి జారిన సెల్‌ఫోన్ మీద పడింది. ఆత్రంగా తీసి, దాక్షిణ్య సెల్‌కి రింగ్ చేసింది.

* * *

సాయంత్రం ఐదు గంటలవుతోంది. పరిమళా ఫ్లోరిస్ట్సు షాపు ముందు పోలీసు జీపు వచ్చి ఆగింది. ఎకౌంట్స్ రాస్తున్న భాస్కర్ ఆసక్తిగా చూశాడు. లోనికి వచ్చిన గౌతమ్ తిన్నగా భాస్కర్ దగ్గరకి వెళ్ళి "ఈ షాపు మీ సొంతమా?" అడిగాడు.

"అవును సార్" బదులిచ్చాడు.

ఒక కుర్చీ లాక్కుని కూర్చుని "నిన్న సాయంత్రం మీ దగ్గర ఎవరైనా బాస్కెట్ బొకే ఆర్డర్ చేసి ఉంటే వాళ్ళ వివరాలు కావాలి" అడిగాడు.

రిజిస్టరు బుక్కుతీసి ద్విజేంద్రసింగ్ ఇచ్చిన వివరాలు, ముందురోజు బాస్కెట్ బొకేలు ఆర్డర్ ఇచ్చిన ఇతర వ్యక్తుల వివరాలు చూపించాడు. ఆ బుక్కుని సీజ్ చేసిన గౌతమ్ "చూడండి అవసరమైతే మీరు మా చీఫ్ పిలిచినపుడు స్టేషన్‌కి

రావల్సి ఉంటుంది" చెప్పాడు.

"ఎందుకు సార్, ఏం జరిగింది" అర్థం కానట్లు అయోమయంగా అడిగాడు.

"మీకు తెలియదా? నిన్న సాయంత్రం ముంబాయి ఫ్లయిట్‌కి వెళ్తున్న హోమ్ మిని స్టర్‌ను ఎవరో బాస్కెట్ బొకేలో టైమ్ బాంబు పెట్టి ఫ్లయిట్‌తో సహా పేల్చేయడా నికి ప్రయత్నించారు. అదృష్టవశాత్తూ అది ఏ కారణంగానో హోమ్ మినిష్టరు కారులో పేలడం వల్ల పెద్ద ప్రమాదం, ప్రాణా పాయం తప్పింది. కానీ బాంబు బొకేలో పెట్టారని మాత్రమే మా ఎంక్వయిరీలో తేలడం వల్ల ఇలా ప్రతీ ఫ్లోరిస్టుని కలవాల్సి వస్తోంది" బయటకి నడుస్తూ చెప్పాడు.

ఇన్‌స్పెక్టర్ చెప్పేది వింటూ నిలబడి పోయిన భాస్కర్ తేరుకుని హడావిడిగా కూడా వస్తూ "ఎంక్వయిరీకి రావాలీ, అదీ అంటున్నారు. షాపు పెట్టాకా ఎవరెవరో వచ్చి ఆర్డర్ ఇస్తారు. వాళ్ళు కోరినట్లు అలం కరించి ఇవ్వడం తప్ప వాళ్ళు అందులో బాంబులు పెడతారో, పాములు పెడతారో మాకెలా తెలుస్తుంది సార్" నసిగినట్లు అడి గాడు.

జీప్ ఎక్కబోయిన గౌతమ్ తిరిగి చూసి చిరునవ్వు నవ్వాడు. "డోంట్‌వర్రీ. తప్పని సరికాదు. అవసరమైతే మనిషిని పంపి స్తాం. మేము అడిగిన వివరాలు చెబితే చాలు" అంటూ ఎక్కబోయి "పరిమళా" ఫ్లోరిస్ట్స్ అనే ఇంగ్లీషు అక్షరాలతో ఉన్న షాపుపేరు ఆకర్షించడంతో "మీ షాపు పేరు మీ వృత్తిని ప్రవృత్తిని చాటేలా చాలా బాగుంది. సాయంత్రం మా ఎస్.పి.గారి మేరేజ్‌డే. ఒక బొకే గౌతమ్ పేరుతో మా ఆఫీసుకి పంపిస్తారా? " అడిగాడు.

భాస్కర్ ఆశ్చర్యపోయాడు. "అదేమిటి సార్, ఇప్పుడే ఐదు దాటింది. ఆర్డినరీ బొకేకి మళ్ళీ లేటు ఎందుకు. ఉండండి" అని సుజాతను పిలిచి ఎర్రగులాబీల బొకే తెప్పించి ఇచ్చాడు. దాని మీద ఉన్న 'పరి మళ' స్టిక్కర్‌ని గమనించి డబ్బులు తీసి ఇవ్వబోయాడు. కానీ భాస్కర్ పుచ్చుకో లేదు. బలవంతాన అతని చేతిలో పెట్టి బొకేతో సహా ఇంటలీజెన్స్ కార్యాలయం వైపు బయలుదేరాడు గౌతమ్.




"సారీ... రావడం లేటయ్యింది కదూ! బాగా బోర్ కొట్టిందా...? " సోఫాలో కూర్చుని షూస్ విప్పుకుంటూ అడిగాడు.

టివిలో చూస్తున్న కార్టున్ షో ఆఫ్ చేసి మంచినీళ్ళు గ్లాసులో పోసి తెచ్చి ఇస్తూ "అదేం లేదు. మీరు వెళ్ళగానే గీత ఫోన్ చేసింది. చాలా సేపు మాట్లాడింది. అసలు టైమే తెలియలేదు. చెప్పి... "కాఫీ ఆర్డర్ ఇవ్వనా? " అనడిగింది దాక్షిణ్య.

"వస్తోంది కానీ నువ్వు నాకో ఉపకారం చెయ్యి. అలా "మీరు, అండీ" అనే గౌరవాచ కాలు మానేసి నువ్వు అనే పిలు. మనసు విప్పి చెప్పుకునే ఫ్రెండ్స్ అయ్యాక కూడా మన్నింపులు ఎబ్బెట్టుగా ఉంటాయి" షర్టు పైబటన్స్ విప్పి వెనక్కి తీసుకుంటు అన్నాడు.

"ఓ.కె. నీ ఇష్టం" అంగీకారంగా తలూ పుతూ అరే, ఇంతకీ, గీతేం చెప్పిందో చెప్పనే లేదు కదా! వింటే చాలా షాకవుతారు. అని నవ్వేసి "సారీ మీ ఫ్రెండ్ శ్రీకాంత్ గీతని ఐ లవ్ యూ చెప్పమని ఫోర్స్ చేస్తున్నా డట. ఏం చెయ్యమంటావు అంటూ నన్నడు గుతోంది"

అది వింటూనే తాగుతున్న నీళ్ళు గొంతు దిగినట్లు పొలమారింది భీమేష్‌కి.

తమాయించుకుని మిగిలిన నీళ్లు గట్టిగా గుటక వేస్తూ "ఏమిటి...?" నమ్మలేనట్లు ప్రశ్నించాడు.

దాక్షిణ్య ఎదురుగా టీపాయ్ మీద కూర్చుని మళ్ళీ చెప్పింది. ఆమె కళ్ళలో ఓ సంతోషం, ఓ అల్లరి దోబూచులాడుతున్నట్లు కనిపించింది.

"నువ్వేం సలహా ఇచ్చావు...?" వెనక్కివాలి అడిగాడు.

"నేనా...? జీవితం దానిది. నేనేం సలహా ఇస్తాను. కాకపోతే దాని లైఫ్‌లోని విషాదం రేపు దాని పిల్లల విషయంలో ఎదురవ్వకుండా ముందే వివరంగా మాట్లాడుకోమన్నాను" బాయ్ ట్రేతో రావడంతో లేచి పక్క సోఫాలో కూర్చుంది.

అతను వెళ్ళేదాకా ఆగి "గీత జీవితంలో విషాదం ఏముంది?" అడిగాడు, ఒకింత ఆశ్చర్యంగా. చెప్పాలా వద్దా అన్నట్లు రెండు నిమిషాలు సంకోచించి లేచి పాట్‌లోని "టీ" కప్పులో పోసి అందిస్తూ "మీరంతా అనుకున్నట్లు గీత దిక్కులేనిది, తన పొట్ట తిప్పలకోసం ఉద్యోగం చేసుకొని బతికే అమ్మాయి కాదు. ఆ మాటకొస్తే గీతకి సెక్రటరీగా వచ్చే అరవై వేల సంవత్సరాదాయం ఆమె డిపాజిట్లపై వచ్చే నెలసరి వడ్డీకన్నా కూడా తక్కువ. గీత పేరెంట్స్ చాలా డబ్బున్నవాళ్ళు. కాకపోతే డబ్బుతో పాటు 'ఈగో' పిచ్చి కూడా ఎక్కువవ్వడంతో గీత ఐదేళ్ళ వయసులో చట్టబద్ధంగా విడిపోయారు. ఇద్దరూ ఐశ్వర్యవంతులవ్వడంతో కోర్టు గీత చదువు, పెంపకం బాధ్యత సమానంగా పంచుకోవాలని ఆదేశించింది. గీతని రెసిడెన్షియల్ స్కూల్స్‌లో హాస్టల్స్‌లో ఉంచి ఖర్చులు పంచుకుంటూ అప్పుడప్పుడొచ్చి అమ్మా నాన్నలమని గుర్తు చేస్తూండే వారట. క్రమంగా వాళ్ళు వేరొక పెళ్ళిళ్ళు చేసుకొని ఆ బాధ్యతల్లో మునిగి గీతని నిర్లక్ష్యం చేస్తే కేర్‌టేకర్ మరోసారి కోర్టు ద్వారా వాళ్ళకి నోటీసులు ఇప్పించింది. దాంతో చెరో పాతిక లక్షలు గీత ఖర్చులకు చెల్లించమని కోర్టు ఆదేశిస్తే బ్యాంకులో డిపాజిట్ చేసి చేతులు దులుపుకున్నారు. పిల్లలకి, కన్నవాళ్ళకి మధ్య ఉండవలసిన ఎంతో అపురూపమైన బంధాన్ని తమ ఐశ్వర్యమదానికి బలిచేసిన తల్లితండ్రుల ప్రవర్తన పట్ల ఏహ్యాభావనతో తనకి ఊహ తెలిసిన దగ్గర నుండి తను ఖర్చుపెట్టే ప్రతీ రూపాయి తన సొంతమై ఉండాలనే మొండితనంతో పెరిగింది గీత. అందుకోసం నీళ్ళ బిందెలు మోసేది, ప్రైవేట్లు చెప్పేది, జాబ్ వర్కులు చేసేది. ఎన్ని కష్టాలైనా ఇష్టంగా భరించింది కానీ ఆమె పేరెంట్స్ ఇచ్చిన డబ్బు పైసా కూడా సొంతానికి వాడుకోలేదు. కాకపోతే ఆ వడ్డీలను అనాథ ఆశ్రమాలకు, సేవా కార్యక్రమాలకు విరాళాలు ఇచ్చేసి తృప్తి పడుతుంది"

**అపురూపమైన బంధాన్ని తమ ఐశ్వర్యమదానికి బలిచేసిన తల్లితండ్రుల ప్రవర్తన పట్ల ఏహ్యాభావనతో తనకి ఊహ తెలిసిన దగ్గరనుండి తను ఖర్చుపెట్టే ప్రతీ రూపాయి తన సొంతమై ఉండాలనే మొండితనంతో పెరిగింది**

"అంటే గీతకి కన్నవాళ్ళంటే ఉండే ద్వేషంతో పెళ్ళిని కూడా ద్వేషిస్తోందా?" సందేహంగా అడిగాడు.

"లేదు, లేదు. గీతకి పెళ్ళంటే ద్వేషం కాదు భయం. చిన్నతనం నుండి స్వతంత్ర భావాలతో పెరిగిన తను భర్త అనే పరాయి వ్యక్తి ఆధిపత్యాన్ని భరించలేక విడిపోతే, మరోసారి తన పిల్లలు కూడా తనలాగే ఒంటరితనం, అభద్రతాభావం లాంటి ఇరుకు మనస్తత్వంలో నలిగిపోతారేమోననే

భయం. శ్రీకాంత్ ఆ ఒక్క విషయంలోనూ గీతకి భరోసా ఇవ్వగలిగితే చాలు, మిగతా అన్ని విషయాల్లోనూ గీత మామూలు అమ్మాయే. తనదైన ఇల్లు, ప్రేమించే భర్త, పిల్లలతో కూడిన సంసారాన్ని ప్రేమించే సగటు ఆడపిల్ల"

మైమరచినట్లు చెబుతున్న దాక్షిణ్య కళ్ళలో మెరుపును గమనించి "ఐ ఫీల్ జెలసీ. మీరిద్దరూ ఒకరికోసం ఒకరు పుట్టిన అప్సరాళ్ళు. గీత నీ గురించి మాట్లాడే ప్రతి మాటలో నీ సుఖం, సంతోషం అనుక్షణం కోరుకునే స్నేహశీలి కనిపిస్తుంది. మిమ్మల్ని చూస్తుంటే అంతా గొప్పగా పొగిడే శ్రీకాంత్, నా స్నేహం కూడా తక్కువే అనిపిస్తుంది"

దాక్షిణ్య కళ్ళెత్తి చూసి "నా స్నేహంలోని స్వచ్ఛత నాకు తెలియదు. కానీ గీత మాత్రం వేలల్లో ఒకరికి దొరికే అరుదైన అదృష్టం" మాటల్లో ప్రేమ తొణికిసలాడు తుండగా అంది.

"గీత మాత్రం ఆ అదృష్టం నువ్వే అంటుంది. ఇప్పుడు నేనూ కోరుకుంటు న్నాను. నాకూ ఆ అదృష్టం జీవితాంతం నాతో ఉండాలని, ఒప్పుకుంటావా?" అడిగాడు. అతను మాట్లాడేది దేని గురించో అర్థం కానట్లు చూసింది.

"మరీ అంత అమాయకంగా మొహం పెట్టొద్దు" పైకి లేచి చేతులు జేబులో పెట్టుకుని పచార్లు చేస్తూ. "పన్నెండేళ్ళ వయసులో జరిగే పెళ్ళికి చట్టపరమైన గుర్తింపు లేదని నీకు తెలుసు. పోనీ భర్తగా మరచిపోలేకపోవడానికి అతనితో నువ్వు పంచుకున్న జ్ఞాపకాలు ఏమీలేవని నాకు తెలుసు. ఎన్నో ఏళ్ళుగా ఉనికి లేని మనిషి ఉన్నాడో, పోయాడో, వస్తాడో, రాడో ఎన్నాళ్ళని ఎదురు చూస్తావు? నీ వ్యక్తిత్వం మనస్తత్వం నాకు నచ్చాయి. నీకు అభ్యంతరం లేకపోతే మనిద్దరం పెళ్ళి చేసుకుందాం" దగ్గరగా వచ్చి ఆమె కాళ్ళ దగ్గర కూచుని ఆశగా అడిగాడు.

అతని మాటల్ని జాగ్రత్తగా వింటున్న దాక్షిణ్య పెదాలపై చిరునవ్వు కదిలింది. "ఏంటీ, హఠాత్తుగా నారీ జనోద్ధరణకి నడుం కట్టారు. గురజాడవారు కనిపించారా, వీరేశలింగం ఆవహించారా? నా బతుకు సరిదిద్దేందుకు మీ బతుకును పణం పెడతానంటున్నారు" ఆమె గొంతులో హేళన ధ్వనించింది.

"దక్షా, స్టాపిట్. ఐయామ్ సీరియస్" అసహనంగా అన్నాడు.

విసురుగా లేచింది. "ఐయామ్ ఆల్సో, నా కథ విని పూర్తిగా ఒక్క



పూట కాకుండానే నాపైన ప్రేమ పుట్టుకొచ్చేసిందా? మీ జాలి, దయ ఆశించి మీకు నా గతం చెప్పలేదు. మంచో, చెడో చాలాసార్లు మీరు నాకు సాయపడ్డారు. స్నేహితుడిగా భావించమని అడిగారు కాబట్టి నా సంఘర్షణ చెప్పాను అంతే. అంతకు మించి మీకేదో దగ్గరయ్యే ఉద్దేశం నాకు లేదు.

మీకుంటే మార్చుకోండి, లేకపోతే ఇక్కడితోనే మన పరిచయం, స్నేహం ఆగిపోతాయి" హెచ్చరికగా అంది.

భీమేష్ కూడా లేచి దగ్గరగా వచ్చాడు. "ఏం ఎందుకని...? నేనేం నిన్ను స్నేహం ముసుగులో వంచించాలనుకోవడం



లేదు. గౌరవంగా పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాను. ఇందులో తప్పేం ఉంది? " నిలదీశాడు.

విసిగిపోయినట్లు చూసిన దాక్షిణ్య, "తప్పా, ఇదిగో ఇది" అంటూనే పైట చాటునున్న బంగారు గొలుసుకి కట్టిన తాళిని తీసి చూపిస్తూ, "ఇప్పటికే ఈ తాళి శాస్త్రోక్తంగా ఒక మగాడి చేత నా మెడలో చేరింది. ఇది విలువ లేనిదని తీసిపారేసి మళ్ళీ నువ్వు ఇంకోటి కడతానంటున్నావు. రేపు ఏదో కారణం చేత నువ్వు దూరమైతే ఇంకోడెవడో రాగానే ఇదీ తీసిపారేసి ఇంకోటి కట్టించుకోవాలా...? " హేళనగా అడిగింది.

ఏం బదులివ్వాలో తోచనట్లుండిపోయాడు భీమేష్.

"నా దృష్టిలో పెళ్ళి అంటే కట్టిన మగాడి వల్లో, కట్టించుకున్న ఆడదాని వల్లో వచ్చే కొత్త బంధం కాదు. తొలిసారి రెండు నిమిషాల పెళ్ళి చూపుల్లో ఒకరినొకరు చూసుకునే ఇద్దరూ స్త్రీ పురుషుల్ని నూరేళ్ళపాటు ఒకరినొకరు ప్రాణంగా బతికేలా చేసే సనాతన వ్యవస్థ. ఎవరి వ్యక్తిగత అవసరాలు తీర్చుకోడానికే దానిని మీరకపోవడమే మన బాధ్యత"

"నువ్వనుకున్నట్లు నీ భర్తా అనుకోవాలిగా, ఈ పాటికి అతనింకో పెళ్ళి చేసుకుని ఉంటే, ఏం చేస్తావు? " వెక్కిరింతగా అడిగాడు.

రెండు నిమిషాలు ఆలోచిస్తున్నట్లు చేతులు కట్టుకొని ఉండిపోయింది.

వెళ్ళి సోఫాలో కూర్చుని కాళ్ళు టీపాయ్ మీద బార చాపి "ఆ విషయం నాకు ఖచ్చితంగా, నిర్ధారణగా తెలిస్తే తప్పకుండా మళ్ళీ పెళ్ళి చేసుకుంటాను. మరి అప్పుడు నువ్వు నన్ను చేసుకుంటావా? " టీజ్ చేసింది.

"అప్పుడు మాత్రం ఎందుకు? జీవితాంతం పతివ్రతలా ఎదురుచూడు" ఉక్రోషంగా చెప్పాడు.

"ప్చ్" నిర్లక్ష్యంగా నిట్టూర్చింది. "వివాహ బంధం అనేది భార్యాభర్తలిద్దరూ కలిసి నిలుపుకోవలసిన బంధం. ఆ నియమాన్ని అతను మీరాడని తెలిశాక నాకు ఏమాత్రం సంబంధంలేని వ్యక్తిని, అతను కట్టిన తాళిని భరించడం ఊహూ! నా వల్లకాదు" తల అడ్డంగా ఊపింది.

"ఎప్పుడో నిజం తెలిసి నీకు పళ్ళూడే వయసొచ్చాక, అప్పుడు నా ప్రేమను ఒకే చేస్తావు కానీ ఇప్పుడు నా ప్రేమలోని నిజాయితీని గుర్తించవు అంతేనా? " క్లియర్ చేసుకుంటున్నట్లు అన్నాడు.

"ప్రస్తుతానికి అంతే. అదికాదు నువ్వే చెప్పు. నాకంటే అతని గురించి ఎంక్వైరీ చేసే అవకాశం లేదు. కానీ ఆయన నా కోసం వెతుకుతుంటే తొందరపడడం దిద్దుకోలేని పొరపాటవుతుంది కదూ" కాళ్ళు దగ్గరగా ముడుచుకొని బుగ్గలకి గుప్పెళ్ళు బిగించి ఆన్చుకొని అమాయకంగా అడిగింది.

ఆమెకు మరి దూరంగా ఉండలేనట్లు పక్కనొచ్చి కూర్చుని భుజాలు పట్టి తనవైపు తిప్పుకొని ఏదో చెప్పబోయాడు. దాక్షిణ్య సెల్ రింగవ్వడంతో "ఒక్క నిమిషం" అని ఆ చేతుల్ని తీసేసి వెళ్ళి సెల్ అందుకుంది.

సుజాత గొంతు ఆత్రంగా వినిపించింది. "మేడమ్ భాస్కర్ సార్‌ని పోలీసులు ఏదో ఎంక్వైరీ కోసం తీసుకువెళ్ళారు. నాకేదో కంగారుగా అనిపించి మీకు ఫోన్ చేస్తున్నాను"

"ఎందుకు? " అరిచినట్లు అడిగింది.

భీమేష్ విషయం అర్థం కానట్లు దగ్గరికి వచ్చాడు.

"వివరాలు నాకూ పూర్తిగా తెలియవు మేడమ్. సాయంత్రం ఒక ఇన్‌స్పెక్టర్ వచ్చి రికార్డు బుక్ తీసుకెళ్లారు. నిన్న ఎయిర్‌పోర్టు బాంబు పేలుళ్ళ కేసు ఎంక్వైరీ కోసమని చెప్పాడు. ఇంకో గంటకే భాస్కర్ సార్‌ని తీసుకెళ్లారు" తనకి తెలిసిన విషయం చెప్పింది.

"నేను వెంటనే బయలుదేరి వస్తున్నాను" సెల్ ఆఫ్ చేసి భీమేష్‌కి విషయం చెప్పింది.

"ఇంకో గంటలో ఫ్లయిట్ ఉంది. అదైతే అరగంటలో హైదరాబాద్ వెళ్ళిపోవచ్చు" కారు తర్వాత ఎలాగోలా తెప్పించుకోవచ్చు". అన్నాడు.

"ప్లీజ్, కొంచెం త్వరగా వాటి సంగతి చూడు. ఈ సుజాత ఇదేదో శుభవార్తలాగ ఇంటికి చేరేసి ఉంటుంది. అక్కేం కంగారు పడుతోందో, భాస్కర్ వాళ్లమ్మగారు ఏం భయపడుతున్నారో. నేను ఫోన్ చేసి ధైర్యం చెప్పకపోతే అదో రాద్ధాంతం అవుతుంది" భీమేష్‌తో అంటూ ఇంటి నెంబరు డయిల్ చెయ్యడంలో మునిగిపోయింది.

తను చెప్పదలుచుకున్న దానికి అది తగిన సమయం కాదని గ్రహించి చిన్నగా నిట్టూర్చి ప్రయాణపు ఏర్పాట్లకు బయలుదేరాడు భీమేష్.




భాస్కరాన్ని ఏ స్థితిలో చూడవలసి వస్తుందో అనే భయంతో బెదురుతూ ఇంటలీజెన్సీ కార్యాలయంలోకి అడుగు పెట్టిన దాక్షిణ్య ఓ వార బెంచీమీద కూర్చుని అసహనంగా చేతులు పిసుక్కొంటూ కూర్చున్న అతన్ని చూసి కాస్త రిలాక్స్‌గా ఫీలవుతూ దగ్గరగా వెళ్ళి పక్కన కూర్చుని

"బావా, ఐయాం సారీ... నావల్లే కదూ నువ్వు ఇలా ఇక్కడ" బాధతో గొంతు పూడుకుపోయింది.

భాస్కర్ కంగారు పడ్డాడు. "ఇదేమిటి? నువ్వెందుకొచ్చావు ఇక్కడికి? అదీ ఈ టైమ్‌లో. భీమేష్, మీరైనా వద్దని చెప్పలేదా. అయినా నన్ను తీసుకొచ్చింది కేవలం ఎంక్వయిరీకి. ఎవరో పెద్దాఫీసరు రావాలని కూర్చోపెట్టారు. రాగానే వాళ్లడిగిన వాటికి సమాధానాలు చెప్పి నేనే వచ్చేద్దునుగా, ఎందుకంత కంగారు" ఓదారుస్తున్నట్లే మందలింపుగా అన్నాడు.

భీమేష్ బదులిచ్చేలోగా అక్కడికి వచ్చిన గౌతమ్ "మిస్టర్ భాస్కర్ మిమ్మల్ని మా చీఫ్ పిలుస్తున్నారు రండి" పిలిచాడు.

భాస్కర్ లేచాడు. "ఆఫీసర్ ఒక్క నిమిషం" వెళ్ళబోయిన గౌతమ్‌ని ఆపి "పరిమళ ఫ్లోరిస్ట్"కి ఓనర్‌ని నేను. నేనూ మీ చీఫ్‌ని కలవాలనుకుంటున్నాను" లేచి సూటిగా చెప్పింది. గౌతమ్ అంగీకరించాడు. పిలవకుండానే భీమేష్ వాళ్లని అనుసరించాడు. గౌతమ్ చెప్పిన వివరాలు విని ముగ్గురికి కుర్చీలు చూపించాడు యోగేంద్ర. ఆ మాత్రానికే సంతోషించారు.

ముందుగా దాక్షిణ్య గొంతు సవరించుకుని అంది. "నా పేరు దాక్షిణ్య. ఈయన నా ఫ్రెండ్ భీమేష్. 'న్యూవే' రియల్ ఎస్టేట్ జి.ఎమ్. మీరు అరెస్టు చేసిన భాస్కర్ మా బావగారు. ఐమీన్ మా అక్కకి కాబోయే భర్త" పరిచయం చేసింది. ముగ్గురూ యోగేంద్రకి విష్ చేశారు.

"సార్, ఎయిర్ పోర్టు బాంబు బ్లాస్ట్ ఎంక్వయిరీకి భాస్కర్‌ని మీరు పిలిపించారని తెలిసింది. ఆఫ్టరాల్ మధ్య తరగతి వాళ్ళం. అంతంత పెద్ద విషయాల గురించి మాకేం తెలుస్తుంది సార్" భీమేష్ అన్నాడు.

యోగేంద్ర గౌతమ్‌కి సైగ చేశాడు. పేకట్లో సీజ్ చేసిన సగం కాలిన పి.ఎ.ఆర్ నేమ్ స్టిక్కర్‌ని దాక్షిణ్యకి అందించి "దానిని మీరు గుర్తు పట్టగలరా? " అడిగాడు.

"ఇదా... ఇది 'పరిమళా' మా షాపు నేమ్ స్టిక్కర్. దీనిమీద మా షాపు ఫోన్ నెంబరు కూడా ఉంటుంది" మొదటి చూపులోనే గుర్తు పట్టింది.

యోగేంద్ర పైకి లేచాడు. "బ్లాస్టింగ్ జరిగిన కారులో మాకు దొరికిన ఏకైక ఆధారం ఆ స్టిక్కర్. మా ఫోరెన్సిక్ నిపుణులు బ్లాస్టకి కారణం బాస్కెట్ బొకేలో పెట్టిన టైమ్ బాంబ్ అని మాత్రమే వివరణ ఇవ్వడంతో సిటీలోని అన్ని ఫ్లోరిస్టు షాపుల నుండి నిన్న సాయంత్రం బాస్కెట్ బొకేలు కొన్నవారి వివరాలు సేకరించడం తప్ప మాకు మరో మార్గం తోచలేదు. అందులోనూ 'PAR' అనే అక్షరాలతో మొదలయ్యే షాపులపై దృష్టి సారించాం. అందులో భాగంగా మీ షాపుకి వచ్చిన గౌతమ్‌కి మీ షాపు పేరు ఈ స్టిక్కర్ పైన పేరు కలిపి రైటింగ్‌లో ఒకే విధంగా రాయబడి ఉన్నట్లు సందేహం కలిగి ఎస్.పి.గారి మేరేజ్‌డే బొకే కావాలంటూ అబద్ధం చెప్పి మీషాపు నుండి బొకే కొన్నాడు. దానిపై స్టిక్కర్, ఈ సగం కాలిన స్టిక్కర్ ఒకే డి.టి.పి నుండి డిజైన్ చేయబడ్డాయని మా కంప్యూటర్ గుర్తించడంతో మిస్టర్ భాస్కర్‌ని ఇక్కడికి పిలిపించవలసి వచ్చింది" వివరంగా చెప్పాడు.

మీ షాపు పేరు ఈ స్టిక్కర్ పైన పేరు కలిపి రైటింగ్‌లో ఒకే విధంగా రాయబడి ఉన్నట్లు సందేహం కలిగి ఎస్.పి.గారి మేరేజ్‌డే బొకే కావాలంటూ అబద్ధం చెప్పి మీషాపు నుండి బొకే కొన్నాడు.

దాక్షిణ్య మొహం పాలిపోయింది. భాస్కర్, భీమేష్‌ల వంక ఓసారి చూసి "అంటే బొకేలో బాంబుని మేమే పెట్టి ఉంటామని మీరు అనుమానిస్తున్నారా? " భయంగా అడిగింది.

గౌతమ్‌కేసి చూశాడు యోగేంద్ర. ఇద్దరూ ఒకేసారి నవ్వేశారు. "ఇల్లు అద్దెకిచ్చిన ఓనర్ల దగ్గరే చేబదుళ్ళు తీసుకొని అవసరాలు గడుపుకొనే మిస్టర్ భాస్కర్‌కి, ముసలి బామ్మ, మతిస్థిమితం లేని తండ్రి, విధవరాలైన అక్కా, పెళ్ళి కావల్సిన చెల్లెలు. ఇందరి బాధ్య తను ఓ చిన్న ఫ్లోరిస్టు షాపుతో నెట్టుకొచ్చే సామాన్య మధ్యతర గతి ఆడపిల్ల అయిన మీరు అంతటి తెగింపు కలిగి ఉండరని మా ఎంక్వయిరీలో అర్థమయ్యింది" గౌతమ్ బదులిచ్చాడు.

ముగ్గురూ ఆశ్చర్యానికి గురయ్యారు "సార్, మా కుటుంబ పరి స్థితులు మీకెలా తెలుసు" నమ్మలేనట్లు అడిగాడు భాస్కర్.

యోగేంద్ర వదనం గంభీరంగా మారింది "భాస్కర్, ఈ ఐదు గంటలు మిమ్మల్ని బయట కూర్చోపెట్టి మీనవేషాలు లెక్కపెట్ట లేదు. మేం మీ వివరాల సేకరణకు ప్రయత్నిస్తే షాపు అసలు ఓనరు దాక్షిణ్యగారని తెలిసింది. ఆవిడ గురించి సేకరించిన వివ రాలను బట్టి ఆమెకున్న బాధ్యతల కారణంగా తండ్రికి ఏక్సిడెంట్ అయ్యి హాస్పటల్లో ఉన్నందున మీరు వారి అక్కని పెళ్ళాడుతున్నం దున షాపుని తాత్కాలికంగా మీ ఆధీనంలో ఉంచారని తెలిసింది' ' చెప్పి దక్షకేసి తిరిగి "అంతే కాదు మేడమ్. ఈ రోజు మీరు ఉదయం ముందుగా భీమేష్‌గారితో కలిసి ప్రముఖ స్వాతంత్ర సమరయోధులు రామచంద్రరావుగారి ఇంటికి మీ చెల్లెలు పెళ్ళి సంబంధం మాట్లాడడానికి వెళ్ళారు. అక్కడి నుండి వీరితో విజయ వాడ వెళ్ళారు. ఈ రోజు సాయంత్రందాకా అక్కడే ఉన్న మీరు

భాస్కర్‌గారిని మేము తీసుకొచ్చామని విని ఫ్లయిట్‌లో నేరుగా ఇక్కడికి వచ్చారు యా మై రైట్" చేతిలోని రిపోర్టు చదివి వినిపిస్తూ కళ్ళ జోడులోంచి తొంగి చూస్తూ అడిగాడు.

నోట మాట కూడా పలకలేనంత ఆశ్చర్యంగా చూస్తూ నిజమేనన్నట్లు తలూపింది. యోగేంద్ర భీమేష్ వైపు దృష్టి మరల్చాడు. "మిస్టర్ భీమేష్, మీ అసలు పేరు భీమేశ్వరరావు. మీ ఫ్రెండ్స్ భీమేష్ అని పిలవడంతో అలాగే వెల్‌నోన్ అయ్యారు. మీరు 'న్యూవే'లో జి.ఎమ్‌గా పనిచేస్తున్నారు. దాని ఛైర్మన్ శ్రీకాంత్ మీ క్లోజ్ ఫ్రెండ్. దాక్షిణ్యతో మీ పరిచయం శ్రీకాంత్ సెక్రటరీ గీత ద్వారా జరిగింది. ప్రస్తుతానికి దాక్షిణ్యకి మీరు బెస్ట్‌ఫ్రెండ్. మీ వివరాలు కూడా కరెక్టుగా ఉన్నాయా? " అడిగాడు.

"హండ్రెడ్ పర్సెంట్ సార్" భీమేష్ ఒప్పుకున్నాడు.

"రాజకీయనాయకులు, మీడియా, సినిమాలు వీళ్ళంతా చూపించినంత అసమర్థమైనది కాదు మా ఇంటలీజెన్స్ వ్యవస్థ. కాకపోతే ఒక్కోసారి కొన్ని వత్తిడిల వల్ల తప్పనిసరిగా అసమర్థులుగా ముద్ర వేయించుకునే పరిస్థితి మాది" నిట్టూర్చాడు యోగేంద్ర.

"ఇంత వ్యవధిలో మా గురించి కూలంకషంగా స్టడీ చేసిన మీ ప్రతిభ మా కర్థమయ్యింది సార్. మీరు కోరిన సాయం తప్పకుండా చేస్తాం" భీమేష్ హామీ ఇస్తున్నట్లు అన్నాడు.

"థాంక్యూ వెరీమచ్" అని ఒకసారి టైమ్ చూసుకొని "మేడమ్ టైమ్ పదకొండున్నర అవుతోంది. మీ మీద నమ్మకం కలిగిందిగా భాస్కర్‌ని ఓ అరగంటలో పంపేస్తాం. కావాలంటే, భీమేష్‌గారు ఉంటారు. గౌతమ్ మిమ్మల్ని దింపివస్తాడు మీరు వెళ్ళిపోండి" పర్మిషన్ ఇస్తున్నట్లు చెప్పాడు.

తల అడ్డంగా ఊపింది దాక్షిణ్య "లేదు సార్, ఇక్కడికి వచ్చేముందు మా బావని ఏ స్థితిలో చూడాలో అని భయపడుతూ వచ్చాను. ఏదో రకంగా కేసుల్లో ఇరికించి చేతులు దులుపుకుంటారనే భ్రమలో ఉన్నాను. కానీ మీతో మాట్లాడిన ఈ సమయం నా భయాలు, ఊహలు ఎంత అర్థంలేనివో నాకు తెలిసి వచ్చింది. ఇప్పుడు నాకు మీతో మాట్లాడుతుంటే నాలో ధైర్యం, నిశ్చింత కలుగుతున్నాయి. అందుకే మీ మీద అనుమానంతో కాదు. నాకు చేతనైన సాయం చెయ్యవచ్చనే అభిమానంతో ఉండా లనుకుంటున్నాను" స్పష్టంగా చెప్పింది.

యోగేంద్ర కొద్దిగా తలవొంచి విష్ చేశాడు "థాంక్యూ మేడమ్, మేము సివిలియన్స్ నుండి మాపై భయంతో కాక గౌరవంతో అందించే ఇలాంటి సహకారాన్నే కోరుతున్నాం" అంటూ గౌతమ్‌కి సైగ చేశాడు. గౌతమ్ 'పరిమళ' షాపు నుండి తెచ్చిన ఆర్డర్ బుక్ ఓపెన్ చేసి వాళ్ళ ముందు పెట్టి, "నిన్న మీ షాపు నుండి ఆరుగురు వ్యక్తులు బాస్కెట్ బొకేలు కొనుగోలు చేసినట్లున్నట్లు మేము గమనించాం. వాళ్ళ వివరాలు రూపు రేఖలు చెప్పగలిగితే మా పని సులువౌతుంది. అంటూ రౌండు చేసి ఉన్న నెంబర్లను చూపించాడు. భాస్కర్ పుస్తకాన్ని దగ్గరకి లాక్కున్నాడు. మొదటి వ్యక్తి పేరు చూసి, "అవినాష్" పైకి చదివి ఇతను ఇంజనీరింగ్ స్టూడెంట్ ఈ రోజు తన గర్ల్‌ఫ్రెండ్ పుట్టిన రోజని ప్రత్యేకంగా ఎర్ర గులాబీలు ఆర్డర్ ఇచ్చి చేయించాడు" చెప్పాడు.

"సార్, అతను మాకు ఓల్డ్ కస్టమర్, తరచు పువ్వులు కొంటూనే ఉంటాడు" దాక్షిణ్య చెప్పింది. గౌతమ్ మౌనంగా భాస్కర్ చెప్పిన వివరాలు నోట్ చేస్తున్నాడు. గౌతమ్ కేసి ఆమె చెప్పిన దాన్ని కూడా నోట్ చెయ్యమన్నట్లు చూశాడు యోగేంద్ర.

రెండో వ్యక్తి పేరు ఇమ్రాన్ "ఇతను వాళ్ళ బంధువుల కుర్రాడెవరో క్రికెట్‌లో నేషనల్ టీమ్‌కి సెలక్టయ్యాడని ఇచ్చిన

ఆర్డర్ మీదే బొకే చేసి ఇచ్చాం సార్" భాస్కర్ అన్నాడు.

"మూడోది "రామకృష్ణ మఠం వాళ్ళు ఈ రోజు దయానంద సరస్వతి పుట్టిన రోజని తెల్లగులాబీలతో చేయించుకొని తీసుకెళ్ళారు"

"నాలుగో బొకే ఆc! కలకత్తా నుండి సిస్టర్ నిర్మల ప్రతినిధి వస్తున్నారని సెయింట్ పాల్ చర్చి ప్రతినిధి ఒకరు రెండు రోజుల ముందే ఆర్డర్ ఇచ్చి చేయించారు. ఇక పోతే ఈ ఐదోది ఎవరో సుబ్బారావు అనే ఆయన వాళ్ళ మేనేజర్‌కి ప్రమోషన్ వచ్చిందని అభినందించడానికి ఊరికే షాపులో మోడల్‌కి చేసి ఉంచినదాన్ని అప్పటికప్పుడు కొనుక్కుని పట్టుకెళ్ళాడు".

"ఈ ఆఖరిది ద్విజేంద్రసింగ్ అనే వ్యక్తి హార్టు ఆపరేషన్ చేయించుకోడానికి వెళ్ళే తన బంధువుకి ఆర్డర్ ఇచ్చి చేయించారు. కాకపోతే పైవన్నీ నావాళ్ళే స్వయంగా పట్టుకెళ్ళారు. ఈ ఒక్కటి మాత్రం మా డెలివరీ బాయ్‌తో పంపాం" వివరించాడు భాస్కర్.

శ్రద్ధగా వింటున్న యోగేంద్ర చిన్నగా నవ్వాడు "పువ్వులు ఎవరైనా మాలికలో చేరితే ఏకమౌతాయిట. అలాగే 'హిందూ, ముస్లిం, సిక్కు, ఇసాయి' బొకేలను కొన్న వ్యక్తులు చూడు భిన్నత్వంలో ఏకత్వాన్ని ఎలా చాటుతున్నారో" వాళ్ళ పేర్లను వేలితో చూపుతూ అన్నాడు.

"అదే కదసార్, ఈ మట్టి గొప్పతనం" గౌతమ్ ప్రశంసించాడు.

ఈ సంభాషణలో ద్విజేంద్రసింగ్ గురించి భాస్కర్ చెప్పాలనుకున్న విషయం మరుపు కొచ్చింది.

'ఓ.కె' మీరిచ్చిన వివరాల ఆధారంగా మేము నెక్ట్స్‌స్టెప్ తీసుకుంటాం. యు మే గో. కానీ మేము ఎప్పుడూ చెప్పే డైలాగే. ఎప్పుడు పిలిస్తే అప్పుడు మళ్ళీ రావల్సి ఉంటుంది" యోగేంద్ర లేచి భాస్కర్‌కి, భీమేష్‌కి షేక్‌హేండ్ ఇస్తూ చెప్పాడు.

అందుకు అంగీకరించి ముగ్గురూ దాక్షిణ్య ఇంటికి చేరేసరికి ఒంటిగంట అయ్యింది. ఇంకా ఆ రెండు వాటాలలో లైట్లు వెలుగుతూ, వ్యక్తుల మొహాలలో గూడు కట్టుకొని ఉన్న విషాదాన్ని ప్రతిబింబిస్తున్నాయి.

వీళ్ళని ముందు గమనించిన రాణి ఆనందంతో బిగ్గరగా అరచి చెప్పింది. "అమ్మా! అన్నయ్య వచ్చాడు" మాటతోనే రివ్వున వచ్చి భాస్కరాన్ని హత్తుకుపోయింది. సావిత్రమ్మ కూడా కొడుకును కౌగలించుకుని ఏడుస్తూంటే వైదేహి మాత్రం తమ ఇంటి గుమ్మానికి ఆనుకొని నీళ్ళుకారే కళ్ళతో భాస్కర్‌నే సంతోషంగా చూస్తూ మౌనంగా చూపులతో ప్రశ్నిస్తోంది. తన వాళ్ల ఆత్మీయత భాస్కర్ గుండెలను తాకిందేమో అతనికీ కళ్ళు చెమర్చాయి. పెదాలపై చిరునవ్వుతో "ఐయాం ఓ.కె" అన్నట్లు వైదేహికి బదులు పలికాడు.

దూరం నుండే వాళ్ళ చర్యలను గమనిస్తున్న దాక్షిణ్యతో భీమేష్ "మధ్యతరగతి కుటుంబాలలో పోలీసు స్టేషన్‌లోకి మంచికైనా, చెడుకైనా అడుగుపెట్టడం పెద్ద ప్రమాదంగా భావిస్తారు కదూ!" అన్నాడు.

దాక్షిణ్య చిరునవ్వు నవ్వింది, "ఆ రోజు నాన్నని హాస్పటల్లో చేర్చినప్పటి నుండి నీకు థాంక్స్ చెప్పి నా బాధ్యత తీర్చుకోవాలని ప్రయత్నిస్తున్నాను. ఏ ముహూర్తాన నువ్వు 'అప్పుడే కాదు' అన్నావో కానీ ఇప్పుడది బాధ్యత స్థాయికి వాటి ఋణం స్థాయికి ఎదిగింది. నువ్వే అండగా లేకపోతే ఈ పరిస్థితిలో భాస్కర్‌తో ఇలా నేను ఈ ఇంట్లో అడుగుపెట్టగలిగేదానిని కాదు" ఎందుకో ఆ మాట అంటుంటే ఆమె గొంతు ఒణికింది.

కంగారుపడ్డాడు భీమేష్. ఆమె మూడ్ మార్చాలని "ఋణం తీర్చుకునే మార్గం నేను విజయవాడలోనే చెప్పాను. నువ్వే తాళి, పతిదేముడు అంటూ కాదన్నావు" కినుక నటించాడు.

చిత్రంగా దాక్షిణ్య వాదించలేదు. రెట్టించలేదు "గుడ్ నైట్" అని చెప్పి వడివడిగా

వెళ్ళిపోయింది.




మర్నాడు ఉదయం భీమేష్ 'న్యూవే' ఆఫీసుకి వెళ్ళేసరికి పది దాటింది. "యూ ఆర్ సో లేట్" శ్రీకాంత్ అన్నాడు. "మే బీ" రాత్రి పడుకునేసరికి రెండయ్యింది. తొమ్మిది దాటితే కానీ, మెలకువ రాలేదు" చెబుతూనే చేతిలోని ఫైల్ అందించి "విజయవాడ డీల్ ఓ.కె అయ్యింది దాని తాలూకు వివరాలు" ముభావంగా చెప్పాడు భీమేష్.

"ఏంటీ మాట తేడాగా ఉంది" అందుకుంటూ ఆరాగా అడిగాడు శ్రీకాంత్.

"ఆ! మన స్నేహం గాఢత అర్థమయ్యి" వ్యంగ్యంగా అన్నాడు.

"నా కర్థం కాలేదు" పెదవి విరిచాడు శ్రీకాంత్.

"ఎక్కడో ఉన్న దక్షికి ఫోన్ చేసి గీత అడిగింది. శ్రీకాంత్‌కి ఓ.కె చెప్పనా, వద్దా అని. నువ్వు ఒక్కసారైనా గీతని ఇష్టపడుతున్నట్లు చెప్పావా?"

ఉక్రోషంగా అడిగాడు ఎదురుగా కూర్చుంటూ.

"నువ్వు వెధవ డైలాగులు చెప్పకు. మొదటి రోజు పాపం ఆడపిల్ల అంటూ ఆఫీసు డెకరేషన్ కాంట్రాక్టు ఇప్పించావు. కహానీలు చెప్పి సిద్ధప్ప నర్సరీ లీజు ఇప్పించావు. దక్ష ఫాదర్‌కి ఏక్సిడెంట్ అయితే హాస్పిటల్లో చేర్పించి ఖర్చులు కూడా భరించావు. ఆవిడగారి చెల్లెలు సంబంధానికి పెళ్ళి పెద్దగా వెళ్ళావు. కూడా విజయవాడ తీసుకెళ్ళావు. ఆఖరికి రాత్రి రెండింటిదాకా ఆ పిల్లతో పాటు పడిగాపులు పడ్డావు. ఇవన్నీ దక్ష మీద ఇష్టంతో చేసినవి కావా? నువ్వా విషయం నాకు చెప్పావా?" రివర్స్‌లో నిలదీశాడు శ్రీకాంత్.

ఒక్క క్షణం మాట్లాడకుండా మౌనంగా ఉండిపోయిన భీమేష్ తల ఎత్తి "అవన్నీ ఇష్టంతో కాదు. బాధ్యతతో చేశాను"చెప్పాడు. కనుబొమలు ముడేశాడు శ్రీకాంత్.

"ఎక్స్‌క్యూజ్ మీ సార్" గీత రావడంతో వాళ్ళ సంభాషణ ఆగిపోయింది. భీమేష్ పైకి లేచాడు.

"ఊరు నుండి అమ్మా, నాన్న వచ్చారు. ఎల్లుండి వాళ్ళ పెళ్ళిరోజు. జయక్కా బావ కూడా ఇక్కడికే వస్తారట. ఏర్పాట్లు చూడాలి. ఓసారి దక్షని కలిసి భాస్కర్‌తో ఎంక్వయిరీ ఏమయ్యిందో కనుక్కోవాలి. 'సో' మళ్ళీ నాకు నేనుగా వచ్చేదాకా సెలవు కావాలి" చెప్పి వెళ్ళబోతూ "కంగ్రాట్స్ టు బోత్ ఆఫ్ యూ! గీతా నువ్వు శ్రీకాంత్‌ని సెలక్టు చేసుకోవడం కన్నా నిన్ను 'శ్రీ' సెలక్టు చేసుకోవడం మా వాడు జీవితంలో తీసుకున్న తెలివైన నిర్ణయం. ప్లీజ్ ఒబే హిజ్ విష్" కోరాడు.

"అఫ్‌కోర్స్ సర్" సిగ్గు పడింది గీత.

దగ్గరగా వచ్చిన శ్రీకాంత్ భుజం మీద బలంగా చరిచి "లక్కీ ఫెలోవి. ఆల్ ది బెస్ట్" అభినందించి బయటకి నడిచాడు భీమేష్.

అక్కడ నుండి తిన్నగా "పరిమళ" షాపుకి వెళ్ళాడు. దాక్షిణ్య సుజాత చెబుతుంటే షాపు జమా ఖర్చులు సరిచూసుకుంటోంది.

"భాస్కర్ లేడా?" లోనికి వస్తూ అడిగాడు.

"గౌతమ్ వచ్చి తీసుకెళ్ళారు. నిన్న భాస్కర్ ఇచ్చిన వివరాల వల్ల పెద్దగా ఉపయోగం కనిపించలేదుట. అందుకని ఓసారి యోగేంద్రగారు మాట్లాడాలి రమ్మన్నారు." చేస్తున్న పని ఆపకుండానే చెప్పింది.

ఆమె ఎదురుగా కుర్చీ లాక్కొని కూర్చుని షాపుని కలయచూస్తూ "న్యూవే డీల్ వల్ల షాపు ఏమైనా మెరుగయ్యిందా?" అడి

గాడు.

"ఊ! దాదాపు సేల్స్ డబుల్ అయ్యాయి" బదులిచ్చింది.

అక్కడ అందంగా పేర్చిన బొకేలను చూస్తుంటే భీమేష్‌కి ఏదో ఆలోచన ఫ్లాష్ అయ్యింది "నాకో సహాయం చేస్తావా? " కోరాడు

ఏమిటన్నట్లు కళ్ళెత్తి చూసింది.

"ఎల్లుండి నాకు బాగా కావలసిన వాళ్ళ పెళ్ళిరోజు. ఓ అందమైన బొకే చేసి పెట్టాలి. కుదురుతుందా? "

ఫక్కున నవ్వింది "వెరీ సిల్లీ. నా ప్రొఫెషనే అది అయినపుడు కుదరకపోవడం ఏముంది" కనుబొమలు ఎగరేసింది.

"అంటే, ఎల్లుండి నేను ఊరిలో ఉండడం లేదు. ముఖ్యమైన పనిమీద ఊటీ వెళ్తు



న్నాను. కానీ వాళ్ళు నాకు చాలా కావలసిన వాళ్ళు. అలాంటి వ్యక్తులకు బొకే పరాయి వాళ్ళతో పంపడం నాకిష్టం లేదు. పోనీ, నువ్వు నా తరపున తీసుకెళ్ళి ఇస్తావా? " నేర్పుగా అడిగాడు.

అతను ఊరు వెళ్తున్నాననంటే నిరుత్సాహ పడినా తనకి ఒక బాధ్యత అప్పగించడంతో "డోంట్ వర్రీ, ఎల్లుండి ఉదయం నువ్వు ఊటీలో ఉన్నా నీ విషెస్ వాళ్ళకి అందు తాయి. ఓ.కే" గుప్పెట మడిచి బొటనవేలు ఎత్తి చూపిస్తూ అంది.

"థ్యాంక్స్" చెప్పి "ఈ అడ్రస్సుకి తీసుకెళ్ళి ఇవ్వాలి" కార్డు ఇచ్చాడు.

"అప్పుడే కాదు" కార్డు అందుకొని కనిపిం చేలా గ్లాసు కింద పెడుతూ అతని మాట అతనికే అప్పగిస్తున్నట్లు అంది.

ఫోన్ రింగవ్వడంతో మాట్లాడి పెట్టేసి సుజాతని పిలిచింది. దక్ష భీమేష్‌తో మాట్లా డుతుండడంతో బొకేలు రెడీ చెయ్యడానికి వెళ్ళిన సుజాత "ఎస్ మేడమ్" అంది.

"శ్రీను ఉన్నాడా? " అడిగింది.

"ఇంకా బొకే కట్టడం అవ్వలేదు మేడమ్" శ్రీను సంజాయిషీగా చెప్పాడు. ఎందుకు, ఏమిటీ అనేది చెప్పకుండా "నాతో రా" అంటూ భీమేష్‌కి కళ్ళతోనే సైగ చేసి బయ టకి నడిచింది. ఆమె మాట్లాడింది భాస్క ర్‌తో అని గ్రహించి శ్రీను ఎందుకో అర్థం కాకపోయినా వాళ్ళని అనుసరించాడు.

* * *

అంతకు ఓ అరగంట ముందు గౌతమ్‌తో వస్తున్న భాస్కర్‌ని చూస్తూ "సార్ భాస్కర్ నిన్న రాత్రి మీరిచ్చిన సమాచారం మా కేసుకి పెద్దగా ఉపయోగపడలేదు. అందుకే మిమ్మల్ని మళ్ళీ ఇబ్బంది పెట్టవలసి వచ్చింది" అపాలజీగా అన్నాడు యోగేంద్ర.

"ఫరవాలేదు సార్. నాకు తెలిసిన వివరా లన్నీ చెబుతాను. ఓ సంఘ వ్యతిరేక శక్తిని అడ్డుకోడానికి నా వంతు సహకారం అందిం చడం పౌరుడిగా నా బాధ్యతగా నేను భావి

## వీధుల్లో అరిచేవాళ్లే...

గొంతెత్తి భీకరంగా అరవడమే నటనగా భావిస్తారు కొందరు రంగస్థల నటులు. ఈ జాడ్యం ఆ రోజుల్లో మరీ ఎక్కువ. దీనిపై రాఘవ సరస భాష్యం ఏమంటే-

'గొంతెత్తి అరవడమే నటనా వైదుష్యం అనుకుంటే వీధుల్లో అరిచే వాళ్లంతా నటులే. నిజానికి అది కళకాదు.. కేకలు వేయడం మన ఊపిరిని రోగభూయిష్టం చేస్తుంది. ఇది వ్యర్థపూరిత అలవాటుగా మనం తిరస్కరించాలి' బాగుంది కదా చురక!



స్తున్నాను" ఎదురుగా కూర్చుంటూ అన్నాడు.

యోగేంద్ర గౌతమ్ నమోదు చేసిన వివ రాలు తీసి "ఇందులో అవినాష్, రామకృష్ణ మఠం, సెంట్‌పాల్ చర్చి ఈ మూడింటిని క్లీన్ చీట్‌గా భావించి పక్కన పెట్టాం. మా ఎంక్వయిరీలో వాళ్ళు చూపిన కారణాలు కూడా సరైనవేనని తెలిసింది. ఇకపోతే ఇమ్రాన్, ద్విజేంద్రసింగ్, సుబ్బారావు వీళ్ళ విషయమే తెలియడం లేదు. సరైన అడ్ర స్సుల్లేకపోవడం వల్ల ఎటూ ఎంక్వయిరీ సాగడం లేదు. వీళ్ళ ప్రవర్తనలో ఏదైనా తేడాని మీరు గమనించారా? " అడిగాడు.

ఆలోచించిన భాస్కర్‌కి ద్విజేంద్ర తన

భార్యకి చూపిస్తానని చెప్పి బొకే తీసుకెళ్ళిన విషయం గుర్తొచ్చి "సార్, ఇదో పెద్ద విషయం కాకపోవచ్చు. కానీ ఈ ద్విజేంద్ర సింగ్ బొకేని మా డెలివరీ బాయ్ ద్వారానే పంపమని కోరాడు. కానీ తన భార్య నడవ లేని మనిషని, ఒకసారి బొకే చూపిస్తానని కారు దగ్గరకి తీసుకెళ్ళాడు. అతను డబ్బులు చెల్లించి వేయడంతో నేను అభ్యంతరం పెట్ట లేదు. అన్నట్టుగానే ఐదు నిమిషాల్లో వెళ్ళి వచ్చేశాడు. అతని ముందే డెలివరీ బాయ్‌కిచ్చి పంపేశాను" చెప్పాడు.

యోగేంద్ర పెదవి విరిచాడు "ప్చ్ ఇదీ పనికొచ్చే విషయం కాదు" కాస్త నిరుత్సాహ పడినా తమాషా ఏంటంటే ద్విజేంద్రసింగ్ మేము డెలివరీ చెయ్యాల్సిన వ్యక్తి పేరు వివరాలు కాకుండా ఫ్లయింట్ వివరాలు సీటు నెంబరు ఇచ్చాడు. కాకపోతే అది బాంబు హోం మినిష్టరు ఒళ్ళోనే పేలాలని లేదు. ఆ ఫ్లయిట్ లో ప్రయాణించే ఏ వ్యక్తి దగ్గర పేలినా మొత్తంగా విమానం పేలిపో తుంది"

"అయితే రాజ్ కుమార్‌ని అరెస్టు చేద్దామా సార్" గౌతమ్ కేసు కొంచమైనా ముందుకు కదిలిందనే ఉత్సాహంతో అడిగాడు.

సాలోచనగా తలూపిన యోగేంద్ర "రాజ్ కుమార్ బొకే రిసీవ్ చేసుకుని ఉంటే అది విమానంలో కాక హోంమినిష్టరు కారులో ఎందుకు పేలింది? " అనుమానం వ్యక్తం చేశాడు.

అంతలో భాస్కర్‌కి ద్విజేంద్రసింగ్ ఆరో పణ గుర్తొచ్చింది. "మరో సంగతి సార్. మర్నాడు ద్విజేంద్రసింగ్ నాకు ఫోన్ చేసి మేము సరైన వ్యక్తికి సరైన టైమ్‌లో బొకే అందజేయడంలో విఫలమయ్యామంటూ

**కేసు చిక్కు విడిపోయినట్లే ఉంది. అంతలోనే అర్థం కానట్లు అనిపిస్తోంది. గౌతమ్ నువ్వెళ్ళి ఇక్కడున్న ఈ రిసీవర్స్ సంతకం ఆ రాజ్‌కుమార్‌తో మ్యాచ్ అవుతోందో లేదో చూడు**



చివరి నిమిషంలో జరిగిన మార్పు కనుక ఆర్డర్ బుక్‌లో నమోదు కాలేదు" చెప్పాడు.

తుళ్ళిపడ్డాడు యోగేంద్ర "ఫ్లయిట్‌లో ప్రయాణించే వ్యక్తికి ఇమ్మన్నాడా? ఆ వివ రాలు ఏవి? " ఆతృతగా అడిగాడు.

ఆర్డర్ బుక్‌లోనే మడతపెట్టి ఉన్న చిన్న స్లిప్ లాంటిది తీసి చూపాడు. రిసీట్ షీట్ మీద ఉన్న అర్థంకాని సంతకాన్ని తీసి చూపించాడు. గౌతమ్ ఆ వివరాలతో హోం మినిస్టరు సీటు నెంబరు అదీ టాలీ చేసి చూసి "నో సర్... ఇది అసలు వి.ఐ.పి. క్లాస్‌కి చెందింది కాదు. ఎకనామికల్స్ క్లాస్‌లో ప్రయాణించే ప్రయాణీకులు ఎవరో రాజ్‌కు మార్ అనే వ్యక్తి పేరు మీద ఉంది" చెప్పాడు.

"దట్స్ నాటే మేటర్. ఫ్లయిట్‌లో పేలే మమ్మల్ని నిందించాడు. కానీ బిల్ బుక్‌లో రిసీవర్స్ సైన్ ఉండడంతో నేను అతని ఆరోపణకు పెద్దగా ప్రాధాన్యత ఇవ్వలేదు.

యోగేంద్ర విసుగ్గా తల విదిలించాడు "కేసు చిక్కు విడిపోయినట్లే ఉంది. అంత లోనే అర్థంకానట్లు అనిపిస్తోంది. గౌతమ్ నువ్వెళ్ళి ఇక్కడున్న ఈ రిసీవర్స్ సంతకం ఆ రాజ్ కుమార్‌తో మ్యాచ్ అవుతోందో లేదో చూడు. అయితే అతన్ని అరెస్టు చేసి ఆ ద్విజేంద్రసింగ్ ఎవరో, ఏమిటో వివరాలు సేకరిద్దాం" చెప్పి "మీ డెలివరీ బాయ్ రాజ్ కుమార్‌ని చూసే ఉంటాడు కదా! అతన్ని పిలిపిస్తే గుర్తించడం ఈజీ అవుతుంది" భాస్కర్‌తో అన్నాడు.

శ్రీనుని తీసుకొని వచ్చిన దాక్షిణ్య భీమేష్ లకు జరిగినది చెప్పి "శ్రీనూ... నీ దగ్గర

బొకే తీసుకొన్న రాజ్‌కుమార్ ఎలా ఉంటాడో చెప్పగలవా?" యోగేంద్ర శ్రీనుని అడిగాడు.

తను చేసిన తప్పు ఎక్కడ బయట పడు తుందోననే కంగారులో "నల్లగా ఉన్నాడు సార్, ఆహా కాదు కాదు తెల్లగా ఉన్నాడు" అని అంతలోనే గుర్తొచ్చినట్లు "సిక్కులా ముడి ఉంది సార్. గడ్డం ఉంది. కళ్ళు ఎర్రగా ఉన్నాయి" నోటికి తోచినట్లు వర్ణించ సాగాడు. వద్దనుకున్నా ఒళ్ళంతా చమటతో తడిసిపోతోంది అతనికి.

అప్పటికే రాజ్‌కుమార్ వివరాలు, ఫొటో అన్నీ కంప్యూటర్ ద్వారా సేకరించిన గౌత మ్‌కి శ్రీను ధోరణి సందేహాన్ని రేపింది. మెల్లగా యోగేంద్ర పక్కకి వెళ్ళి "సార్, రాజ్‌కుమార్ సంతకం జత కుదరలేదు. ఇతను వర్ణించే రూపం కూడా తప్పు" అంటూ తను తెచ్చిన రాజ్‌కుమార్ ఫొటో, వివరాలు చూపించాడు. యోగేంద్ర కళ్ళు ఆగ్రహంతో ఎరుపెక్కాయి. శ్రీను కాలర్ పట్టుకొని రఫ్‌గా లాగాడు. ఆ ఊపుకి టేబుల్ పైనుండి జారి కింద పడిన శ్రీను భయంతో వణికిపోతూ చూశాడు.

"ఏరా... నాటకాలాడుతున్నావా? బాంబు పెట్టి ఫ్లయిట్ పేల్చేయ్యాలని చూసింది చాలక ఎవరో అమాయకుడి మీదకి ఆ నేరం నెట్టేయ్యాలని చూస్తావా? రాస్కెల్, నీ ప్రాణం తీస్తాను" అంటూ బూటు కాళ్లతో పక్కలో బలంగా తన్నాడు.

నిశ్చేష్టులై ఉండిపోయిన వాళ్లలో దాక్షిణ్య ముందుగా తేరుకుంది.

"సార్, మీరు పొరపాటు పడుతున్నారు. ఈ కుర్రాడు మా షాపులో పనిచేసే సుజాత తమ్ముడు. ఇతను అలాంటివాడు కాదు. మీకేదో తప్పుడు సమాచారం ఇచ్చారు" గభాలున లేచి శ్రీనుకి యోగేంద్రకి మధ్య నిలబడి కంగారుగా వారిస్తున్నట్లు అంది.

యోగేంద్ర శాంతించలేదు. పైగా "నీకు తెలియదమ్మా, ఇలాంటి వెధవలు డబ్బు కోసం నమ్మిన వాళ్లనే ముంచేస్తారు. వీడూ ఏ తీవ్రవాద సంస్థతోనో చేతులు కలిపి వందలాది ప్రయాణీకులని, హోమ్ మినిస్ట రుని చంపేందుకు ప్లాన్ వేసి బొకేలో బాంబు పెట్టాడు. అదృష్టవశాత్తు అది పార్కింగ్ ప్లేసులో పేలింది కనుక ఎవరికీ ఏ ప్రాణ హాని జరగలేదు. ఇంత పెద్ద ప్లాను వీడు ఒక్కడూ వేసి ఉండడు. వీడిని నాలుగు తంతే అసలు దొంగలెవరో కక్కు తాడు" అంటూ దాక్షిణ్యను పక్కకి నెట్టి మరో రెండుసార్లు తన్నాడు.

యోగేంద్ర సిన్సియారిటీకి ఇంప్రెస్ అయిన దాక్షిణ్య ఆయన చెప్పేది నిజమో, అబద్ధమో తేల్చుకోలేక భీమేష్ కేసి నిస్సహా యంగా చూసింది. వచ్చేయమన్నట్లు అతను సైగ చేయడంతో గట్టిగా నిట్టూర్చి కదలబో యింది. ఆమె వెళ్ళిపోతే యోగేంద్ర తనని చంపేస్తాడని భయపడిన శ్రీను ఆమె కాళ్లను గట్టిగా వాటేసుకుని, "అబద్ధం మేడమ్. అమ్మ మీద, అక్క మీద ఒట్టు. నాకేం తెలియదు మేడమ్. ఆ రోజు నేను మా ఫ్రెండ్‌తో ఇంటర్‌నెట్‌కి వెళ్ళి ఎయిర్ పోర్టుకి వెళ్లేసరికి ముంబాయి ఫ్లయిట్ వెళ్ళి పోయింది. బొకే డెలివరీ చెయ్యలేదంటే అక్కా, భాస్కర్ సార్ కోప్పడతారని రిసీ ట్‌పై నేనే సైన్ చేసి ఆ కారు కిటికీ డోరు తెరచి ఉంటే అందులో పారేసి వచ్చేశాను. అంతే మేడమ్. నేను చేసింది. నాకింక ఏ తీవ్రవాద సంస్థలతో సంబంధం లేదు. నన్ను నమ్మండి మేడమ్" బాధతో, భయంతో వెక్కుతూ ఆగి ఆగి చెప్పాడు.

"ఏరా, కొత్త కథలు వినిపిస్తున్నావా" గౌతమ్ వెనకగా వచ్చి మరో నాలుగు తన్నాడు. శ్రీను దాక్షిణ్య కాళ్లు వదిలేసి బాధతో మెలికలు తిరిగిపోయాడు. దాక్షిణ్య మరి చూడలేకపోయింది. "తను చెప్పిన వివరాలు కూడా నిజమెంతో ఆరా తీయండి సార్" కోరింది.

అంగీకరించిన యోగేంద్ర శ్రీనుని సెల్

లోకి పంపించి అతడిచ్చిన వివరాల ప్రకారం శ్రీను ఫ్రెండ్ మహేష్‌ని పిలిపించి ఆరా తీశాడు. ఆ రోజు శ్రీను తనతోటే ఉన్నాడని చెప్పిన సాక్ష్యం, ఇంటర్‌నెట్ సెంటర్ ఇన్ ఛార్జి సాక్ష్యంతో శ్రీను నిజంగానే లేటయినం దున బొకేని వదిలించుకోవడానికే దానిని హోం మినిస్టరు కారులోకి విసిరేశాడని నిర్ధా రణ అయ్యింది. ఈ తతంగం ముగిసే సరికి రెండు గంటలయ్యింది. అప్పటి వరకు ఆ ముగ్గురూ యోగేంద్ర ఆఫీసులోనే ఉన్నారు.

"ద్విజేంద్రసింగ్ బాంబు ఎందుకు పెట్టినా కానీ శ్రీను నిర్లక్ష్యం వల్ల అది వందలాది ప్రాణాలు కాపాడి కేవలం చిన్న గాయాలు, కొద్దిపాటి ఆస్తి నష్టంతో ఒక మబ్బు తెరలా తేలిపోయింది. కాకపోతే పేలింది హోం మినిస్టరు కారు కనుక మాకీ హడావిడి తప్పలేదు. మా వల్ల మీరూ టెన్షన్ పడ్డారు. ఐయాం సారీ" మూడు రోజులుగా విశ్రాంతి లేకుండా కష్టపడడం వల్ల అలసటతో ఎర్రబడిన కళ్ళని ఒత్తు కుంటూ క్షమాపణగా అన్నాడు యోగేంద్ర.

"శ్రీనూ తీవ్రవాది కాదని తేలింది కదా! అతన్ని వదిలేస్తారా? " ఆశగా అడిగింది దాక్షిణ్య.

చిన్నగా నవ్వాడు యోగేంద్ర. "నిజానికి శ్రీను ఆ బొకే కారులో పారేసి వందల ప్రాణాలు రక్షించి మహోపకారం చేశాడు. కాకపోతే అతడికి పనిపట్ల నిర్లక్ష్యం ఎక్కు వగా ఉంది. ఓ ఇరవై నాలుగు గంటలు ఏ కేసు లేకుండా సెల్‌లో పారేసి రేపు ఉదయం పంపిస్తాను. కాస్త బాధ్యత తెలిసి వస్తుంది. వాళ్ళక్కకి ఏదో కథ చెప్పి మేనేజ్ చెయ్యండి" చెప్పి భాస్కర్ మీతో నిన్న ఉదయం మాట్లాడిన ఫోన్ నెంబర్లు తెప్పించాను. వీటిని గుర్తిస్తే ఆ ద్విజేంద్ర సింగ్ ఆచూకి సంగతి మేం చూసుకుంటాం. మళ్ళీ మీరు మేము కబురు చేసినప్పుడు వస్తే చాలు" కోరాడు.

ఆ రోజు షాపు కొచ్చిన ఫోన్లలో తమకి తెలియని నెంబర్లను గుర్తించి సెలవు తీసు కొని బయటికి వచ్చారు. భాస్కర్ మర్నాడు పెళ్ళికి కొనవలసిన ముఖ్య సామాగ్రి తేవా లంటూ వెళ్ళిపోయాడు.

"నాన్నని చూసి వస్తాను" దాక్షిణ్య కూడా అటునుండి అటే వెళ్ళిపోయింది. తను వేసిన ప్లాన్ ఎంతవరకు ఫలిస్తుందో తర్కిం చుకుంటూ తల్లితండ్రులకు, అక్క, బావలకు కావలసిన ఏర్పాట్లు చేయడానికి బయలుదే రాడు భీమేష్,




"అక్కా, నీకు పెళ్ళవుతోంది అనే ఆనందం కన్నా, ఇకపై నువ్వు రోజూ చన్నీళ్ల స్నానం చేస్తూ చప్పిడి కూడు తినన వసరం లేదు అనే భావన నాకు ఎక్కువ సంతోషాన్ని కలిగిస్తోంది" నుదుట ఎర్రటి కుంకుమ, జడలో పువ్వులు పసుపు రంగుకి ఆకుపచ్చ అంచున్న పట్టు చీర, చేతికి నిండైన గాజులు, కాలికి పట్టాలతో సర్వాలం కారాలతో నిండుగా ఉన్న అక్కని కళ్లారా చూస్తూ సంతోషంగా అంది దాక్షిణ్య.

మెల్లగా నవ్వింది వైదేహి. "నాకు మాత్రం నిన్ను అవసరమైన సమయంలో ఒంటరిగా వదిలేస్తున్నామనిపిస్తోంది. ఎంత పక్క ఇల్ల యినా పెళ్ళి ఆడపిల్లని పరాయిదాన్ని చేస్తుంది. నేను చిత్ర, వెళ్ళిపోతే బామ్మతో, మతిస్థిమితం లేని నాన్నతో, ఆ పసివాడితో ఎలా వేగుతావో నా కర్థం కావడం లేదు. దక్షా! ఇలా అన్నానని కాదు. భీమేష్ చాలా మంచి మనిషిలా ఉన్నారు. నీకు తాళి కట్టిన మనిషి ఈ పాటికి మరో పెళ్ళి

చేసుకునే ఉంటాడు. నువ్వు మాత్రం ఒంటరిగా ఇలా ఎన్నాళ్లు? భీమేష్ నిన్ను ఇష్టపడితే కాదనకు. ఒక అక్కగా నీ సౌఖ్యం, సంతోషం నాకు కావాలి" చెల్లెలి గడ్డం పట్టుకొని బుజ్జగిస్తున్నట్లు అంది.

కళ్లలో నీళ్లతో నీరసంగా నవ్వింది దాక్షిణ్య. "వద్దక్కా. మనసును అదుపు చేసుకోవడం నువ్వు నేర్పిన విద్య. నమ్మిన సంప్రదాయానికి తల వంచడం బామ్మ నేర్పిన చదువు. ఫరవాలేదు. ఉండగలను. ఉంటాను. నాన్నకు కొద్ది కొద్దిగా షాక్ ట్రీట్మెంట్ పెంచమని చెప్పాను. త్వరలోనే ఆయన బాగవుతాడు. చూద్దాం. కాలం వెనక్కి తిరిగి తాళి కట్టినవాడే నా కోసం వస్తాడేమో!"

దాక్షిణ్య అంటుండగానే చిత్ర పరుగున వచ్చింది. "అక్కా త్వరగా రమ్మంటున్నారు' ' అంటూ ఇద్దరూ కళ్ళు తుడుచుకుని ఒకరి నొకరు సరి చూసుకొని బయటికి నడిచారు.

ముందు రిజిష్టర్డు ఆఫీసులో, తర్వాత చిలుకూరి వెంకటేశ్వరస్వామి గుళ్ళో సింపుల్‌గా భాస్కర్, వైదేహిల పెళ్ళి జరిగిపోయింది. తల దెబ్బ మానుపట్టిన తండ్రిని తీసుకొచ్చి కొత్త దంపతులకు ఆశీస్సులు ఇప్పించింది దాక్షిణ్య. ఆమెకి ఆయన కళ్లలో ఓ చిన్న మెరుపు కదిలిన భావన కలిగింది.




భీమేష్‌కి మాట ఇవ్వడంతో తానే ప్రత్యేకంగా అలంకరించిన పెద్ద బొకేని తీసుకుని అతనిచ్చిన అడ్రస్ వెతుక్కుంటూ వెళ్లింది దాక్షిణ్య.

ఎక్కువ కష్టపడనక్కర లేకుండానే పచ్చ తోరణాలతో, బంధువులతో సందడిగా ఉన్న ఇల్లు స్వాగతం పలికింది. లోనికి వెళ్ళి మాధవరావు, శారద దంపతుల గురించి ఆరా తీస్తే పట్టు పంచా లాల్చీలతో హుందాగా ఉన్న ఓ పెద్దాయనని, బంధువుల వేళాకోళానికి ముసిముసి నవ్వులతో ఉన్న స్త్రీ మూర్తిని చూపించారు. వాళ్లిద్దరినీ సోఫాలో కూర్చోమని కోరి "నమస్తే మేడమ్. ఈ రోజు మీ పెళ్ళిరోజు శుభ సందర్భంగా వీటిని తన శుభాకాంక్షలతో అందజేయమని భీమేష్‌గారు పంపారు. ఐ విష్‌యూ హేపీ అండ్ ప్రాస్పరస్ వెడ్డింగ్ లైఫ్ ఫర్ లైఫ్ లాంగ్ సార్" బొకేని ఇద్దరికీ అందజేస్తూ చిరునవ్వుతో విష్ చేసింది.

"ఎంత బాగుందో, భీమ ఏం చేసినా అలాగే చేస్తాడు" అంతా ప్రశంసించారు.

"మరి, నేను వెళ్తాను మేడమ్" దాక్షిణ్య బయలుదేరబోయింది.

పై గది కిటికీ నుండి ఆమె వచ్చిన దగ్గర నుండి జరుగుతున్న తతంగాన్ని ఆత్రంగా గమనిస్తున్న భీమేష్ "వెళ్ళి పోతోంది ఎలా ఆపాలి? " కంగారుగా అడిగాడు తనకి చెరో పక్క నుంచుని తనలాగే ఆసక్తిగా గమనిస్తున్న గీత, శ్రీకాంత్‌లను. "నేనేదో చెప్పి ఆపుతాను" గీత వెళ్ళబోయింది. కానీ.

"అదేమిటమ్మాయ్. శుభకార్యం జరుగుతున్న ఇంటికి వచ్చి నోరు తీపి చేసుకోకుండా వెళ్తానంటావు. ఉండు" ఓ పాతకాలపు పెద్దామె చొరవగా మందలించడంతో ఇబ్బందిగా కూర్చుంది.

"అది సరే, మా భీమ నీతో బొకే పంపించాడు. నువ్వు వాడి సెక్రటరీవా? " జయ ఆరాగా అడిగింది స్వీటు అందిస్తూ.

ఏం చెప్పాలో తెలియనట్లు చూస్తూ "లేదండి. నేను బొకే షాపు నడుపుతున్నాను. ఐయామ్ ఎ ఫ్లోరిస్టు" ముక్తసరిగా చెప్పింది స్వీటు తీసుకుని.

"ఓస్, అంతేనా? వాడి తరపున తెస్తే నిన్నేమైనా ఇష్టపడ్డాడేమో మా తమ్ముడని

ఆశపడ్డాం. లేదన్న మాట" పెదవి విరిచి అంది జయ.

"ఊరుకో జయా! ఏమిటా మాటలు. నువ్వేం అనుకోకమ్మా. ఇంతకీ నీ పేరేమిటమ్మా? " శారద అడిగింది.

"దాక్షిణ్య, అంతా దక్షా అని పిలుస్తారు. వస్తానండి" అని లేచి గుమ్మం వైపు నడచింది.

"అమ్మాయ్ ఆగు..." వెనక నించి పెద్దగా వినిపించిన మాటలతో ఆగి వెనక్కి తిరిగి చూసింది. ఆమెను ఆగమన్నది మాధవ రావు. ఆయనలో చిన్నగా ఏదో సంచలనం. దాక్షిణ్య దగ్గరగా వచ్చి "మీ నాన్న గారి పేరు రాఘవరావుగారు. మీ సొంత ఊరు సర్పవరం కదూ!" ఆమెనే సూటిగా చూస్తూ కాస్త అనుమానంగా అడిగాడు.

మా వివరాలు ఈయనకెలా తెలుసా అని ఒక్క క్షణం నివ్వెరపోయింది దాక్షిణ్య. అంతలోనే చంద్రమౌళి ఇంట్లో ఎదురైన అవమానం గుర్తొచ్చి ఓ రకమైన విసుగు ఆవరించింది. ఇంక ఇక్కడ జరిగే పరాభవం ఏముందిలే అని విసుగ్గా అనుకుంటూ "అవునండీ" అంది.

"నువ్వు రాఘవరావుగారి రెండో అమ్మాయివి, నీకు చిన్న తనంలోనే పెళ్లయ్యింది. అవునా? " మళ్ళీ అడిగాడు.

ఆ ప్రశ్నలతో విసుగు నషాళానికి ఎక్కిన దాక్షిణ్య విసురుగా,

"అవునండి, నాకు చిన్నతనంలోనే పెళ్లయ్యింది. నా మొగుడు నన్నొదిలేసి పారిపోయాడు. ఆ షాక్‌కి నాన్న మతి చలించింది. మేము ఆస్తులన్నీ పోగొట్టుకొని చిన్న పూల కొట్టు మీద ఆధారపడి జీవిస్తున్నాం. ఈ వివరాలు చాలా, మా మీద కపట సానుభూతి చూపించి వెక్కిరించడానికి" అరిచినట్లుగా అంది.

మాధవరావు ఆమె ఆగ్రహాన్ని పట్టించుకోలేదు "శారదా. ఇదిగోనే మనవాడి పెళ్లాం. రాఘవరావుగారి చిన్న కూతురు దాక్షిణ్య. నువ్వు అస్తమాను అనేదానివిగా. అమ్మాయి పేరు దాక్షిణ్య బదులు దాక్షాయణీ అని పెట్టి ఉంటే అబ్బాయి పక్కన సరిగ్గా సరిపోయేదని. ఆ పిల్లే ఈ పిల్ల" సంతోషంగా చెప్పాడు.

"ఏంటీ! మన కన్నా పెళ్ళామా" అంటూ ఆడాళ్లు ఆమె చుట్టూ మూగి ఆమెను భుజాలు పట్టి లాక్కొచ్చి సోఫాలో కూలవేశారు.

"అవునమ్మా! ఆ నొక్కులు జుట్టు అలాగే ఉంది" జయ సంబరంగా అంది.

వాళ్ళంటున్నదేమిటో అర్థం కాక విస్తుపోయి బిత్తర చూపులు చూస్తూండిపోయింది దాక్షిణ్య.

"ఇదిగోనే శారదా! ఈ మెడ కింద పుట్టుమచ్చ కూడా అదే. ఆ రోజు పెళ్ళికూతుర్ని చేసేటపుడు పూలజడ వేస్తూ చూశాంగా మనం" పిన్ని వరస అయ్యే ఇంకో ఆవిడ దక్ష జడని పక్కకి తప్పించి కొద్దిగా తిప్పి చూపిస్తూ అంది.

తననో బొమ్మని చేసేసినట్లు ప్రవర్తిస్తూ మాట్లాడుతున్నా అమితాశ్చర్యంతో వాళ్లనేం అనలేకపోతోంది దాక్షిణ్య.

శారద తడబడుతూ లేచి దాక్షిణ్య దగ్గరికి వచ్చి మొహం తడిమి మెటికలు విరిచింది. నీళ్ళు కారే కళ్లు ఒత్తుకుంటూ, "వెళ్ళండి కన్నాని పిలవండి. వెళ్ళండి" మూగిన వాళ్లని చేతులతో తోస్తూ అంది. అంతా తలోదారి చెదిరిపోయారు.

జరిగే తంతును గుక్కప్పగించి నోట మాట రానట్లు ఉండిపోయిన దాక్షిణ్యను గమనించి "సక్సెస్" చెరో చేత్తో శ్రీకాంత్, గీతలను తడుతూ ఆనందంగా అన్నాడు భీమేష్.

"ఇంకెందుకు ఆలస్యం త్వరగా వెళ్ళు, నిన్ను తన భర్త స్థానంలో చూస్తే దక్ష మొహంలో కలిగే ఫీలింగ్స్‌ని చూడాలని ఉంది" అంటూ భీమేష్‌ని గుమ్మంకేసి నెట్టాడు శ్రీకాంత్. చిరునవ్వుతో గుమ్మం



## బై వన్ గెట్ వన్ ఫ్రీ

పండగ సీజనొస్తే చాలు ఏ షాపు ముందుకెళ్ళినా "బై వన్ గెట్ వన్ ఫ్రీ" అన్న స్లోగన్ కన్పిస్తోంది. అలాగే పబ్లిక్ టెలిఫోన్ల దగ్గర "పే చేసి కాల్ చేసు కోండి, ఫ్రీగా 'కోల్డ్' పట్టుకెళ్ళండి" అని బోర్డు రాసి పెడితే బాగుంటుం దేమో...

మనం ప్రతి నిత్యం ఉపయోగించే పబ్లిక్ టెలిఫోన్ల రిసీవర్, మౌత్ పీస్, హ్యాండిల్, నంబరు బటన్సు వంటి ప్రదేశాల్లో కుప్ప తెప్పలుగా జలుబు కల్గించే వైరస్‌లు, ఇన్‌ఫ్లూయంజా వైరస్‌లు కుప్ప తెప్పలుగా వృద్ధి చెందుతున్నాయని ఇటీవలి పరిశోధనల సారాంశం.

అందుకని పబ్లిక్ టెలిఫోను ఉపయోగించాల్సి వస్తే చేతి రుమాలు గానీ, టిస్యూ పేపరు గానీ వాడుతూ, మౌత్ పీస్‌ని కనీస దూరంలో ఉంచి మాట్లాడమంటున్నారు. లేకపోతే ఫ్రీగా జలుబును పట్టుకెళ్ళాల్సొస్తుందంటున్నారు.

దాకా వచ్చిన భీమేష్ అపనమ్మకంగా చూస్తూ వెనకనుండి తోస్తున్న శ్రీకాంత్‌ని ఆపేశాడు.

అప్పటికే దాక్షిణ్య పైకి లేచి "ఆగండాగండి. ఒకవేళ నిజంగానే మీరు నా అత్తా మామలే అయినా నాకేం ఆనందంగా లేదు" అని బంగారు గొలుసుకి గుచ్చబడిన మంగళ సూత్రాలను చేతిలోకి తీసుకొని ఓసారి వాటి కేసి చూసి శారద కుడిచెయ్యి అందుకొని ఆమె చేతిలో పెట్టి మూస్తూ.

"క్షమించండి. మీరు పొరపడుతున్నారో, నిజంగానే నన్ను గుర్తు పట్టారో అర్థం కావడం లేదు. మీ మాటలే నిజమైతే మీ రూపాలే కాదు, మీ అబ్బాయి రూపం కూడా నాకు గుర్తు లేదు. ఒక ఆడపిల్ల మెడలో కట్టిన తాళి విలువ ఎప్పుడైతే మర్చిపోయి నా ఖర్మానికి నన్ను అతడు, మీరు వదిలేశారో ఆనాడే నాకు పెళ్లయ్యిందనే విషయాన్ని నేనూ మర్చిపోయాను. ఇప్పుడు నా కతని అవసరం కూడా లేదు. మనసులో ఏ మమతా లేకుండా కేవలం మంగళసూత్ర మనే ఈ లైసెన్స్ బిళ్లతో జీవితాంతం మీ అబ్బాయితో, మీతో నేను బతకలేను. నన్ను క్షమించండి" చేతులు జోడించి చెప్పి తల వంచుకుని వడివడిగా బయటికి వెళ్లిపోయింది.

అంతా నిశ్చేష్టులై నిలబడిపోయారు.

ముందుగా తేరుకున్న శ్రీకాంత్ భీమేష్ భుజం మీద బలంగా చరిచాడు.

"ఏయ్ భీం. త్వరగా వెళ్ళు. నువ్వే తన భర్తవని చెప్పకపోతే దాక్షిణ్య జన్మలో మళ్లీ నీ మొహం చూడదు" తొందర పెడుతున్నట్లు అన్నాడు. తేరుకున్న భీమేష్ ముందుగా తల్లి దగ్గరికి వెళ్ళి ఆవిడ గుప్పెటలోంచి మంగళ సూత్రాలు తీసుకొని జేబులో వేసుకొని బయటకి పరిగెత్తాడు.

తను పడుతున్న టెన్షన్ అంతా నడకలో ప్రతిఫలిస్తుండగా ఎవరో తరుముకొస్తున్నట్లు కంగారుగా నడుస్తోంది దాక్షిణ్య. అప్పటికే ఆమె అంత దూరంలో ఉండడంతో వేగంగా పరుగెత్తి పిలిస్తే పలికేంత దూరానికి చేరుకున్న భీమేష్; హఠాత్తుగా ఆమె నడక ఓ పక్కగా ఉన్న చిన్న చర్చివైపు మరలడంతో పిలిచే ఉద్దేశాన్ని విరమించుకొని మౌనంగా అనుసరించాడు.

చర్చి నిశ్శబ్దంగా, ప్రశాంతంగా ఉంది. ఫాదర్ కానీ, పాస్టర్ కానీ ఎవరూ అక్కడ లేరు. శిలువ వేసిన క్రీస్తు బొమ్మ దానికి ఒక పక్క బాల యేసుని ధరించిన చిన్న మేరీమాత ఒక పక్కగా కన్‌ఫెషన్ బాక్స్‌లా రెండు చెక్క పలకలున్న చిన్న స్థలం ఉన్నాయి. దాక్షిణ్య ఆ బాక్స్ దగ్గరికి వెళ్ల లేదు. విగ్రహానికి కాస్త దూరంగా కాళ్లలో సత్తువ అయిపోయినట్లు మోకాళ్ల మీద వాలిపోయింది. దగ్గరికి రాబోయి అంతలోనే ఆగిపోయాడు భీమేష్.

"తట్టుకోలేకపోతున్నా ప్రభూ. తప్పు చేశాననిపిస్తోంది. శాస్త్రోక్తంగా జరిగిన పెళ్ళిని కాదని తాళిని తీసి ఆ మొగుడు నాకొద్దని వచ్చేశాను.

తప్పు చేశానేమో! ప్చ్ ఏం చెయ్యనూ? నా మనసు మాట వినడం లేదు. అదే సరైన పని అంటోంది నా ఆత్మాభిమానం. ఏది తప్పో, ఏది ఒప్పో ఏమో నాకైతే తెలియదు. జరిగింది ఏదైనా తట్టుకునే ఆత్మశక్తిని నాకియ్యి. తప్పయితే ఆ శిక్షని నాకు మాత్రమే ఇయ్యి. లక్షలాది పాపుల్ని మన్నించిన కరుణామయుడివి. నా తప్పును కూడా మన్నించి నిజాయితీగా నిర్భయంగా బతికే ఆత్మ శక్తినియ్యి" మోకాళ్ల మీద నిలబడి రెండు చేతులు గుప్పెళ్ళుగా ఒకటిగా బిగించి కళ్ళు బిగ్గరగా మూసుకొని కారే కన్నీళ్ళతో సన్నగా గొణుక్కుంటున్నట్లుగా ప్రార్థిస్తూ ఉండిపోయింది.

ఆమె ఎంత నెమ్మదిగా గొణుక్కుంటున్నట్లు కోరుకుంటున్నా నిశ్శబ్దంగా పక్కనే చేరి వింటున్న భీమేష్ చెమ్మగిల్లిన కళ్ళను షర్టు కాలర్‌కి ఒత్తుకొని ఆమె పక్కన అలాగే కూర్చుని క్రాస్ వేసుకొని "పువ్వుల్లోనే కాదు మతాలలో కూడా నీది భారతీయ సిద్ధాంతమేనన్న మాట" వెక్కిరిస్తున్నట్లుగా పలకరించాడు.

ఉలిక్కిపడ్డట్టు కళ్ళు తెరచి. "భీమేష్, నువ్వెప్పుడొచ్చావు? " పైకి లేచి పక్కకి తిరిగి కళ్ళు కొంగుతో తుడుచుకుంటూ అడిగింది.

"నీ వెనకే" అని "నువ్వు చర్చిలోకి వస్తూ కనిపించావు. బొకే ఇచ్చావో లేదో కనుక్కుందామని కూడా వచ్చాను" అబద్ధమాడాడు.

"ఆc! ఇచ్చేశాను" క్లుప్తంగా చెప్పి"అవునూ నువ్వు ఊటికే వెళ్తున్నానన్నావు" అనుమానంగా అడిగింది.

ఆ విషయం "తర్వాత చెప్తాలే" అని నవ్వేశాడు."కొత్తగా పెళ్ళయ్యింది కదా, కొన్నాళ్ళు బావని షాపుకి రావొద్దన్నాను. నేను వెళ్తాను" మాట తప్పిస్తూ వెళ్ళబోయింది.

"ఒక్క నిమిషం. మా వాళ్ళ దగ్గర నువ్వు ఏదో వదిలేశావట. నా కిచ్చి పంపారు. ఇది నీదేనా? " జేబులో మంగళ సూత్రాలని ఆమె ఎదురుగా ఆడిస్తూ అడిగాడు.

ఒక్కక్షణం సీరియస్‌గా అతని మొహంలోకి చూసి, "నాదే" అని ఆగి "మీ ఇంట్లో జరిగిన సంఘటనతో నాకు విషయం చూచాయగా అర్థమైపోయింది. అయినా నా ఆలోచనలో, నిర్ణయంలో మార్పుండదు. అందుకే నాకిప్పుడు దాని అవసరం లేదు" నిష్కర్షగా చెప్పింది.

"అంటే ఈ తాళితో నీకు అవసరం లేదంటే నన్ను చేసుకోడానికి నీకు అభ్యంతరం లేనట్లేగా? "

తెల్లబోయినట్లు చూసిన దాక్షిణ్య "అని ఎవరన్నారూ? దానికీ దీనికి సంబంధం ఏమిటి? "అతన్ని తప్పించుకొని వెళ్ళబోయింది.

"అమాయకత్వం నటించకు. ఆరోజు విజ

నీకేం కావాలో నాకు తెలుసు. నీ మనసును పంచుకుని స్వాంతననిచ్చే స్నేహితుడు ఆత్మీయుడైన భర్త కావాలి, అందుకే- అంటూ తన చేతిలోని తాళిని మెడలో వేశాడు

యవాడలో నువ్వే అన్నావు. నీ భర్త ఏనాటికైనా తిరిగి వస్తాడనే నమ్మకంతోనే నన్ను కాదంటున్నానని. ఈ రోజు అతనే నీకు అక్కరలేదని తాళిని తీసి ఇచ్చేసి ఇంకా సంబంధం ఏమిటని అడుగుతావేం. వేళాకోళంగా ఉందా? " ఆగ్రహంగా ప్రశ్నించాడు.

అతని కళ్ళలోని తీక్షణత్వం, ఆ ప్రశ్నలోని సూటితనాన్ని తట్టుకోలేనట్లు నిస్సహాయంగా కళ్ళు వాల్చుకుంది. "అతడు, నువ్వు వేర్వేరుగా ఉంటేగా? ప్లీజ్ భీమేష్, నేను చేసింది తప్పో రైటో, మంచో చెడో తెల్చుకోలేని అయోమయంలో నా మనసు నాకే అర్థం కాని వేదనలో ఉక్కిరిబిక్కిరవుతున్నాను. నేనేం చెయ్యాలో, ఏం చెయ్యకూడదో నాకే అర్థం కాని పరిస్థితిలో ఉన్నాను. కొన్నాళ్ళు నన్నిలా నా మానాన ఒదిలేయ్. మరోసారి పెళ్ళి అనే ఆలోచన నాకు కలిగితే నాకు నేనుగా వచ్చి నిన్ను అడుగుతాను. అంతవరకు ఏమో. నాకేం కావాలో, ఏం వద్దో ఆలోచించే ఓపిక కూడా నాకిప్పుడు లేదు. ప్లీజ్" చేతులు జోడించి వేదనగా అంది.

రెండు నిమిషాలు ఆమెను దీర్ఘంగా చూసి ఓ నిర్ణయానికి వచ్చినట్లు భుజం పట్టి క్రీస్తు ఎదురుగా తీసుకెళ్ళి "నీకేం కావాలో నాకు తెలుసు. నీ మనసును పంచుకుని స్వాంతననిచ్చే స్నేహితుడు ఆత్మీయుడైన భర్త కావాలి, అందుకే" అంటూ తన చేతిలోని తాళిని మెడలో వేశాడు.

ఎప్పుడు వచ్చారో గానీ శ్రీకాంత్, గీత చర్చి ప్రవేశ ద్వారం దగ్గర నుంచుని చప్పట్లు కొడుతూ నవ్వుతున్నారు.

దాక్షిణ్య భీమేష్ తమవైపు చూడడంతో ఇద్దరూ ముందుకు నడిచి వాళ్లకి చేరువగా వచ్చారు.

"మీరు ఇక్కడ..." ఆశ్చర్యంగా దాక్షిణ్య.

"అది అంతే" అన్నాడు శ్రీకాంత్.

"గీతా" అయోమయం, ఆశ్చర్యం నుంచి తేరుకోని దాక్షిణ్య నిస్సహాయంగా స్నేహితురాలి వంక చూసింది.

"సారీ దక్షా. నిన్ననే మాకు నిజం తెలిసింది. అదీ భీమేష్ చెప్తేనే. ఈ రోజు నీకు నిజం తెలిసేందుకే నిన్ను వాళ్లమ్మా, నాన్నల దగ్గరికి పంపిస్తున్నట్లు చెప్పి, అవసరమైతే మమ్మల్ని తనకి మోరల్ సపోర్టుగా ఉండడానికి రమ్మని కోరారు. నువ్వొచ్చినప్పుడు నేనూ, శ్రీకాంత్ లోపలే ఉన్నాం. అక్కడ జరిగిందాంతో నువ్వు బాధపడి బయటికి వెళ్లిపోతే భీమేష్ నిన్నూ, మీ ఇద్దర్ని మేమూ అనుసరించాం"

గీత చెప్పింది విని ఇంకా నమ్మలేనట్లు భీమేష్, శ్రీకాంత్‌ను, ఆమెను మార్చి మార్చి చూసింది దాక్షిణ్య.

నిజం అన్నట్లు ముగ్గురూ చిరునవ్వు నవ్వారు. అంతలోనే ఏదో గుర్తొచ్చిన వాడిలా "నేనిప్పుడే వస్తా. మీరిక్కడే ఉండండి.

ఎక్కడికీ వెళ్లొద్దు" అనేసి వడివడిగా బయటకు వెళ్లిపోయాడు శ్రీకాంత్.

ఎందుకో అర్థంగాకపోయినా ముగ్గురూ అక్కడే ఉండిపోయారు. పది నిమిషాల లోపే శ్రీకాంత్ రెండు దండలతో, ఫాదర్‌తో తిరిగివచ్చాడు.

దండలు మార్చుకోమని వారి చేతికిచ్చాడు.

దాక్షిణ్య దండ అందుకున్నా తటపటాయిస్తూ ఉండిపోయింది. గీత "ఊc వేయి" అంది.

మిత్రురాలి వంక చూసింది దాక్షిణ్య. ఆమెలో ఏదో నిస్తేజత. నిస్తబ్ధత 'కాదని' గాని 'అవునని'గానీ అనలేకపోతోంది.

"కమాన్ దాక్షిణ్యా! ఫాదర్ మీ కోసం వెయిట్ చేస్తున్నారు. దండ భీమేష్ మెడలో వెయ్యి" అన్నాడు శ్రీకాంత్. అతడి స్వరం ఆదేశిస్తున్నట్లుగా ఉంది.

లిప్తపాటు అతణ్ణి చూసీ చూడనట్లు చూసిన దాక్షిణ్య మారు మాట్లాడకుండా భీమేష్ మెడలో దండ వేసింది.

ఫాదర్ ఇద్దర్నీ ఆశీర్వదించాడు.

అప్రయత్నంగా ఇద్దరూ ఆయనకు శిరసు వంచి నమస్కరించారు.

గీత దాక్షిణ్య చేయిపట్టుకుని ముందుకు నడిపించింది. కలలో నడుస్తున్నట్లు దాక్షిణ్య ఆమెను అనుసరించింది.

వారిద్దరి వెనక భీమేష్, శ్రీకాంత్.

భీమేష్, దాక్షిణ్యలను కారులో ఇంటి దగ్గర దింపి "మేం అరగంటలో వచ్చేస్తాం" అని వెళ్ళబోతున్న శ్రీకాంత్‌ను ఆగమన్నట్లు సైగ చేశాడు భీమేష్.

శ్రీకాంత్ దగ్గరకు వెళ్లి, వాళ్ల మనోభావాన్ని పసిగట్టినట్లు "దాక్షిణ్య వాళ్లింటికేగా మీరు వెళ్ళేది" అన్నాడు. నవ్వుతూ. అవునన్నట్లు తలూపాడు.

"వాళ్లందరినీ తీసుకురండి" అని గీత వైపు చూస్తూ "మీ ఫ్రెండ్‌కి కావల్సినవన్నీ కూడా తీసుకురా గీతా" అన్నాడు.

అలాగే అన్నట్లు తలూపింది గీత.

భీమేష్ వెంట మౌనంగా తలదించుకుని ఇంట్లోకి అడుగుపెట్టింది దాక్షిణ్య.

ఆ ఇద్దరినీ చూసిన భీమేష్ తల్లిదండ్రులు, అక్కాబావ, ఇతర బంధువుల ముఖాల్లో సంతోషం.

భీమేష్ తల్లి శారద దాక్షిణ్య మెడలోని తాళిబొట్టును చూసింది. దగ్గరగా వస్తూ, "మావాడు అప్పుడే ముడేసేశాడన్న మాట. ఫరవాలేదమ్మా కోడలు పిల్లా. మీ ఇద్దరి మధ్య బంధం బలంగా ఉండాలని నీకు ఒకటికి రెండుసార్లు తాళికట్టాడు అంతే" శారద దగ్గరగా వచ్చి చెరో చెయ్యి ఇద్దరి తలలపై ఉంచి ఆశీర్వదిస్తూ అంది.

"నీ జాతకంలో మూడు పెళ్ళిళ్లని రాసి ఉంటే ముగ్గురు పెళ్ళాలనుకున్నాను. కానీ, ఒకే పిల్లను మూడుసార్లు పెళ్ళాడే యోగమని ఇప్పుడే తెలిసిందిరా!" మాధవరావు కొడుకుతో వేళాకోళమాడాడు.

"మూడేంటి నాన్నా, రెండుసార్లేగా తమ్ముడి పెళ్ళవుతా? " జయ ఆశ్చర్యంగా అడిగింది.

"ఏముంది మొదటి పెళ్ళి గుళ్ళో, రెండోసారి చర్చిలో అయ్యిందిగా మూడోసారి మసీదులో చేసి సర్వమత సమానత్వం చాటుతారేమో మామగారు" జయ భర్త వెక్కిరించాడు భార్యని.

భళ్ళున నవ్వాడు మాధవరావు. "నేను అనే మూడో పెళ్ళి వాడి షష్ఠిపూర్తి గురించి" అంతా ఆయనతో శృతి కలిపారు.

శారద కొడుకును, కోడలిని "రండి" అంటూ తీసికెళ్లి సోఫాలో కూర్చోబెట్టింది.

అందరూ ఏదేదో మాట్లాడుతున్నారు. కానీ దాక్షిణ్య ఈ లోకంలో లేనట్లు, అందరి వంక నిర్వేదంగా చూస్తూ, తప్పదన్నట్లు బలవంతంగా చిరునవ్వు తెచ్చుకుంటూ కూర్చుంది.

ఇంతలో కారు ఆగిన చప్పుడు వినిపించింది.

వైదేహి, చిత్ర, రాఘవరావు, బామ్మ, భాస్కర్ అందరూ లోపలికి రావడంతో బిత్తరపోయింది దాక్షిణ్య.

వాళ్ల వెనకే గీత, శ్రీకాంత్ రావడంతో విషయం అర్థమైంది.

వైదేహి చేతిలోని బ్యాగ్ తీసుకుని గీత లోపల పెట్టి వచ్చింది. స్నేహితురాలి దగ్గ రికొచ్చి పక్కన కూర్చుంటూ "కంగ్రాట్స్" అంది.

దాక్షిణ్య బలహీనంగా నవ్వింది.

ఆమె అక్క చెల్లెళ్లని, బామ్మని, తండ్రిని భీమేష్ తల్లిదండ్రులు సాదరంగా ఆహ్వా నించి కూర్చోబెట్టి జరిగింది చెప్పారు.

అంతా విని బామ్మతోపాటు కళ్లొత్తుకుం టున్న వైదేహి, చిత్రలను చూసింది దాక్షిణ్య. వాళ్లిద్దరూ ఆమె దగ్గరికు వచ్చి కూర్చు న్నారు.

తండ్రి రాఘవరావు కళ్లల్లో ఏదో మెరుపు. రెప్పార్పకుండా తననే చూడడం గమనించింది.

ఇంకా కోలుకోని అతడి మనసులో ఏదైనా భావం ఉందా, ఉంటే అదేమిటో అను కుంది.

శారద, మాధవరావుల పుట్టినరోజు వేడు కకు వచ్చిన సన్నిహిత బంధువులు దాక్షిణ్య చుట్టూ చేరి అవీ ఇవీ అడుగుతున్నారు.

ఆమెకు లోలోన విసుగు పెరుగుతోంది.

గీత అది గమనించిన దాక్షిణ్యను లోప లికి తీసికెళ్లింది. వైదేహి, చిత్ర బయటవా రితో, ఆ సందడిలో కలిసిపోయారు.

అంతలోనే భీమేష్ లోపలికి వచ్చి "నీకు ఫోన్" అంటూ కార్డలెస్ అందించాడు.

"నాకా, ఇక్కడికా?" ఆశ్చర్యంగా అంది.

"నీకే, యోగేంద్రగారు నీ షాపుకు, ఇంటికి ఫోన్ చేయిస్తే మన సంగతి తెలిసిందట. అందుకే ఇక్కడకు చేశారంట" చెప్పాడు భీమేష్.

"హలో, నమస్కారమండీ" అంది.

అటువైపు నుంచి యోగేంద్ర స్వరం వినిపించింది "దాక్షిణ్యా! కంగ్రాచ్యులేషన్స్, నాకెలా తెలిసిందో చెప్పనక్కర్లలేదనుకుం టాను" అని నవ్వి "విష్‌యూ ఎ హాపీ మేరీడ్ లైఫ్" అన్నాడు అభినందనగా.

"థాంక్యూ సర్" అంది.

"దాక్షిణ్యా! నీకో విషయం చెప్పడానికే ఫోన్ చేశాను ద్విజేంద్రసింగ్ దొరికాడు. ఇంటరాగేషన్ సాగుతోంది. ఏదో చెప్తు న్నాడు. ఆ మధ్య ముషారఫ్ మీద దాడి చేసిన ఇండియన్‌కి ఉరి శిక్షవేశారు కదా! అతను సిక్కుమతస్థుడవ్వడం వల్ల ప్రభు త్వం ఏ చర్యా తీసుకోవడంలేదు. హిందు వైతే ఎప్పుడో విడిపించేవారు. అందుకే ప్రతీ కారంగా ఫ్లయిట్‌ని పేల్చేసి ప్రభుత్వానికి వార్నింగ్ ఇవ్వాలనుకున్నాడట. ఒక్కడే ఇందుకు పూనుకున్నాడా? ఏదైనా తీవ్రవాద సంస్థ హస్తముందా అన్నది తేలాల్సి ఉంది. ఈలోగా హోమ్ మినిస్టరు కారులో పేలిన బాంబుకి ఓ కొత్త కథ చూసుకోవాలి, లేదంటే ఈ రాజకీయ నాయకులు మమ్మల్ని ప్రశాంతంగా ఉండనీయరు" చెప్పి వెనుదిరిగాడు.

"సంతోషం సార్. కానీ..." అర్థోక్తిగా ఆగి పోయింది.

ఆమె భావాన్ని పసిగట్టిన యోగేంద్ర "నీ బాధ నాకు అర్థమయ్యింది. ఈ కేసు నా ఆధీనంలో ఉన్నంతవరకు భాస్కర్‌ని, నిన్ను ఈ గోలలోకి లాగకుండా నేను జాగ్రత్త పడ తాను సరేనా...?" అని "ఏజ్ ఏ వెల్‌వి షర్ నాదో సలహా. నా దృష్టిలో ఏ మని షైనా తన అంతర్మాతకి మాత్రమే సంజా యిషీ చెప్పుకుంటే చాలు. ఎవ్వరికీ తలవం చనక్కరలేదు. నీ జీవిత కాలమంతా ఈ ఒక్క విషయాన్ని గుర్తుంచుకో చాలు" అన్నాడు.

దాక్షిణ్యకు ఏదో భారం తొలగిపోయినట్లు రిలీఫ్‌గా అన్పించింది, ఆయన మాటలతో ఆమె కళ్లలో మెరుపు కదిలింది. "థ్యాంకూ సార్. థ్యాంకూ వెరీమచ్" అంది.

ఆమెని మరోసారి విష్ చేసి ఫోన్ పెట్టేశాడు యోగేంద్ర అటువైపు.

విషయం తెలుసుకుని భీమేష్ బయటకు వెళ్లిపోయాక ఉదయం నుండి గీతని అడగాలని ఉగ్గబెట్టుకున్న ప్రశ్నని అడిగేసింది. "గీతా! భీమేష్‌తో నా రిలేషన్ తెలిసే నాకు శ్రీకాంత్ ఆఫీసు కాంట్రాక్టు ఇప్పించావా? "

గీత నొచ్చుకున్నట్లు చూస్తూ "ఛ, ఛ నీకే అతను ఏమౌతాడో తెలియనప్పుడు నాకెలా తెలుస్తుంది. ఆ మాటకొస్తే అప్పటికి భీమేషే నిన్ను తన భార్య అని గుర్తు పట్టలేదుట" చెప్పింది.

ఇద్దరూ ఆ గదిని ఆనుకొని ఉన్న చిన్న బాల్కనీలోకి నడిచారు.

"ఇంతకీ ఈయనగారికి ఎప్పుడు తెలిసి

ఒదార్పు నందించగలిగితే ఆనాడు నాకు నేనుగా దాక్షిణ్యకు నిజం తెలిసేలా చేస్తాను. అంతవరకు నువ్వూ చెప్పొద్దు' అని కోరాడు. నేను కాదనలేక పోయాను" చెబుతూ దక్ష నుండి ఏ ప్రతిస్పందనా లేకపోవడంతో ఆమెకేసి చూసింది. కింద గేటు దగ్గర ఎవరో బంధువులకు నవ్వుతూ వీడ్కోలిస్తున్న భీమేష్‌నే పరీక్షగా చూస్తోంది.

"దక్షా... దక్షా" పిలుస్తూ వచ్చిన శారదను చూసి సరిగ్గా నిలబడ్డారు. "మీ అక్క వెళతానంటోంది. గీతని కాసేపు ఉండమంటావా? " అడిగింది.

"లేదండీ, అంకుల్‌ని హాస్పిటల్‌కి తీసుకెళ్లాలి నేనూ వెళ్తాను" చెప్పి "దక్షా, మళ్లీ వస్తాను. బీ బ్రేవ్" మెల్లగా చెప్పింది.



**తొలిసారి నీచేత పాలు పొంగిద్దామంటే ఈ ఇంట్లో పొయ్యి లేదు. గిన్నె లేదు. అన్నీ మరస్విచ్చులు, కరెంటు వస్తువులు. తినే అన్నం కూడా మీ ఆయన బయటనుండే తెప్పిస్తాడు**

వచ్చింది" వ్యంగ్యంగా అడిగింది. ఇద్దరూ బాల్కనీ రైలింగ్ మీద కూర్చున్నారు.

"మీ నాన్నగారికి ఏక్సిడెంట్ అయిన రాత్రి వచ్చి ఎలాగైనా నీ గురించి పూర్తి వివరాలు చెప్పి తీరాలని పట్టుబట్టాడు. నేను ఒప్పుకోలేదు. అప్పుడు చెప్పాడు. తనకి చిన్నప్పుడే పెళ్లయ్యిందనీ, అనుకోని పరిస్థితుల్లో తన భార్యకు దూరమయ్యానని ఆమే దాక్షిణ్య అని సందేహంగా ఉందని అన్నాడు. తప్పనిసరై నేను నీ గురించి చెప్పాను. భీమేష్ చాలా డీప్‌గా మూవ్ అయిపోయాడు. అతని ఫీలింగ్స్ బట్టే నిజాయితీగా నీ గురించి తపిస్తున్నాడని నేను గ్రహించాను. ఆ రోజే నీకు నిజం చెప్పేయమన్నాను. కానీ అతను ఒప్పుకోలేదు. 'ఇన్నాళ్లు భర్తగా ఆమెకు కష్టాలూ, కన్నీళ్లు మాత్రమే ఇచ్చాను. ఒక స్నేహితుడిగానైనా కొంతైనా

వైదేహి కూడా చెల్లెలికి ధైర్యం చెప్పి వెళ్లిపోయింది.

అంతా అదే తన స్థానం అన్నట్లు వదిలి వెళ్ళిపోవడంతో ఏం చెయ్యాలో తోచనట్లు నిలబడిపోయింది. వాళ్ళని సాగనంపి వచ్చిన అత్తగారు "ఏమిటీ, ఇంకా ఇక్కడే ఉన్నావా? లోపలికి రా" అంది.

లోపలికి వచ్చిన దాక్షిణ్యతో "ముందు ఈ ఇంటి గురించి తెలుసుకోవాలి. తొలిసారి నీచేత పాలు పొంగిద్దామంటే ఈ ఇంట్లో పొయ్యి లేదు. గిన్నె లేదు. అన్నీ మరస్విచ్చులు, కరెంటు వస్తువులు. తినే అన్నం కూడా మీ ఆయన బయటనుండే తెప్పిస్తాడు. అన్నింటికన్నా విడ్డూరం దేముడి బొమ్మకి కూడా గతి లేదు" బుగ్గలు నొక్కుకుంది శారద. ఆవిడ అన్న తీరుకి ఫకాల్న నవ్వింది దాక్షిణ్య.

"నువ్వు మరీనమ్మా. ఇన్నాళ్ళు తమ్ముడు ఒంటరివాడు కనుక దేనినీ పట్టించుకోలేదు. ఇల్లాలు వచ్చిందిగా అన్నీ ఆవిడ చూసుకుంటుందిలే ఇంక" జయ తమ్ముడిని వెనకేసుకుని వచ్చింది.

"అదే నేనూ చెప్తున్నాను. నా బిడ్డ జీవితం బాగుపడాలని నేను చాలా దేముళ్లకి మొక్కాను. ఏ దేముడు నా మొర విన్నాడో ఇన్నాళ్ళుగా ఎవరి కోసం తపిస్తూ ఎదురు చూశాడో ఆ భార్యే వాడికి దొరికింది. అందుకే మొక్కులు నెరవేర్చుకోడానికి వెళ్ళొద్దామనుకుంటున్నాను. నేను మళ్లీ వచ్చేసరికి ఈ ఇల్లు అచ్చమైన సంసారంలా కనిపించాలి నాకు" అభిమానంగా హెచ్చరించింది.

"జయా, రావాలి" బయట నుండి జయ భర్త పిలిచాడు.

జయ లేచింది. "మీరెక్కడికి వెళ్తున్నారు? " ఆశ్చర్యంగా అడిగింది.

"నాగార్జునసాగర్‌లో మా ఆడపడుచు ఉంది. మా ఆయనకి చెల్లెలంటే ప్రాణం. ఇంత దూరం వచ్చి రాకపోతే చంపేస్తుంది. మళ్ళీ మేము ఎల్లుండి గౌహతి వెళ్లిపోవాలి" అని దగ్గరగా వచ్చి "దక్షా! ఆడబిడ్డననే అధికారంతో కాదు, నా తమ్ముడి మీద మమకారంతో చెబుతున్నాను. నిజానికి అమ్మా, నాన్నల పెళ్ళిరోజు వంకతో ఇక్కడికి వచ్చింది ఎలాగైనా తమ్ముడిని దొరకని నీ కోసం వెతుకులాట మాన్పించి మరో పెళ్లికి ఒప్పించాలని. కానీ, వాడి నమ్మకమే గెలిచింది. నువ్వు దొరికావు. నీకు మావల్ల ఎదురైన కష్టాలు మీ బామ్మగారు చెప్పారు. గతాన్ని తలుచుకొని గాయాల్ని కెలుక్కోవడం కన్నా భవిష్యత్తు గురించి కలలు కంటూ ప్రస్తుతంలో జీవించడం మంచిది కదూ!" చిరునవ్వుతో నచ్చచెబుతున్నట్లు అంది.

"అబ్బే అదేం లేదు? " కంగారుగా అంది.

జయ నవ్వేస్తూ, "నువ్వొచ్చావని మేము వెళ్లిపోవడం లేదులే. మా ప్రోగ్రాం ముందే ఫిక్సయింది, మరి వస్తా" అంటూ భుజం తట్టి వెళ్లింది.

శారద కూడా వెళ్లేందుకు లేచింది. "మీరైనా ఉండండి" నసుగుతున్నట్లుగా అంది.

"లేదమ్మా, నాగార్జునసాగర్ వెళ్లడానికి మీ మామగారు కూడా ఒప్పుకున్నారు. మళ్లీ ఆయన మూడ్ మారిపోతుంది. ఒక్క నిజం మాత్రం నీకు తెలియాలి. ఆనాడు మీ కుటుంబం మీద కోపంతోనో, ద్వేషంతోనో మోసగించాలనో మేము అంత హఠాత్తుగా వెళ్లిపోలేదు. మీ మామయ్యగారికి ఎదురైన ఇబ్బందికర పరిస్థితులవల్ల దొంగల్లా ఎవరికీ చెప్పకుండా పారిపోవలసి వచ్చింది" కళ్ళు ఒత్తుకుంది శారద.

చివుక్కుమంది దాక్షిణ్య మనసు.

భార్యని పిలవడానికి వచ్చిన మాధవరావు శారద మాటలు విని "అవునమ్మా" మమ్మల్ని అపార్థం చేసుకోకు. డబ్బు అవసరం దృష్ట్యా చిన్నప్పుడే భీముడి పెళ్ళి చేయడం వల్ల అది బయటకు పొక్కితే ఎక్కడ ఉద్యోగం ఊడుతుందోనన్న భయంతో చాలా దగ్గర వాళ్లకి తప్ప మిగిలిన వాళ్ళకి తెలియకుండా ఉంచాను. అంతలోనే మరో పెద్ద సుడి గుండంలో పడిపోయాను. స్నేహితుడని నమ్మి ఓ నీచుడికి పది లక్షలకి ష్యూరిటీ ఉన్నాను. వాడా సొమ్ముతో పరారైపోతే నేను ఉద్యోగం, పరువు పోయినా తీర్చుకోలేని పరిస్థితిలో చిక్కుబడిపోయాను. పిరికివాడిలా ఆత్మహత్య చేసుకుని భార్యాబిడ్డలని అనాథలని చేసే తెగింపు లేక ఏ ప్రభుత్వోద్యోగాన్ని కాపాడుకోవడానికి మీ విషయం దాచి ఉంచానో దానికే రాజీనామా చేసి రహస్యంగా కాకినాడ వదిలి పారిపోయి వచ్చేశాం. భీముడు అప్పటికే మీ నాన్నగారి సహకారంతో ఢిల్లీ వెళ్లిపోయాడు కనుక వాడికి మా బాధలు తెలియవు. నా పరిస్థితి మెరుగుపడ్డాక, నేను మళ్లీ మీ కోసం

వచ్చాను. కానీ అప్పటికే ఏళ్ళు గడిచిపో యాయి. మీరు సర్వవరం వదిలి అజ్ఞాతం లోకి వెళ్ళిపోయారు. కేవలం నా భార్యాబి డ్డల గురించే ఆలోచించి తొందరపడిన నా తప్పు కారణంగా ఆడపిల్లవైన నువ్వు ఇన్ని బాధలు పడవలసివచ్చింది. ఈ రోజు రాఘ వరావు బావగార్ని చూస్తే నా తప్పు నన్ను నిలేస్తున్నట్లు అనిపించింది. అందుకే మన స్ఫూర్తిగా కోరుతున్నాను. నన్ను క్షమిం చమ్మా" చేతులు జోడించబోయాడు.

దాక్షిణ్య గభాలున వచ్చి ఆ చేతుల్ని పట్టు కొని "అయ్యో! ఆశీర్వదించాల్సిన చేతుల్ని జోడించి మమ్మల్ని శపిస్తారా మామయ్యా. నిజం చెప్తున్నాను. నాకెవరి మీదా కోపం లేదు. నా జీవితంలో ఆనాడు ఆ మార్పే జరగకపోతే నాలో జీవితం పట్ల పట్టుదల, ఆత్మ విశ్వాసం, సమస్యలతో పోరాడే తత్వం అలవడేవి కావేమో! ఈ దేశంలోని లక్షలాది ఆడపిల్లల్లా నేనూ నూతిలో కప్పలా నాదైన ఇరుకు ప్రపంచమే సర్వస్వమనే భ్రమలో ఉండిపోదును. అందుకు నేనే మీకు కృతజ్ఞ తలు చెప్పాలి" అంది.

గుమ్మం దగ్గర నిలబడి వాళ్ల సంభాషణ వింటున్న భీమేష్ విసుక్కున్నాడు.

"మీ కోడలి దగ్గర మాటలతో మాయ చేయగలిగే అద్భుతమైన శక్తి ఉంది, వినే ఓపిక ఉంటే మీ ఇష్టం. అక్కా, బావ పిలు స్తున్నారు. బస్సుకి టైమ్ అవుతోంది, ఆపై మీ ఇష్టం" ఓరగా దాక్షిణ్యనే చూస్తూ అన్నా అతని గొంతులో దక్ష తల్లిదండ్రులను అర్థం చేసుకున్న తాలూకు రిలీఫ్ ధ్వనించింది.

"నీకు అవసరమైనవన్నీ గీత తెచ్చి ఇచ్చింది. మేము మూడు రోజుల్లో వస్తాం జాగ్రత్తగా ఉండండి" హెచ్చరించి బయలుదే రారు అంతా.

భీమేష్ వాళ్లతో వెళ్లలేదు. కారు ఎక్కించి సాగనంపి, గేటు మూసి వచ్చాడు. గుమ్మంలో నిలబడిన దక్ష లోపలికి వచ్చి సోఫాలో కూలబడి అలసటగా కళ్ళు మూసుకుంది వెనక్కి వాలి.




"దక్షా, నేను నీతో కొన్ని విషయాలు మాట్లాడాలి. వినే ఓపిక ఉందా?" ఎదు రుగా కూర్చుంటూ అడిగాడు.

దక్ష కళ్లు తెరవలేదు. "అక్కర లేదు. ఏం జరిగిందీ అన్నది గీత కొంత చెప్పింది. అత్తయ్య మామయ్యా కొన్ని నిజాలు చెప్పారు. దాదాపు సంవత్సర కాలపు నీ పరి చయం నీ మనసును చెప్పింది. నాకింకేం సంజాయిషీలూ అక్కరలేదు"

భీమేష్ మొహం తేటపడింది. "అంటే... నీ పట్ల ఇన్నాళ్ళ నా ప్రవర్తనలో తప్పు లేదని నువ్వు ఒప్పుకుంటున్నావా?" అను మానంగా అడిగాడు.

కళ్ళు తెరిచి చిరునవ్వుతో "అంతే కాదు నీ స్థానంలో నేనున్నా అలాగే ప్రవర్తించే దాని నని కూడా నమ్ముతున్నాను. సరేనా!" నిర్ధా రిస్తున్నట్లు అంది.

లేచి వచ్చి పక్కన కూర్చుంటూ "సారీ... థాంక్స్ లాంటి మొక్కుబడి మాటలేమైనా చెప్పాలా?" కొద్దిగా ఆమె వైపు తిరిగి అడి గాడు.

బడలికగా నవ్వింది. "నాకు చాలా ఆక లిగా ఉంది. కానీ లేవాలనిపించడం లేదు. ఈ చీర మార్చుకొని ఏ నైటీనో వేసుకోవా లని ఉంది. అందుకూ ఓపిక లేదు. ఇలాగే పడుకోవాలనిపిస్తోంది"

భీమేష్ కొద్దిగా ఆలోచించి వెళ్లి ఫ్రిజ్ లోంచి పళ్ళూ, స్వీట్లు తీసుకొచ్చి అందిస్తూ, "నువ్వివి త్వరగా కానిస్తే చీర మార్చే పని

కూడా చేసేస్తాను" కొంటెగా అన్నాడు.

దక్ష బదులు పలకలేదు. ఆతృతగా తిన డంలో నిమగ్నమయ్యింది. భీమేష్ నిజం గానే వీధి తలుపులు మూసి నైటీతో వచ్చాడు. పక్కన కూర్చుని 'లేస్తావా...? నైటీ వేస్తాను' అడిగాడు.

"ఇదెక్కడ దొరికింది? "

"దొరకడం కాదు. ఇక్కడకు వస్తూ నీ బట్టలు, వస్తువులు కొన్ని ముందు జాగ్ర త్తగా తీసుకొచ్చింది"

ఖాళీ చేసిన పాలగ్లాసుని టీపాయ్ మీద పారేసి అతన్ని సరిగ్గా జరుపుకొని ఆ ఒళ్లో పడుకుంటూ, "ఊహూ! ఇప్పుడేం వద్దు. ముందు నేను నీకో విషయం చెప్పాలి. ఇన్నాళ్లు నా జీవితం నా వాళ్ల గురించి. షాపు గురించి ఆలోచించుకొనే ఒత్తిడిలోనే గడిచిపోయింది. అందుకేనేమో ఇరవై రెండేళ్ల ఆడపిల్లలో ఉండే ఎమోషనల్ ఫీలింగ్స్ నాలో పెద్దగా లేవు. ఇప్పటికీ నాకు నువ్వు మంచి స్నేహితుడిలాగే అనిపి స్తున్నావు. నువ్వు నా భర్తవి అని నాకు నేనుగా ఫీలయ్యేదాకా నేను నీకు మనస్ఫూ ర్తిగా దగ్గర కాలేను. అందుకు ఎంత టైమ్ పడుతుందో నాకే తెలియదు. నీకేం అభ్యం తరం లేదుగా" భయంగా అడిగింది.

భీమేష్ మృదువుగా నవ్వి ఆమె నుదుటన చుంబించి చెప్పాడు. "జీవితకాలం కలిసుం డాల్సిన వాళ్లం మనం. నువ్వు నువ్వుగా



నాదానిని కావాలనే ఆలోచనతోనే నా భార్య వని తెలిసినా నీకు చెప్పకుండా మౌనంగా ఉన్నాను. కేవలం శారీరక అవసరాల కోసం పెళ్లిని, తాళిని అడ్డుపెట్టుకునే ఇమెచ్యూర్డ్ పరిస్థితిని మనం దాటి వచ్చేశాం. కనుక డోంట్ వర్రీ. నువ్వు ప్రశాంతంగా, సంతోషంగా ఉండడమే నాకు కావాలి"

దాక్షిణ్య కళ్లు సంతోషంగా మెరిశాయి. "నిజంగానే చాలా రోజుల తర్వాత చాలా ప్రశాంతంగా ఫీలౌతున్నాను. ఓ వంద టన్నుల బరువైన బండ తలమించి దించుకున్నంత హాయిగా ఉంది. నాన్న ఆరోగ్యంలో షాక్ ట్రీట్‌మెంట్ విపరీతమైన మార్పులు లేకపోయినా ఆయన ధోరణి పెద్దగా మారలేదు. చిన్నూ స్కూల్లో ఇన్నాళ్లు గార్డియన్ సైన్ నేను చేసేదాన్ని కానీ, ఇప్పుడు తండ్రి సంతకం కావాలంటున్నారట. అక్క చిన్నూ తన కొడునేననే నిజం చెప్పేస్తానంటోంది. అక్కకి బిడ్డ ఉన్న సంగతి భాస్కర్‌కి తెలియదు. వాళ్లు వాడిని మా తమ్ముడనుకుంటున్నారు. నిజం తెలిస్తే ఎలా రియాక్టవుతారో తెలియదు. చిత్ర పెళ్లికి ఏర్పాట్లు చెయ్యాలి. బ్యూటీషియన్ అవ్వాలన్నది దాని కోరిక. అది నెరవేరేలా చూడాలి. షాపును భాస్కర్ చూస్తాడో లేదో. చూడనంటే అదో సమస్య. ఆలోచిస్తే ఇలా చాలానే సమస్యలు కనిపిస్తున్నాయి. ఇదివరకు ఎంత చిన్న సమస్యయినా భూతద్దంలో చూసినట్లుగా పెద్దగా కనిపించి భయపెట్టేది. ఇప్పుడు మాత్రం ఎంత పెద్ద సమస్యనైనా నీ సహకారంతో తేలిగ్గా గెలవగలననే ధైర్యం కలుగుతోంది. నిజంగానే మనసు చాలా ప్రశాంతంగా ఉంది"



చెప్తున్నదల్లా తలుపు చప్పుడవ్వడంతో ఆగిపోయింది. భీమేష్ వెళ్లి తెరిచాడు.

"డిస్టర్బ్ చేశామా?" అంటూ వచ్చారు శ్రీకాంత్, గీత.

"నువ్వు పుట్టింది అందుకేగా" వెక్కిరించాడు. గీత వాళ్ల సంభాషణ పట్టించుకోకుండా లోపలికి నడిచింది.

"ఎలా ఉన్నావు?" దగ్గరికి వెళుతూ ఆత్రంగా అడిగింది.

"అన్యాయం గీతా! ఇంకా ఈ ఇంట్లో తను అడుగుపెట్టి, నువ్వు నీ ఫ్రెండ్‌ని వదిలివెళ్లి ఒక్కరోజు కూడా కాలేదు. ఎలా ఉన్నావు? అని అడగడంలో అర్థం ఏమిటి?" పోట్లాడుతున్నట్లు అడిగాడు భీమేష్.

"నిజంగానే మీ మగాళ్లకి అర్థం కాదు" గీత భుజాల చుట్టూ చేతులేసి వెక్కిరించింది దాక్షిణ్య.

"ఓ.కే, ఓ.కే గొడవలు వద్దు. భీమా, దక్షా, నేనూ గీతా వచ్చే నెల పెళ్లి చేసుకోవడానికి అమ్మా, నాన్న నిర్ణయించారు. అది చెప్పేందుకే వచ్చాం" శ్రీకాంత్ మధ్యలో కలగజేసుకుంటూ అన్నాడు.

"మరి అప్పుడెప్పుడో ముప్పై ఏళ్ల తర్వాత పెళ్లి పిల్లలు ఈలోగా జీవితం అంతా ఫుల్ ఎంజాయ్ అని కబుర్లు చెప్పావు" శ్రీకాంత్ భుజం మీద చరుస్తూ హేళనగా అడిగాడు భీమేష్.

బుర్ర గోక్కుంటూ గీతకేసి చూశాడు శ్రీకాంత్. దక్ష భుజాల వెనక తల దాచుకొని నవ్వునాపుకుంటోంది గీత. అదీ అడిగి చూశాను. పెళ్ళాంగా జీవితాంతం దక్షలా ఎదురు చూడగలను కానీ, ప్రియురాలిగా మూడేళ్లు ఉండడం కుదరదంది. ఇంకేం చేయను. తను మారదని తెలిసి నేనే నా నిర్ణయం మార్చుకున్నాను" నసిగినట్లు చెప్పాడు.

అతను చెప్పిన తీరుకు ముగ్గురూ నవ్వునాపుకోలేక పకపకా నవ్వేశారు. వాళ్ల నవ్వులతో శ్రీకాంత్ కూడా శృతి కలిపాడు. ✦




## గగనాలు దాటిన గద్ద

'నిన్ను వదలి నేను పోలేనులే... వెళ్లినా మూన్నాళ్లు ఉండలేనులే' అని ఆ పక్షిరాణీవారు ఎంతెంతో దూరాలు దాటేసి ముంగిట్లో వాలడం చూసి దాని యజమాని మక్కువతో ముక్కున వేలేసుకున్నాడు. ఓహోహో విహంగమా... అలసి సొలసి వచ్చితివా అంటూ ఆనందంగా అక్కున చేర్చుకున్నాడు. వాళ్ల పునఃకలయిక వెనుక ఉన్న పిట్ట కథలోకి వెళ్తే... టిటస్ వాడ్డిల్ (21) అనే యువకుడు లూసీ అనే ఓ ఆఫ్రికన్ గద్దను మోజుపడి పెంచుకున్నాడు. దానికి మంచి ధర పలకడంతో 33 వేల డాలర్లకు అమ్మేశాడు. మూడేళ్ల వయసున్న ఆ గద్దను కొనుక్కున్న వ్యక్తి దాన్ని బెర్క్‌షైర్‌లోని రీడింగ్ పట్టణంలో తానుంటున్న ఇంటికి తీసుకెళ్లాడు. అక్కడకు చేరిన కొన్నాళ్లకే లూసీ మాయమైపోయింది. రెండు వారాల తర్వాత నార్త్ యార్క్‌లోని మాల్టాం పట్టణంలో టిటస్ ఇంటివద్ద ప్రత్యక్షమయింది. 'బయటకు వెళ్లివస్తున్న నేను మా ఇంటిదగ్గరి రాతిగోడ మీద వాలి ఉన్న లూసీని చూసి నా కళ్లను నేనే నమ్మలేకపోయానం'టూ బోల్డంత ఆశ్చర్యాన్ని ప్రకటించాడు టిటస్. రీడింగ్‌లో లూసీ మాయమైన రోజు పెనుగాలులు వీచాయి. లూసీ ఆ గాలుల్లో చిక్కి ఉత్తరదిశగా సాగి ఉంటుంది. కానీ అది ప్రయాణించిన దూరమూ నోరెళ్లబెట్టేలా చేస్తోంది. అది మామూలు దూరం కాదు. 200 మైళ్లు ఎగురుకుంటూ మళ్లీ అది నన్ను చేరడాన్ని ఇప్పటికీ నేను నమ్మలేకపోతున్నాను. తొమ్మిదేళ్ల నుంచి గద్దల్ని పెంచుతున్నాను. నాకు తెలిసి ఏ గద్ద అయినా 10 మైళ్ల దూరాన్ని మించి ప్రయాణించదు. బహుశా 'లూసీకి ఇక్కడే బాగుండి ఉంటుంది. ఇక దాన్ని నేనే ఉంచేసుకుంటా'నంటూ లూసీని కొన్న వ్యక్తికి 33 వేల డాలర్లు తిరిగి ఇచ్చెయ్యడానికి నిశ్చయించుకున్నాడు టిటస్. అదీ పెంచిన ప్రేమంటే!

'ఇది కలయో, క్రైస్తవ మాయో... ఈ వైద్య వింతను ఏమని వర్ణింతుము' అని వైద్యులు తెగ 'హా'శ్చర్యపోతుంటే 'ఏ మాయ యైతేనేమి... ఓ ప్రాణము దక్కిన శుభవేళ ఇదీ' అని ఆ కుటుంబసభ్యులు బోల్డంత సంబరపడిపోతున్నారు. ఈ హాశ్చర్య సంబరాలకు కారణం జీవన్మరణ సరిహద్దులో గడిపి 'హద్దు' దాటి పోతాడనుకున్న వ్యక్తి ఉన్న ఫళాన లేచి కూర్చోవడమే కాదు, అందరి మధ్యా తిరగడమే. ఎంఫీసెమా అనే వ్యాధి పీడితుడు బ్రియాన్ పావోల్ కోమాలోకి వెళ్లడంతో అతణ్ణి కృత్రిమ పరికరాల సాయంతో బతికిస్తూ వచ్చారు. ఇక లాభం లేదనుకున్న వైద్యులు అతనికి అమర్చిన ప్రాణాధార పరికరాల్ని తొలగించారు. ఆ తర్వాత కూడ అతడు శ్వాస పీల్చుకోగలగడమే కాక పది రోజుల్లోపే కోలుకుని లేచి తిరగడం మొదలెట్టాడు. కూతురి వివాహానికి హాజరయ్యాడు. "వైద్యులు జరగబోయే విషాదానికి మమ్మల్ని మానసికంగా సిద్ధం చేశారు. పరిస్థితి చూస్తే వాళ్లు చెప్పేది నిజమేన




## ఆరోగ్యానికి 'కిక్'

'తైలం... మద్యం... కాదేదీ ఆరోగ్య సంరక్షణ కనర్హం' అంటూ చెకోస్లోవేకియాలోని ఓ కుటుంబం బాటిళ్లతో బాకా ఊదేస్తోంది. అంతేకాదు... ప్రపంచంలో ఇలాంటి కేంద్రం మరి లేనేలేదోయి. మాదే ప్రథమమోయి... రావోయి అంటూ కస్టమర్లను స్వాగతిస్తోంది. ఆ కుటుంబం అంతగా గొప్పలు పోతూ ఆనంద నాట్యం చేయడానికి కారణం ప్రపంచంలోనే మొదటి బీరు ఆరోగ్య కేంద్రం దాని సొంతం కావడమే. చోడోవా ప్లానా అనే ఊళ్లో తమ కుటుంబానికి చెందిన బ్రీవరీ సెల్లార్‌లో ఈ కేంద్రాన్ని ప్రారంభించింది. అందులో బీరు స్నానాలు, బీరు మర్దనల వంటి సేవలు బీరు సౌందర్య సాధనాలు లభిస్తాయట. ఆ సెల్లార్‌లో ఏదో ఒక భాగాన్ని కాక మొత్తాన్ని ఈ కేంద్రంగా మార్చేయడమేగాక విక్టోరియా శైలి తరహా ఏడు భారీ స్నానశాలల్ని ఏర్పాటు చేశారు. ఆ స్నానశాలల్లో ఎంచక్కా బీరులో ఈత కొట్టొచ్చునట. అంతేకాదండోయ్ స్నానశాలకు అనుబంధంగా ఉన్న బార్‌లో బీర్ సేవనం కూడా చేయొచ్చునట. వినియోగదారుల్ని ఆకర్షించడం కోసం ఆ కుటుంబం ప్రత్యేకంగా వారాంతపు ప్యాకేజీలనూ ప్రకటిస్తోంది. ఈ కేంద్రం యజమాని జిరి ప్లైవ్‌కా వివిధ రకాలైన బీరు చికిత్సల గురించి ఏకరువుపెడుతూ, చర్మవ్యాధులు సహా అనేక రకాల వ్యాధులు, అవయవాల స్థితిగతులకు బీర్ చికిత్స కారిగా పనిచేస్తుందని బాటిల్ బజాయించి మరీ బడాయిపోతున్నాడు. విలాసవంతమైన సంప్రదాయ ఆరోగ్య, మర్దన కేంద్రాలకు వెళ్లలేని పురుషులకు తక్కువ ఖర్చుకాగల తమ కేంద్రం ఆకర్షణీయం కాకతప్పదనీ ధీమా వెలిబుచ్చుతున్నాడు. బీరుకు చికిత్సా ధర్మాలున్నాయని మేము ప్రగాఢంగా విశ్వసిస్తున్నాం. అందుకే వివిధ రకాల చికిత్సలు అందజేస్తున్నాం. మాది అన్ని హంగులూ ఉన్నా పూర్తి స్థాయి బీరు ఆరోగ్య కేంద్రమని పేర్కొన్నాడు.

## మృత్యుంజయుడు

నిపించింది. అంతలోనే ఈ అద్భుతం జరిగింది. వైద్యులు, నర్సులు ఇలాంటి ఘటన ఇంతకు ముందెన్నడూ చూడలేదని ఆశ్చర్యపోయారం"టూ బ్రియాన్ కూతురు అన్నెమేరీ ఆ సంఘటన గురించి వివరించింది. నా ఊపిరి తిత్తులు బాగా దెబ్బతిన్నాయి. రోగ నిరోధక శక్తి పూర్తిగా క్షీణించిపోయింది. కానీ దృఢ చిత్తంతో, స్థైర్యంతో నేను మామూలు మనిషిని కాగలిగానని బ్రియాన్ పేర్కొ-

-న్నాడు. కుమార్తె పెళ్లిరోజు ముహూర్తానికి మూడు గంటల ముందు అతగాడు ఆస్పత్రి నుంచి డిశ్చార్జి అయ్యాడు.



చతుర కథలు

# బహుమతి

గుబ్బల సత్యనారాయణమూర్తి

సుదర్శన రావుకు సామాజిక స్పృహ కొంచెం ఎక్కువ. రోడ్డుమీద జరిగిన ఏక్సిడెంట్‌లో గాయపడిన వ్యక్తిని ఎవరూ పట్టించుకోకపోతే అతణ్ణి తీసుకువెళ్లి హాస్పటల్లో చేర్చడం, రోడ్డుదాటడానికి అవస్థపడే అంధురాలిని చేయిపట్టుకొని రోడ్డు దాటించడం, పేవ్‌మెంటు మీద పడుకుని చలికి వణుకుతున్న ముసలివాడికి తన చొక్కా విప్పి కప్పడం, మోళీ సాహెబు బొచ్చెను తనే తీసుకొని డబ్బులు వసూలు చేసి ఇవ్వడం వంటివి చేస్తూ ఆత్మానందం అనుభవిస్తుంటాడు.

ఆ రోజు సుదర్శన రావు బంధువు ఇంట్లో పెళ్లి. ఊరికి వెళ్లడం కోసం బస్‌స్టాండ్‌లో నిలబడి ఉన్నాడు. ఇంతలో సుమారు ఓ పది సంవత్సరాల వయసున్న ఓ కుర్రాడు కనిపించాడు. ఆ కుర్రాడు ఇంట్లోంచి పారిపోయి వచ్చి ఉండొచ్చునని అనుమానం నాటుకుంది. ఆ పిల్లాణ్ణిని చూస్తూ "ఏయ్! అబ్బాయ్! ఇలా రా" అని పిలిచాడు. ఆ కుర్రాడు భయంభయంగా అతడిని సమీపించాడు.

"ఏ ఊరు మీది? ఎవర్నువ్వు? ఇంట్లోంచి పారిపోయి వచ్చావ్ కదూ? " గద్దించి అడిగాడు. ఆ కుర్రాడు సమాధానం చెప్పకుండా పరుగులంకించుకున్నాడు. సుదర్శన రావు వెంటనే ఎలర్టై వెంబడించాడు. ఎలాగైతేనేం ఆ కుర్రాణ్ణి పట్టుకోగలిగాడు.



"పద పోలీస్‌స్టేషన్‌కి" అని అతన్ని చెయ్యిపట్టుకుని పోలీస్ స్టేషన్‌కు తీసుకెళ్ళాడు.

"సార్. ఈ అబ్బాయి ఇంట్లోంచి పారిపోయి వచ్చాడట. అడ్రసు ఏదో చెప్తున్నాడు. ఇతడిని వాళ్ల ఇంటికి చేర్చండి సార్" అన్నాడు పోలీసుల్తో.

"చాలా థాంక్స్ మాస్టారూ! మీరు వెళ్ళండి. మీరు మీ అడ్రసు ఇచ్చి వెళ్ళండి. మేం చూసుకుంటాం" అన్నారు పోలీసులు.

ఈ రోజు ఓ మంచి పని చేయగలిగాను. తప్పిపోయిన ఓ కుర్రాణ్ణి వాళ్ళ తల్లిదండ్రుల దగ్గరకు చేర్చగలిగాను అని తెగ సంబరపడిపోయి తను వెళ్ళాల్సిన ఊరికి వెళ్ళాడు సుదర్శన రావు. మర్నాడు ఊరి నుంచి ఇంటికి తిరిగి వచ్చేసరికి అతడికోసం ఓ పోలీస్ కానిస్టేబుల్ ఎదురుచూస్తున్నాడు.

"సార్! సుదర్శన రావు గారు మీరేనా?" అడిగాడు కానిస్టేబుల్ "ఔనండి. నేనే ఏం?"

"మిమ్మల్ని మా ఎస్సై గారు స్టేషన్‌కు తీసుకురమ్మన్నారు"

ఓహో! ఆ అబ్బాయిని ఇంటికి చేర్చడంలో సహాయపడినందుకు తనకు అతని పేరెంట్సు ఏదైనా బహుమతి పంపించి ఉంటారనుకొని ఆనంద పడిపోతూ కానిస్టేబుల్ వెంట స్టేషన్లో అడుగు పెట్టాడు సుదర్శన రావు.

"మీరేనా సుదర్శన రావు?" అడిగాడు ఎస్సై

"ఔను సార్, నేనే"

"మిస్టర్! యు ఆర్ అండర్ అరెస్ట్"

"అరెస్టా? ఎందుకు సార్?" ఆశ్చర్యపోతూ అడిగాడు సుదర్శన రావు.

"ఎందుకా? మీరు ఆ కుర్రాణ్ణి మీకు అప్పగించారు. కాని అతని మెళ్ళో ఓ బంగారు గొలుసు ఉండాలట. అది మీరే తీసుకున్నారని ఆ కుర్రాడు చెప్తున్నాడు. మర్యాదగా ఆ గొలుసు తెచ్చివ్వండి"

"నేనా? గొలుసా? నాకేం తెలీదు సార్" సుదర్శన రావు ఎంత చెప్పినా ఎస్సై విన్లేదు. అతణ్ణి సెల్‌లో వేయించాడు.

ఇంతకీ జరిగిన అసలు సంగతి ఆ కుర్రాడు చెప్పిన అబద్ధంతో మరుగున పడిపోయింది. బడి ఒక బందిఖానా ఇల్లొక నరకంలా అనిపించి స్వేచ్ఛగా నాలుగు రోజులు తిరిగి రావచ్చని ఆ కుర్రాడు ఇంట్లోంచి పారిపోయాడు. మరి సినిమాలు చూడ్డానికి, హోటల్లో కావలసినవి తినడానికి డబ్బు? తన మెళ్లో ఉన్న ఒంటిపేట గొలుసును ఓ షాపులో అమ్మి ఆ సొమ్ముతో జల్సా చేశాడు. కాని నేరం పాపం సుదర్శన రావు మీదికి తోసి అబద్ధం చెప్పాడు. పిల్లవాడు అమాయకంగా ఫోజు పెట్టి చెప్పిన మాటల్ని అంతా నమ్మారు. అదీ సంగతి!

పుణ్యానికి పోతే పాపం ఎదురొచ్చిందంటారు ఇదేనా? ఇదే కాబోలు అనుకుంటూ సెల్‌లో కూర్చుని ఆలోచనలో పడ్డాడు సుదర్శన రావు నిస్పృహతో. ✦


## చందాదారులకు విజ్ఞప్తి

**చతుర, విపుల**

ఒక్కొక్కటి విడిప్రతి రూ. 7 /-
సంవత్సర చందా రూ. 72 /-
విదేశాలకు
సంవత్సర చందా (ఎయిర్ మెయిల్)
రూ. 360 /- డాలర్లు $ 8.

ఎం.ఒ. లేదా డిడి
పంపించవలసిన చిరునామా.

మేనేజర్, వసుంధర పబ్లికేషన్స్,
**చతుర, విపుల**
ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ,
హైదరాబాద్- 500 082.

# గురుతత్వమసి



భమిడిపాటి సోమయాజి

ఆరోజు గురువు గారు "భక్తితత్వం" గురించి ఒక క్లాసు తీసుకున్నారు.

"భక్తి అంటే అస్తమానూ, అదే పనిగా దేవుడికి పూజ చెయ్యడం కాదు. ముందు మన పన్లు చేసుకుంటూ, ఖాళీ సమయంలో ఒక హాబీగా పూజ చెయ్యాలి" గురువుగారు చెప్పింది విన్నాక శిష్యుడికో సందేహం వచ్చింది. అదే అడిగాడు.

"బ్రేక్ ఫాస్ట్ అయిన తర్వాత పూజ చెయ్యొచ్చా"

"ఏం తప్పులేదు. రెండేసి రకాలు టిఫిన్లు ఒకేసారి చేసి పూజ చెయ్యకూడదు. వాంతవుతే పట్టుబట్టలు పాడవుతాయి. అందుకని ఒక రకం తినాలి" గురువు సమాధానం.

"శివాయ విష్ణురూపాయ, విష్ణురూపాయ శివయే అంటారు కదా! ఇది నిజమేనా!" శిష్యుడి మరో సందేహం.

"చాలా తప్పు, వీళ్ళ తత్వాలే వేరు. శివుడిది అర్ధనారీశ్వరతత్వం. విష్ణుతత్వం యిదమిద్ధమని చెప్పలేం. ఆయనకి చాలా మంది భార్యలు కదా. ఎంతమందికని తన శరీరంలో భాగం యిస్తాడు. అందుకని ఎవరికి వారు అందుకనే కార్తీక మాసంలో విష్ణువుని, ధనుర్మాసంలో శివుడ్ని పూజింపకూడదు. పైగా శివరాత్రినాడు ఏ కారణం చేతనైనా విష్ణువు ప్రత్యక్షమైనా ఎవరో తెలియనట్లు నటించాలి. అలాగే వైకుంఠ ఏకాదశినాడు శివుడు ఎవ్వరో తెలియనట్లుండాలి. అందుకనే భజన చేసే విధము తెలియండి అనే కీర్తన"

"తత్వమసి" అంటే ఏమిటి గురువుగారూ!

"పురాతన ధర్మాన్ని మసి చెయ్యడం. అప్పుడు యిక ఆతత్వ విచారణ ఉండదు. ప్రస్తుత కాలానుగుణంగా బ్రతికెయ్యొచ్చు" ధర్మసూక్ష్మాన్ని వివరించారు గురువు.

"చాలా సంతోషం గురువుగారు. మీరు చెప్పినట్లు ఒక ఆశ్రమం స్థాపించాను. చాలా విరాళాలు వస్తున్నాయి. కాని చాలామంది విరాళాలు ఎక్కువిచ్చిన వారిని చూసి చిరునవ్వు చిందిస్తున్నానని నింద వేస్తున్నారు. దీనికేం చెయ్యాలి గురుదేవా? "

"అమాయకుడా! అందుకనే నాలా పెద్ద గెడ్డం పెంచెయ్యి. దీనివల్ల అసలు నవ్వుతున్నామా నవ్వితే ఎవర్ని చూసి నవ్వుతున్నాం అన్న విషయం ఎవ్వరికీ తెలియదు"

"ఔను నువ్వు ఇస్తానన్న విరాళం తెచ్చావా? "

"గురు తత్వమసి" నింపాదిగా చెప్పాడు శిష్యుడు.



# అక్కడే.. బెటర్

గరిమెళ్ల నాగేశ్వరరావు

ఒక రాజకీయ నాయకుడు చనిపోయిన తర్వాత సరాసరి నరకానికి చేరుకున్నాడు. అక్కడ రకరకాల శిక్షల ననుభవిస్తూ మొత్తం మీద వంద సంవత్సరాలు గడిచిపోయాయ్.

అదేదో సినిమాలో చూపించినట్టు, వందేళ్ళ తర్వాత యమధర్మరాజుకి తను పొరపాటున ఆ రాజకీయ నాయకుడి ఆయుష్షు తీరక ముందే తొందరపడి నరకానికి తీసుక వచ్చేసి నట్టు తెల్సింది.

కాస్సేపు నాలుక్కరుచుకొని, తర్వాత గోళ్ళు గిల్లుకొని, తల బాదుకున్నాక, తన తప్పుని సరిదిద్దుకోవాలని నిర్ణయించుకున్నాడు.

ఆ రాజకీయ నాయకుణ్ణి పిలిచి, జరిగినదంతా వివరించి, గట్టిగా లెంపలేసుకొని... తన తప్పుని సరిదిద్దుకోవడంలో భాగంగా తిరిగి ఒక నూరేళ్ళ పాటు అతడిని భూలోకానికి పంపిస్తామని చెప్పాడు.

పార్టీ టికెట్ దొరికినంత సంబరపడుతూ... రాజకీయ నాయకుడు ఎగిరి గెంతేసి... ధామ్మంటూ భూమ్మీద పడ్డాడు.

కళ్లు తెరిచి చూసేసరికి, ఒక మహా నగరంలో జనం మధ్యన ఉన్నాడు.

భూలోకాన్ని చాలా కాలం తర్వాత చూసేసరికి ముందుగా అతడికి 'మందు' గుర్తొచ్చింది. నోరూరుతూంటే... బెల్టు షాపుల కోసం చుట్టూ చూశాడు. కనుచూపు మేరలో ఎక్కడా అతడికి బ్రాందీ షాపు తగల్లేదు. ఉసూరుమంటూ దారంట పోతోన్న ఒకణ్ణి పిలిచి...

"బాబూ... బ్రాందీ షాపు ఎక్కడ? " అని అడిగాడు.

ఆ వ్యక్తి అతగాణ్ణి కిందా మీదా, ఎగా దిగా చూసి నవ్వుతూ...

"ఎప్పుడో వందేళ్ళ కిందట సారా షాపులుండేవట... ఇప్పుడెవరూ తాగరు" అన్నాడు.

ఒక్కసారిగా నీరసం ముంచుకొచ్చింది నాయకుడికి.

"పోతే పోనీలే..." కనీసం నలుగురు అనుచరులనైనా కూడగట్టుకుందాం" అనుకొని, మళ్ళీ ఆ వ్యక్తి వైపు తిరిగి,

"ఇంతకీ నీ కేస్ట్ ఏంటి? " అన్నాడు నెమ్మదిగా.

ఆ వ్యక్తి మరోసారి పెద్దగా నవ్వుతూ... "మీరెవరండీ... బాబూ... పాత కాలం మనిషిలా ఉన్నారు. ఇప్పుడు కులాలూ, మతాలూ ఇలాంటివేం లేవు. అందరూ హాయిగా కలిసి మెలిసి ఉంటున్నారు" అన్నాడు.

ఈసారి మరింత ఆశ్చర్యపోయాడు నాయకుడు.

"అంతే కాదు... గతంలో లాగ ఇప్పుడు అల్లర్లు, మానభంగాలు, దొంగతనాలూ అవినీతీ... ఇవేవీ... కన్పించవు... అస్సలు పోలీస్‌స్టేషనే కనిపించదు మీకెక్కడా" అన్నాడు ఆ వ్యక్తి ఆనందంగా.

పూర్తిగా నీరు కారిపోయిన నాయకుడు... గట్టిగా "యమా..." అని అరిచాడు.

ఆ అరుపుకి తృళ్ళి పడ్డ యముడు ప్రత్యక్షమయ్యి "ఏంటి సంగతన్నాడు"

"ఇక్కడ కొట్టేందుకు మందు లేదట. రెచ్చగొట్టేందుకు కులం లేదట... చిచ్చు పెట్టేందుకు మతం లేదట... హాయిగా అనుభవించేందుకో కనీసం అవినీతి కూడా లేదట. ఇంక ఇక్కడ మాకేం పనుంటుందీ... దీనికంటే... అక్కడే బెటర్... నన్ను నరకానికే తీసుకుపో" అన్నాడు విలవిలలాడుతూ! 

## కథ వెనుక కథ

# సవాలు చెక్కిన శిల్పం

# తమసోమా జ్యోతిర్గమయ



జలంధర

విశ్వసాహిత్యం వెన్నెలసోనలా కురుస్తోంటే హాయిగా చదివి ఆనందించక... రాయడమెందుకు... అని నవ్వుతూ ప్రశ్నించే విశిష్టరచయిత్రి జలంధర. తండ్రి, మేనత్త మంచి రచయితలు కావడంతో బాల్యం నుంచీ ప్రముఖ సాహితీవేత్తల సాంగత్యం లభించడం తనకు లభించిన వరమంటారామె. వంద కథలు, మూడు నవలలు, ఎన్నో రేడియో నాటికలు, విభిన్న శీర్షికలు రాసిన జలంధర తనకు మాత్రం కథలు రాయడమే ఇష్టమంటారు. చిన్నప్పుడెప్పుడో ఉత్సాహంగా కలం పట్టిన జలంధరను వంద కథలు రాసేదాకా మరేమీ రాయొద్దన్నారట కొడవటిగంటి కుటుంబరావు. ఆ మాట ఆమె మనసులో నాటుకుపోయింది. అదొక సవాలుగా తీసుకుని చక్కటి కథలు రాసి శభాషనిపించుకున్నారు జలంధర. 'కథ జీవితానికి క్రాస్ సెక్షన్ లాంటిది. తక్కువ మాటల్లో జీవితసారాన్ని పొదగాలి. అందుకే నాకు కథలు రాయడమే ఇష్టం...' అని చెప్పారు జలంధర.

### అంశాల ఎంపికలో వైవిధ్యం

రచనకు ముడిసరుకుగా వైవిధ్యమైన సబ్జెక్టులు ఎంచుకుంటారు జలంధర. సంఘంలో తరచూ జరిగే సంఘటనలను చూసి ఎందుకలా జరుగుతున్నాయని ఆలోచించి... రచనకు ఉపక్రమిస్తానన్నారామె. అవుట్‌లైన్ ముందుగా అనుకునే ప్రారంభించినా రాయడం మొదలెట్టాక మలుపులు, కొత్తపాత్రల ప్రవేశం కథాగమనాన్ని బట్టి వాటంతటవే జరిగిపోతుంటాయి... అనే జలంధర కొన్నేళ్లక్రితం 'వనిత'లో సీరియల్‌గా వచ్చిన తన నవల 'తమసోమా జ్యోతిర్గమయ' గురించి ఎన్నో విషయాలు చెప్పారు. అది ఆమె రాసిన నవలల్లో మూడోది. స్వతహాగా మానవ సంబంధాల గురించి చక్కటి విశ్లేషణలు చేసే జలంధర ఈ నవల కథాంశాన్ని తాను ఎంచుకోలేదు. పత్రిక ప్రచురణకర్తల సూచనను సవాలుగా తీసుకుని దాన్ని ఒక ప్రయోగంలా భావించి రాశారు. 'తమసోమా జ్యోతిర్గమయ' గురించి ఆమె ఏమంటున్నారంటే..

### సవాలు విసిరిన సంపాదకుడు

'వనిత సంపాదకుల ప్రోత్సాహంతో నేను ఆ పత్రికకు ఎక్కువగా రాస్తూ ఉండేదాన్ని.

ఒకసారి మల్లాది లక్ష్మీనరసింహంగారు ఫోన్‌చేసి విశ్వనాథరెడ్డిగారు మీకు ఒక సబ్జెక్టు అవుట్‌లైన్ చెప్తారట. ఆ నవల మీరే రాయాలట..' అన్నారు. ఆయన చెప్పిన అవుట్‌లైన్... ఒక వివాహితుడు తన భార్య సోదరి... ప్రేమలో పడటం... దాన్ని కథానాయకుని కోణంనుంచి ఆలో చించి రాయాలి... ముగింపు వినూత్నంగా ఉండాలన్నారు. ఈ ముక్కోణ ప్రేమకథ చాలా సాధారణ అంశం. కానీ దాన్ని అసా ధారణంగా చెప్పాలన్నది ఆయన కోరిక. నాకు సరదాగానూ, సవాలుగానూ అన్పిం చింది. ఒక ప్రయోగం చేసి చూద్దామని మొదలెట్టాను. రెండు భాగాలు ప్రచురితమ య్యేటప్పటికి పాఠకుల నుంచి విపరీతమైన స్పందన. కొన్ని విషయాలు మేధోపరంగా మరీ ఉన్నత స్థాయిలో ఉన్నాయి.. స్థాయి కాస్త తగ్గించుకోమన్నారు కొందరు. ప్రయ త్నించి చాలా మార్పు తెచ్చుకున్నాను.

### అనూహ్యస్పందన

నవల ధారావాహికంగా వస్తున్నంతకాలం రచయిత్రిగా నేను, ప్రచురిస్తున్న సంపాద కులు, మా పాఠకులు... అందరం చాలా ఆనందించాం. పాఠకుల నుంచి బోలెడన్ని ఉత్తరాలు వచ్చేవి. ఒకసారి స్త్రీ సేవామందిర్ వారి కార్యక్రమానికి వెళ్తే ఆంధ్రరాష్ట్రం నలు మూలలనుంచి వచ్చిన ప్రముఖులు, పాఠ కులు నన్ను చుట్టుముట్టారు. 'అసలు మా ఊళ్లోఉండే ఈ తేజ మీకు ఎలా తెలుసు' అని ప్రశ్నించారు చాలామంది. బందరు, రాజ మండ్రి, హైదరాబాద్... ఒక ఊరని కాదు.. ప్రతివాళ్లూ తమకు తెలిసిన వాళ్లని ఆ పాత్రల్లో చూశారు. అప్పుడు అర్థమైంది నాకు.. ఆ నవల అంతగా ఆదరణ పొందడా నికి కారణం. కథాంశం కొత్తదికాదు. పాఠకులు తమ జీవితాలతో ఐడెంటిఫై చేసు కుంటేనే ఏ పాత్ర అయినా కథ అయినా విజయం సాధిస్తుందని తెలుసుకున్నాను.

### ఇంతకీ ఆ కథేంటంటే...

నవలలో కథానాయికలిద్దరూ అన్నద మ్ముల బిడ్డలు. అంటే అక్కాచెల్లెళ్లవుతారు. తమ్ముడు, అతని భార్య బాగా చదువుకొని అమెరికాలో ఉంటూ ప్రమాదంలో ప్రాణాలు కోల్పోతారు. వారి కుమార్తె సులక్షణ ఇండి యావచ్చి పల్లెటూళ్ళో నాన్నమ్మ దగ్గర పెరు గుతుంది. ఆ అమ్మాయినీ తన కూతురు పరిపూర్ణతో పాటు పట్నంలో బాగా పెంచా లనుకుంటాడు పెద్దవాడైన రాఘవరావు. కానీ ఇటుభార్య, అటు తల్లి పడనివ్వరు. దాంతో పల్లెటూళ్లో అమాయకంగా, ఏమాత్రం ప్రపంచజ్ఞానం లేకుండా సులక్షణ పెరిగితే, పట్నంలో తండ్రి పెంపకంలో మంచి వ్యక్తిత్వంతో పరిపూర్ణ పెరుగు తుంది. రాఘవరావు చెల్లెలి కొడుకే కథానా యకుడు తేజ. ఆవేశం, భావుకత్వం, మేధ... అతని సొంతం. ఉత్తరాలతో మేన మామ మనసు దోచుకున్న తేజ అనుకో కుండా అమ్మమ్మ ఒత్తిడితో సులక్షణను చేసుకుంటాడు. అప్పటికే పరిపూర్ణకి పెళ్లవు తుంది. భర్త మరొకరితో లేచిపోవడంతో విడాకులు తీసుకుని కాలేజీలో లెక్చరర్‌గా పనిచేస్తుంటుంది.

వివాహం తర్వాత సులక్షణలో ఎంత ముగ్ధమనోహరత్వం ఉన్నదో అంత మూర్ఖ త్వమూ ఉందని గ్రహిస్తాడు తేజ. వాళ్ల పక్కవాటాలోనే పరిపూర్ణ నివాసం. ఆమె పనిచేసే కాలేజీలోనే తేజ ఉద్యోగం. పరి పూర్ణ వ్యక్తిత్వం, పద్ధతి చూసి ఆరాధనలో పడిపోతాడు తేజ. అది ఎంత ఇబ్బంది కలి గిస్తున్నా ఆమెలోలోని స్త్రీమూర్తికి అదేదో తెలియని ఆనందమూ కలుగుతుంది. అది తప్పనీ తెలుసు. తండ్రి హెచ్చరికతో మేల్కొని తేజ సుఖంగా ఉండాలంటే సుల క్షణని మార్చాలని కంకణం కట్టుకుంటుంది

పరిపూర్ణ. ముందు మూర్ఖత్వంతో, అసూయతో అక్క మాట వినని సులక్షణ అత్త గారి దాష్టీకం, భర్త దూరంగా ఉండటం చూసి భయపడుతుంది. ఆ పరిస్థితుల్ని తాను ఎదుర్కోలేనేమోనని భయపడిన సులక్షణ పరిపూర్ణ ఒక్కర్తే తనకు ఆత్మీయురాలని గ్రహిస్తుంది.

వ్యాపారంలో భాగస్వామి మోసంతో అన్నీకోల్పోయి కుంగిపోయిన తేజను వెతుక్కుంటూ వెళ్తుంది పరిపూర్ణ. అతని లాంటి మేధావికి ఆ సమస్యలు ఏపాటివంటూ తేజ ఆత్మవిశ్వాసాన్ని పెంపొందిస్తుంది. దాంతో అతను కోలుకుని తిరిగి వ్యాపారంలో పుంజుకుంటాడు. అయితే తన ఐశ్వర్యానికి కారణం పరిపూర్ణ అనుకుంటాడు. ఆమెను తనదాన్ని చేసుకోవాలన్న తపనలో పడిపోతాడు. ఆమె ఒప్పుకోకపోతే సులక్షణను వదిలేస్తానని బెదిరిస్తూ ఉత్తరం రాస్తాడు. తేజ ఒక సైకాలజిస్టు దగ్గరకు కౌన్సెలింగ్‌కి వెళ్తున్నాడని తెలుసుకుని ఆయనను కలుస్తుంది పరిపూర్ణ. అతడి మనఃస్థితి తెలుసుకుంటుంది. ఉత్తరంలో తేజ చెప్పిన గడువు నాడు చీకట్లో కూర్చుని ఉంటుంది. మరో పక్క వెలుతురులో సులక్షణ వీణానాదం. తేజా! మీరు అటు వెళ్తే మనందరి జీవితాలూ బాగుంటాయి. ఇటు అడుగు వేశారా.. మీరు ఇంతగా ఆరాధించే నాకు ఆత్మహత్య తప్ప మరోదారి ఉండదు. నాకు బతకాలనుంది. నాకు ఒంటరితనం లేదు. నాలోనేను బతకగల శక్తి నాకు ఉంది. మనం మంచి స్నేహితులుగా బతికే అవకాశం నాకు ఇవ్వండి... అంటుంది.

స్వతహాగా మంచి వ్యక్తిత్వంగల తేజ ఆమెను అర్థం చేసుకుంటాడు. తనకెంతో ఆత్మీయురాలు, స్నేహమయి అయిన ఆమెను కోరుకుని ఇష్టంలేని చీకట్లోకి నడిపించడం కన్నా ఆమెను గౌరవించి స్నేహితురాలిగా ఆరాధించడంలోనే ఇద్దరికీ ఆనందం ఉందని గ్రహిస్తాడు. సులక్షణ దిశగా అడుగులు వేస్తాడు.

నిజానికి ఇలాంటి ముక్కోణపు ప్రేమకథలు మన సమాజంలో కోకొల్లలు. ఆయా వ్యక్తుల్ని బట్టి సమస్యలను వాళ్లు ఎదుర్కొనే విధానాన్ని బట్టి కొన్ని బయటకు వస్తాయి. చాలావరకు రావు. అందుకే పాఠకులు ఈ పాత్రలను తమకు పరిచితమైన వ్యక్తులుగా భావించారు. సాధారణంగా ఈ సబ్జెక్టుని స్త్రీ కోణంనుంచి చూసి రాయడం జరుగుతుంది. అలా కాకుండా పురుషుడి కోణం నుంచి ఆలోచించి మనస్తత్వాన్ని విశ్లేషించుకుంటూ వెళ్లడం కూడా పాఠకులకు కొత్తగా కనిపించింది. నచ్చింది.

నవలలో పరిపూర్ణ పాత్ర నాకు చాలా నచ్చింది. ప్రధానపాత్ర తానే అయినా ప్రేక్షకత్వం వహిస్తుంటుంది. దాంతో నిర్ణయాత్మక పరిస్థితుల్లో పరిణతితో ఆలోచించగలుగుతుంది. మనమైనా అంతే... మనం మనంగానే ఉండి సమస్య గురించి ఆలోచించినదానికన్నా కాసేపు మనని మర్చిపోయి మరో కోణం నుంచి ఆలోచిస్తే చాలా సమస్యలు తేలికగా పరిష్కారమవుతాయి.. నవలలో శారద పాత్ర కూడా నాకిష్టమే..

ఇక దీనికి వచ్చిన స్పందన గురించి చెప్పాను కదా... రెండు భాగాలు ప్రచురితమైనప్పటినుంచీ విపరీతంగా ఉత్తరాలు వచ్చేవి. బయటకు వెళ్లినప్పుడు నవల గురించే చర్చించేవారు. అన్ని వర్గాలవారినీ ఆకట్టుకుంది. సరదాగా ప్రారంభించినా విశ్వనాథరెడ్డిగారు ఇచ్చిన అంశానికి న్యాయం చేయగలిగాను. వారూ సంతోషించారు. నాకూ రచయిత్రిగా ఎంతో తృప్తి లభించింది.' అంటూ ముగించారు జలంధర.

సీరియల్‌గా ప్రచురితమైన ఈ నవల త్వరలో పుస్తకంగా రాబోతోంది.

– పద్మశ్రీ యలమంచిలి

# ఆత్మోన్నతికి సోపానం ప్రేమ

ఎవ్వరూ నడవని ఎడారిలో విరిసిన పూదోట ప్రేమ.

ప్రేమ ప్రభువు, రాజూ కూడా.

ప్రేమ విప్లవకారి కాదు.

కానీ సనాతన విధిరాతల్ని వదలి ఎవ్వరికీ తెలియని పవిత్ర గుహల్లోకి దారితీస్తుంది. తన రహస్య సంగీతాన్ని నాట్యాల్ని అనంతానికి ఆవిష్కరిస్తుంది.

ప్రేమంటే తన సంకెళ్ళు తెంచుకొన్న యవ్వనం!

స్వర్గలోక కాంతిని వెదజల్లే కెరటం!

ఆత్మలోంచి దూరాన విన్పించే నవ్వుల సవ్వడి!

నీ జ్ఞానాన్ని నిశ్శబ్దపరిచే ఆటవిక దాడి!

అది భూమిని పలకరించే నూతన ఉషోదయం.

నీ నా దృష్టి ఎప్పటికీ చేరలేని ఓ సుదినం.

తన అద్భుత హృదయంతో ఏనాడో గమ్యం చేరిన ఓ సత్యం!

ప్రేమనే అద్భుత స్వర్ణ సౌధంలో అనంతత్వం యావత్ సృష్టి కుటుంబాన్ని పట్టి ఉంచింది.




ప్రేమ అనిర్వచనీయమైంది అంటూనే దాన్ని నిర్వచించడానికీ, మాటల్లో బంధించడానికీ ప్రయత్నం చేస్తూనే ఉంటాం. భంగపడ్తూనే ఉంటాం. ప్రేమనేది ప్రతి వ్యక్తి తనను తాను ఆవిష్కరించుకొంటూ తన ఆత్మ పరిధిని విస్తరించుకుపోతూ మరొకరి ఆత్మోన్నతికి తోడ్పడడమే. ప్రేమనేది ఒక వలయం, ఒక వర్తులాకార ప్రక్రియ. అది వేరొకరి ఉన్నతికి తోడ్పడుతూనే నీవు కూడా వ్యక్తిగా పెరిగే స్వీయ పరిణామ క్రమం.

ప్రేమను అర్థం చేసుకొంటూ, విశ్లేషిస్తూ పోతే అందులో 'నిన్ను నువ్వు ప్రేమించుకోవడం, వేరొకర్ని ప్రేమించడం' అన్న రెండు విషయాలు ఉంటాయి. మన మీద మనకా ప్రేమ లేకపోతే వేరొకర్ని ప్రేమించడం అన్నది జరగదు. ప్రేమంటే ఎన్నో ఊహలు, అపోహలు తెలియని ప్రేమ గురించి ఎన్నో బాధలు, మానసిక రుగ్మతలు. అసలు ప్రేమంటే ఎలాగూ తెలుసుకోలేము. అది తెలియాలంటే ఎంతో ఆలోచన, వివేచన కావాలి. చచ్చేంత కష్టపడితే కాని దాని రహస్యాన్ని ఛేదించలేము. అలాంటప్పుడు ఏది ప్రేమ కాదో తెల్సుకుంటే కాస్త మంచిది కాదూ!

'ప్రేమలో పడడం' మనం రోజు పొద్దస్తమానం చూసే, వినే విషయం. ఇదో పెద్ద అబద్ధపు అభిప్రాయంగా ప్రపంచంలో పాతుకుపోయి ఉంది. ఈ 'ప్రేమలో పడడం' మొదలైనప్పుడు అది చాలా తీవ్రంగా ఉంటుంది. 'నేనతన్ని ప్రేమిస్తున్నాను', 'ఆమెను ప్రేమిస్తున్నాను' అని గట్టిగా అనేసుకొంటారు. ఈ ప్రేమలో పడడం అన్నది కేవలం లైంగిక సంబంధమైన ఒక భావన మాత్రమే. మనం ఎంతగానో ప్రేమించే పిల్లలు, స్నేహితుల విషయంలో ఇలా అన్పించదుకదా! ఈ ప్రేమలో అద్భుతంగా అన్పించే అనుభవం కొన్నాళ్ళకు ఆరిపోవడం కూడా అంతే నిజం. అంత మాత్రాన ఆ అనుభవం నిజం కాదని కాదు. మనిషి తన చుట్టూ ఏర్పర్చుకున్న నేను అనే పరిధి చెరిగిపోయి ఇద్దరు

వ్యక్తుల 'అహం' పరిధులు కలిసి ఇద్దరూ ఒక్కరే అనుకునే సమయంలో ఈ భావన కన్పిస్తుంది. అయితే ఇది అసంకల్పితంగా అప్రయత్నంగా జరుగుతుంది. ఆ తర్వాత తమ పరిధుల్లోకి తాము కుంచించుకుపోయాక ఆ తీవ్రత తగ్గి ప్రేమ కాదు, కేవలం ఆకర్షణగా మిగిలిపోతుంది. నిజమైన ప్రేమకు ప్రయత్నం అవసరం. ఆ ప్రేమను తన ఆత్మ పురోగతికి పనికొచ్చేలా చేసే నిబద్ధత, క్రమశిక్షణ అవసరం. ఈ 'ప్రేమలో పడి'న క్రమంలో అది నిజమైన ప్రేమకు అంకురంగా మారే అవకాశం లేకపోలేదు.

కానీ మన సంస్కృతిలోని కథలు, ప్రేమ గాథల్లో రాజకుమారుడు, రాజకుమార్తె ఒకరికోసం ఒకరు పుట్టి ఉంటారని చెప్పి చెప్పి పెళ్ళి తర్వాత వాళ్ళు ఇక ఆనందంగా అలా బతికేశారు అని కథలు ముగిస్తాం. అంటే ఆ తర్వాత కథ మనం చెప్పుకోవడానికి ఇష్టపడడం లేదనేగా! కథ కంచికి మనం ఇంటికి. కానీ ఆ తర్వాత ఆ కథ 'కంచె'లోకి పోతుంది. లోపల ఏం జరుగుతుందో ఎవరికీ తెలీదు; అక్కరల్లేదు. పెళ్ళి మాటతో ప్రేమకు కళ్ళెం పడుతుంది.

"నువ్వు లేనిదే నేను లేను, బతకలేను" అనేది యింకో భ్రమ. అది వేరొకరి మీద ఆధారపడడం, 'పరాన్న భుక్కుగా జీవించడం'. ఇక్కడ అది మానసిక రుగ్మత తప్ప మరేమీ కాదు. వాళ్లు ఎంతసేపు ఎదుటవారి నుంచి 'ప్రేమను' ఆశిస్తూ జీవించాలనుకొంటుంటారు. తాము ఒక ఖాళీపాత్రగా ఉండి ఎవ్వరికీ ఏమీ ఇవ్వలేరు.

ఇంకొందరు 'ఆత్మత్యాగమే ప్రేమంటూ, 'మేం ప్రేమను పంచిస్తున్నామని అయినా మమ్మల్ని తిరిగి ప్రేమించడంలేదం'టూ బాధపడ్తారు. ప్రేమ అనుకుంటూ ఒక వ్యక్తినో, వస్తువునో, హాబీనో తమదనుకుని, తమ పరిధిలో కలిపేసుకొని తమకు తగిలించేసుకుంటుంటారు. ఊహల్లో, మాటల్లో వాళ్ళు ఆ పని వేరు కాదనుకుంటారు. ఇలా 'కొక్కెంలా' తగిలించుకొన్నవి ఆత్మలేని బంగారమో, స్టాక్ మార్కెట్టో, క్రికెట్టో, మని షో - అది ఏదైనా, ఎవరైనా కావచ్చు దాన్ని ప్రేమ అనలేము కదా!

ప్రేమంటే విడిగా ఎవరి పరిధి వారు ఉంచుకొని తన పరిధుల్ని విస్తరించుకోగలగడం. ప్రేమకు నిబద్ధత, విజ్ఞత అవసరం. పిల్లల్నో, భర్తనో, భార్యనో వేరుగా చూడకుండా ఎమోషనల్‌గా వాళ్ళని మనలో ఒక భాగం అనుకొని ప్రేమ పేరుతో ఊపిరాడని పరిస్థితి తీసుకెళ్ళి మనమూ, వాళ్ళూ కూడా బాధపడే స్థితికి వస్తాం. ఏ వ్యక్తి అయినా జీవితాన్ని ఒంటరిగానే ప్రారంభించి తన జీవితపు ఆధ్యాత్మిక ప్రగతికోసం ఒంటరిగానే వెళ్తుంటాడు. కానీ ఆ వ్యక్తికి సరియైన తోడుంటే; ఇద్దరూ తమ వ్యక్తిత్వాన్ని కాపాడుకొంటూ, ఒక సహకార వ్యవస్థలో ప్రేమతో వాళ్ళ జీవితాల్ని పరిపూర్ణం చేసుకొంటూ సమాజానికి ఉపయోగపడతారు.

అసలు ప్రేమ అనే సంగతి ఎలా ఉంటుంది? దాని ప్రభావం ఏమిటి? అని ఆలోచిస్తే చైనా 'తావో' ఎనర్జీ పద్ధతుల్లో ఇలా విశ్లేషిస్తారు. ప్రేమ అనేది ఒక అత్యంత సూక్ష్మమైన, హృదయానికి సంబంధించిన శక్తి. మెదడుకు దానికీ పెద్ద



సంబంధం లేదు. నిజమైన ఆర్ద్రత మనిషి లోని ఓజశక్తి హృదయశక్తి కలిసి అద్భుత మైన ప్రేమగా వ్యాపిస్తుంది. మనలో తయారయ్యే శక్తి చాలా కొంచెమే



ఖలీల్ జిబ్రాన్ వివాహబంధం మీద అన్న మాటలు ఎప్పటికీ మనం అర్థం చేసుకొని ఆచరించడానికి ప్రయత్నం చేయదగినవి...

"మీ సాన్నిహిత్యంలోనూ
కాస్త ఖాళీలుండనీ
స్వర్గలోకపు మలయ సమీరాలు
నర్తించడానికి
ఒకరినొకరు ప్రేమించండి
కానీ ప్రేమపాశాలకు
బందీలు కావద్దు.
మీ మానస తీరాల మధ్య అలలుగా
సముద్రాన్ని కదలనివ్వండి.
ఆనందంలో ఆడండి పాడండి
కానీ మీలో మీరే
ఒంటరిగా మిగలండి.
ఒకే రాగాన్ని పలికించే
వీణ తంత్రులు
కూడా దేనికవే ప్రకంపించవా!
హృదయాల్నిచ్చి పుచ్చుకోండి
కానీ పూర్తిగా సొంతం చేసుకోవద్దు
కలిసి నిలవండి కానీ
మరీ దగ్గరగా కాదు.
ఆలయ స్తంభాలు
దూరంగా నిలుచుండవా!
రెండు మహావృక్షాలు
ఒకదాని నీడలో
ఇంకొకటిగా విస్తరించగలవా!

ఉంటుంది. మన శరీరంలో ప్రతి అణువు ఆ ప్రేమశక్తి కోసం తపిస్తూ ఉంటే ఆ శక్తిని మనం ఉపయోగించుకోక యితరుల్ని ప్రేమిస్తూ ఆ శక్తిని పూర్తిగా వెచ్చించి నిస్స త్తువలోకి వెళ్ళిపోతాము. మనం ప్రేమను ఇతరుల్లో వెదుకుతూ మన ప్రేమ భావపు అవసరాల్ని వాళ్ళ ద్వారా పొందాలను కొంటూ జీవితమంతా ఎండమావుల వెంట పరిగెడుతుంటాం. వాళ్ళూ అంతంత మాత్రంగానే ప్రేమశక్తిని కలిగి మనలాంటి అన్వేషణలో ఉన్నవాళ్ళేనని తెలుసుకోము. ఆ ప్రేమశక్తి మూలం తెల్సుకుని ఆ అనం తమైన ప్రేమని మనస్సు ద్వారా చేరగలిగి ఆ శక్తిని స్వీకరించగలిగితే అద్భుతమైన ప్రేమ భావశక్తిని మన శరీరమంతా నింపు కొని దాన్ని ఇతరులకూ పంచగల శక్తి మ నకు వస్తుంది. అలా మనసులో మనం ప్రేమను పెంచుకోలేకపోతే ఉన్న కాసింత శక్తినీ కోల్పోతాం. అది ప్రేమ అనుబంధం విడిపోయేందుకు కారణం అవుతుంది'.

ఏ ఇద్దరి మధ్య అయినా ప్రేమ చిగు రించి ఆ బంధం సాగాలంటే ఇద్దరూ విడి విడిగా తమ పరిధుల్ని కొనసాగిస్తూ, గౌర విస్తూ తమలోని ప్రేమ శక్తిని పంచు కొంటూ ఆ అనుబంధాన్ని పరిపుష్టం చేసు కోగల్గాలి. ఎదుటివాళ్ళ ప్రేమించే శక్తిని ప్రశ్నించకుండా మన ప్రేమ మూలస్థానం నుంచి శక్తిని గ్రహిస్తూ మనల్ని మనం ఎదుటివారికి షరతుల్లేని ప్రేమను పంచడా నికి ప్రయత్నించాలి. ప్రేమను, అవధుల్లేని ఆత్మీయ బంధుత్వాన్ని కోరుకుంటూ వాటి కోసం వెదకని మనిషనేవాడుండడు. మన లోని శూన్యతను అలానే ఉంచుకుంటే ప్రేమని దేబరించుకొంటూ బతకడమే మిగు ల్తుంది. మన 'ప్రేమ పేదరికపు భావన' కాదా! అద్భుతమైన ప్రేమశక్తిని నీలో పెంచుకుంటే అదే ప్రేమను ఆహ్వానిస్తూ గొప్ప ఆత్మానందాన్నిస్తుంది.

**– ఎన్. శైలజ**

నాటి చతుర



నాటి నవల

ఫ్లాష్‌బ్యాక్

# హంసద్వీపం

ఆర్. కరుణ కుమారి

మే 1979: సంపుటి: 2 సంచిక: 4

ఇది కాలాన్ని నెమరు వేసుకునే శీర్షిక. పాఠకుల కోసం చతుర తొలినాళ్ళను పరిచయం చేసే శీర్షిక. కాలగమనంలో మొన్న నిన్నటి పొరల్లో ఒదిగిపోయిన నవలాహారాల్ని ఒక్కటొక్కటిగా ఇతివృత్తం, కథనం వగైరా అంశాలతో రేఖా మాత్రంగా పరిచయం చేయడం ఈ శీర్షిక లక్ష్యం. గతంలో ఏ నెలలో ప్రచురించిన నవలను అదే నెలలో పరిచయం చేయడం జరుగుతుంది. 1979వ సంవత్సరం మే నెల **చతురలో** ప్రచురించిన ఆర్. కరుణ కుమారి నవల **'హంసద్వీపం'** పరిచయాన్ని ఈ సంచికలో ఇస్తున్నాం.

తెలుగులో బాలల కోసం రాసిన నవలలు గానీ, బాలలే ముఖ్య పాత్రలుగా రాసిన నవలలుగానీ చాలా తక్కువ. ఈ లోపాన్ని దృష్టిలో ఉంచుకొని అంతర్జాతీయ బాలల సంవత్సరం సందర్భంగా 'చతుర' సమర్పించిన ప్రత్యేక కానుక ఈ ఫాంటసీ నవల.

ఇక నవలలోనికి వెళ్తే: పధ్నాలుగేళ్ళ అరుణ తల్లిదండ్రులు చిన్నప్పుడే చనిపోవడంతో మేనత్త రాజేశ్వరి సంరక్షణలో పెరుగుతుంది. మేనత్తంటే అరుణ తండ్రికి స్వంత చెల్లెలేమీ కాదు. రాజేశ్వరికి ముప్పై ఏళ్లు. కఠిన హృదయురాలు. అరుణను సరిగా చూడదు. ఆమె భర్త ముప్పై నాలుగేళ్ళ కామేశ్వరరావు జల్సారాయుడు. పనీ పాటా లేకుండా రోజంతా ఓ సైకిలేసుకుని బలాదూరు తిరుగుతుంటాడు. అతడికి నాటకాల పిచ్చి. తను ఏనాటికైనా ఈ నాటకాల మాధ్యమంగానే గుర్తింపు పొంది సినీ హీరోనైపోవాలని కలలు గంటుంటాడు.

ఓ రోజు జ్వరంగా ఉందని రాజేశ్వరి ఉదయం ఎనిమిదైనా నిద్ర లేవదు. "దేవుడా! మా అత్తకు ఇంకో నాలుగు రోజుల వరకూ జ్వరం ఉండేలా చూడు. నా ఆస్తి నా చేతుల్లో పడగానే నీకు నాలుగు కొబ్బరి కాయలు సమర్పించుకుంటాను" అనుకుంటుంది అరుణ లోలోపల. అరుణకి మైనారిటీ తీరి మేజర్ అయితే తమ గతేం కాను? అనుకుంటూ ఆస్తి దక్కించుకోవటానికి ఏదో ఒకటి చేయమని భర్తను ఒత్తిడి చేస్తుంది రాజేశ్వరి.

మధ్యాహ్న భోజనం కాగానే అరుణ ఇల్లు దాటి రెండు ఫర్లాంగుల దూరంలోని చిలుక సరస్సుకు వెళ్తుంది. ఆ సరస్సులో రెండు ఫర్లాంగులు పడవలో ప్రయాణిస్తే "హంస ద్వీపం" వస్తుంది.

ఆ ద్వీపంలో అరుణ తాతగారు బతికి

ఉన్న రోజుల్లో ఓ విలాసగృహం కట్టించారు. కనుక ఇప్పుడది అరుణదే! పైకి పాడుబడిన భవనంలా ఉంది. దెయ్యం అందులో ఉందని చాలామంది భయపడతారు. హంస ద్వీపం చేరగానే మెరుస్తున్న పెద్ద గోళం కనిపించింది. అందులో నుంచి పది గజాల పొడవుండి సూటూ, బూటూ వేసుకుని ఉన్న వ్యక్తి కిందికి దిగి అరుణను పలకరిస్తాడు. తన పేరు ఆర్టిమస్ అనీ, తాను అంగారక గ్రహవాసిననీ చెబుతాడు. తాము అరుణకు చెందిన భూమి మీద దిగినందుకు ఏదైనా సహాయం చేస్తానంటాడు. ద్వీపం మధ్యలో ఉన్న మేడ మెట్ల మీద కూర్చుంటుంది అరుణ. అరుగు మీది పెద్ద స్తంభంపై ఒక అల్చిప్ప కనిపించగా చేతుల్లోకి తీసుకుంటుంది అరుణ. అందులో ఏదో పురుగులా ఉన్నట్లుందనుకుని దృష్టి సారిస్తుంది. అది మనిషే. అంగుళం పొడవున్న పాపాయి. ఐదంగుళాల పొడవున్న మనిషి గుండుసూది లాంటి ఆయుధంతో అరుణ కాలిపై గీరుతుంటుంది.

ఆమె ఆ పాప తల్లి. ఆల్చిప్పను అరుణ తీసుకున్నందుకు ప్రతిఘటిస్తోంది. తన జేబు రుమాల్లో తల్లినీ, ఆల్చిప్పలోని కూతురునూ మూటగట్టి తనతో తీసుకువెళ్తుంది అరుణ. పదిగజాల అంగారక గ్రహవాసి ఆర్టిమస్‌నూ, ఆరు అంగుళాల అనాగరికులనూ చూసిన ఉత్సాహం అరుణలో పెరుగుతుంది.

అరుణకు అంత ఆస్తి ఉన్నా వాళ్లత్త కొత్త బట్టలు కుట్టించదు. అడిగితే గదిలో బంధిస్తుంది. మర్నాడు కూడా రాజేశ్వరి జ్వరం తగ్గలేదు. వంట మనిషి పేరమ్మకు చెప్పి తన గదిలోని టేబుల్ సొరుగులో దాచిన తల్లినీ, పిల్లనీ రుమాలులో చుట్టి మాధవయ్య మాస్టారు ఉండే పల్లెకు వెళ్తుంది అరుణ. తను హంసద్వీపం వెళ్లటం వగైరా విశేషాలు చెబుతుంది. ఆయన సలహా మేరకు అరుణ హంసద్వీపానికి వెళ్లి మెట్లు ఎక్కి అరుగు మీద నిలబడి చేతిలో ఉన్న అంగుళం పాపా యినీ, తల్లినీ అరుగు మీద జాగ్రత్తగా దించుతుంది.

తిరిగి వెళ్ళిపోదామనుకుని రోదసీ నౌక స్తంభంపై చెయ్యి వెయ్యగానే ఎక్కడో గంటలు మోగుతాయి. మరుక్షణంలో గోళం తలుపు తెరుచుకుని గుమ్మంలోనుంచి పది గజాల ఆల్టిమస్ వచ్చి అరుణను ఆహ్వానిస్తాడు. అతనితో వెళ్తుంది. తన భార్య యూలీని పరిచయం చేస్తాడు. తనకంటే ఎంతో పొడుగ్గా ఉన్నవారిని తలెత్తి మరీ చూసి మాట్లాడవలసి వస్తోంది. యూలీ ఎంతో స్నేహంగా అరుణను పలకరిస్తుంది. సదా అరుణకు సాయం చేస్తామంటాడు ఆర్టిమస్.

"కథలంటే నాకెంతో ఇష్టం. నాకో బుల్లి కథ చెప్పవా?" అని యూలీ, ఆర్టిమస్‌లు అడగ్గా జర్మన్, ఫ్రాన్స్‌ల యుద్ధం సందర్భంగా జరిగిందని చెప్పే ఓ సరదా కథ చెప్పి వాళ్ళను నవ్విస్తుంది అరుణ. ఆ తరువాత ఆరంగుళాల మనుషులతో తనకు స్నేహం చేయాలనుందనీ, వారి గురించిన వివరాలు చెప్పమనీ అడగ్గా, "వాళ్ళను లిల్లీపుట్స్ అంటారు. వాళ్ళది "బ్లెఫస్కు" ద్వీపం. మనుషుల్లాగా వాళ్ళూ ఎంతో నాగరికత సాధించారు. వారికో చక్రవర్తి ఉండేవాడు. పద్దెనిమిదవ శతాబ్దపు తొలి రోజుల్లో గలివర్ అనే నావికుడు ఆ ద్వీపానికి వెళ్లాడు. అతని తరువాత బిడెల్ అనే మరో నావికుడు వెళ్ళి లిల్లీపుట్లను బంధించి తెచ్చి ఎక్కువ ధరకు అమ్ముకున్నాడు. భారతీయ రాజు కూడా అలా కొంతమంది లిల్లీపుట్లను కొన్నాడు. వారి సంతతే నీవు చూసినవాళ్లు" అని చెబుతాడు ఆర్టిమస్.

ఇంటికి వచ్చిన అరుణను చెడామడా తిట్టి తోటకు నీళ్ళు పెట్టిస్తుంది మేనత్త రాజేశ్వరి. ముప్పై బాల్చీల నీళ్ళు నూతిలో నుండి తోడే సరికి చేతులు నొప్పులు పెడతాయి. మర్నాడు ఆర్టిమస్, యూలీలు తనకిచ్చిన బంగారు నాణాన్ని మాధవయ్య మాస్టారుకిచ్చి అమ్మించి ఆ డబ్బుతో లిల్లీపుట్లకు అవసరమయ్యే

గుండుసూదులు, మేకులు, ఇతర ఆహార పదార్థాలు, చాక్లెట్లూ తెప్పించి ఓ డబ్బాలో సర్దుకుని హంసద్వీపానికి వెళ్తుంది.

అర్టిమస్ దగ్గర లిల్లీపుట్ల భాషలో కొన్ని వాక్యాలు నేర్చుకుని ఆరుగుమీదికి వెళ్ళి లిల్లీపుట్లను బయటకి రమ్మని పిలుస్తుంది. ఆ శబరజాతి మతాధికారి బుయ్యా, శబరులకు పెద్ద గొమాంగ్ బయటికి వచ్చి పరిచయం చేసుకుంటారు. అరుణ కోరిక మేరకు వారి జాతిలో వారందరినీ పరిచయం చేస్తారు బుయ్యా, గొమాంగ్‌లు. అరుణ తను తెచ్చిన సామాగ్రి అందరికీ పంచి పెడుతుంది. అందరూ సంతోషించి అరుణను ఎంతో గౌరవంగా చూస్తారు. మర్నాడు "అరుణ కుమారీ దేవి గారికి స్వాగతం" అని ఆహ్వానించి బంగారు కత్తిని అరుణకు కానుకగా ఇచ్చి విందు ఏర్పాటు చేస్తారు. ఆ తరువాత పడవపై వెళ్ళబోతున్న అరుణను అంగారక గ్రహవాసుడైన అర్టిమస్ పిలవడంతో రోదసీ నౌక వైపు వెళ్తుంది అరుణ. వారి కోరిక మేరకు ఓ కథ చెబుతుం ది. లిల్లీపుట్లు తనకిచ్చిన ఆతిథ్యం గూర్చి చెప్పి తనకు కానుకగా ఇచ్చిన ఖడ్గాన్ని చూపిస్తుంది. ఆ తరువాత "శ్రీనిలయం" చేరేసరికి రాత్రి ఎనిమిదవుతుంది.




శబరులిచ్చిన నవరత్న ఖచిత ఖడ్గాన్ని దాచటం ఓ సమస్యవుతుంది. గోమాంగ్ 'కుర్‌కుర్'కూ, మహావీరుడైన 'పొట్టిడు'కు పెళ్ళి నిశ్చయిస్తారు. అరుణ అందరికి సరిపడే ఆహారం తీసుకెళ్తుంది. ప్రత్యేకంగా పెళ్ళికొడుక్కు సూటు కుట్టించుకొచ్చి బహుకరిస్తుంది. చిన్న టార్చిలైటు అతనికి బహుమతి చేస్తుంది. కామేశ్వరరావు గదిలోని రెండు విస్కీ సీసాలు తెచ్చి శబరులకిచ్చి బేసిన్‌లో పోయిస్తుంది. ఆ 'విస్కీ చెరువు' చుట్టూ ఆ లిల్లీపుట్లు పోగై చిన్నపాత్రలను ముంచి తాగుతారు. పెళ్లి వేడుకలు ముగిసేసరికి తెల్లవారుతుంది.

శబరులిచ్చిన నవరత్న ఖచిత ఖడ్గం రాజేశ్వరి కంటపడగా అరుణను నిలదీస్తుంది. మాధవయ్య మాస్టారి సలహా మేరకు అది తనకు నేలమాళిగలో దొరికిందని చెబుతుంది అరుణ. ఆమె మాటలు నమ్మక రాజేశ్వరి, ఆమె భర్త అరుణను గదిలో బంధిస్తారు. రోజంతా తిండి ఉండదు. ఆలోచిస్తున్న అరుణకు కిటికీ దగ్గర సందడి వినిపిస్తుంది. ఆరంగుళాల పొట్టిడు, కుర్‌కుర్ తదితరులంతా వచ్చి ఓ బోర్నవిటా డబ్బాలో యాపిల్, అరటి పండు మొదలైనవి పెట్టి సన్నని దారాలతో ఇరవై మంది డబ్బాను పైకిలాగి అరుణకు అందిస్తారు. అరుణకు ఆ పూట ఆహారం సమస్య తీరుతుంది. వచ్చిన శబరులందరికీ తన గదినీ, పుస్తకాల్ని, దుస్తుల్ని, పెన్నులను, పెన్సిళ్ళను చూపిస్తుంది అరుణ. అంతా ఆశ్చర్యంగా చూస్తుంటారు. వాళ్ళిచ్చిన కత్తిని చూసిన తన అత్త వివరాలడిగి తనను గదిలో

బంధించిందని వాళ్ళకు చెబుతుంది అరుణ. అంతా శ్రద్ధగా వింటుండగా తలుపు తెరుచుకుని రాజేశ్వరి వస్తుంది. "పారిపొండి... పారిపొండి..." అని అరుణ అరుస్తుంది. అందరూ పారిపోతారు గానీ బుయ్యా, పొట్టేడు, కుర్‌కుర్ కామేశ్వరరావుకు దొరికిపోతారు. చిన్న చిలకపంజరంలోకి వారిని నెట్టి బైట గొళ్ళెం పెట్టి తాళం వేస్తాడు కామేశ్వరరావు.

మర్నాడు ఆ పంజరాన్ని తీసుకుని విశాలపట్నానికి వెళ్తాడు కామేశ్వరరావు. ఈ పొట్టి మనుషులని సినిమాల వారికి, నాటకాల వారికి అమ్మి లక్షల డబ్బు సంపాదించవచ్చని పథకం వేస్తాడు రాజేశ్వరితో కలిసి.

విశాలపట్నానికి అతడు పంజరంతో సహా బయల్దేరుతుండగా రహస్యంగా శబరుల సైన్యాధిపతి ఢింగరీ వెంబడిస్తాడు. రాత్రి పూట కామేశ్వరరావు, అతడి మిత్రుడు రాజాచారి చిత్తుగా తాగి మత్తుగా నిద్రిస్తుండగా అతడి జేబులో నుండి తాళంచెవి తీసుకుని పంజరానికి వేసిన తాళం తీస్తాడు. ముగ్గురు మిత్రుల్నీ విడిపించుకుని పారిపోతాడు. కామేశ్వరరావు మర్నాడు లబోదిబోమంటూ శ్రీనిలయానికి వచ్చి పొట్టిమనుషులు పారిపోయారని చెబుతాడు. భర్తని చీవాట్లేసి అరుణను బుజ్జగించి వాళ్ళెక్కడుంటారో చెప్పమని అడుగుతుంది రాజేశ్వరి. అరుణ చెప్పడానికి నిరాకరిస్తుంది. అంతలో అరుణ కిటికీ దగ్గర శబరుల ఉపసైన్యాధిపతి బుర్రిడు ఆధ్వర్యంలో చాకులూ, మేకులు, విల్లమ్ములు, గుండుసూదులు, బల్లేలు మొదలైన ఆయుధాలను పట్టుకున్న వందలాదిమంది శబర సైన్యం రాజేశ్వరికి వ్యతిరేకంగా నినాదాలు చేస్తుంటారు. వాళ్లను రాజేశ్వరి చూసి భర్తకు చెబుతుంది. అరుణ హెచ్చరికతో అంతా పారిపోతారు. రాజేశ్వరి కోపంతో అరుణ జుత్తు పట్టుకుని నేలమాళిగ తలుపు తెరిచి లోపలికితోసి బంధిస్తుంది. రెండు రోజులు గడుస్తాయి. తిండి పెట్టదు.

ఆరంగుళాల మనుషులైన శబరులు, మాధవయ్య మాస్టారు దగ్గరికి వెళ్లి అరుణ దురవస్థల గురించి వివరిస్తారు. మాధవయ్య వెంటనే వాళ్లతోపాటు బయలుదేరి అతిథిగృహం చేరుకుంటాడు. నేలమాళిగ తలుపుకి ఉన్న అడ్డు గడియను తీసి లోపలికి వెళ్లి ఓ స్తంభానికి కట్టేసి ఉన్న అరుణను చూసి ఆమె కట్లు విప్పుతాడు. మాధవయ్యనూ, శబరులనూ చూసి అరుణ సంతోషిస్తుంది. మాస్టారు అరుణకు మజ్జిగన్నం తినిపిస్తాడు. అంతలో అక్కడికి రాజేశ్వరి, కామేశ్వరరావు వస్తారు. మాధవయ్య మాస్టారినీ, అరుణనూ తిట్టి తలుపులు మూసి పెద్ద తాళం వేసి వెళ్లిపోతారు.

"మహోఘనత వహించిన అరుణకుమారి దేవిగారూ! మీరు బాధపడకండి. మా కోసం మీరిన్ని కష్టాలు పడుతున్నారు. మిమ్మల్ని రక్షించడానికి మా శబర జాతి యావత్తూ ప్రాణాలు ధారపోస్తాం" అంటారు శబరులు. తలుపులు, తాళం తీయటం ఎలాగా అని ఆలోచించి ఆ శబరులను ఆర్టిమస్ దగ్గరికి పంపిస్తుంది అరుణ. ఆర్టిమస్ వచ్చి తాళం పగలగొట్టి తలుపులు తెరిచి అందరినీ విముక్తుల్ని చేస్తాడు. ఆ తరువాత అరుణకు మాధవయ్య మాస్టారూ, వంటమనిషి పేరమ్మా గార్డియన్లుగా ఉంటారు. రాజేశ్వరినీ, కామేశ్వరరావునూ, రాజాచారినీ తమతోపాటు శుక్రగ్రహానికి తీసుకెళ్లిపోతాడు ఆర్టిమస్. శబరులను చంద్రలోకానికి పంపించి అక్కడ వారికి నివాసం ఏర్పాటు చేస్తాడు.

అరుణకు పదిహేనేళ్లు వస్తాయి. కారులో హైస్కూల్‌కు వెళ్లి చదువుకుంటుంది. వీధి వీధికీ ఒక నరరూప రాక్షసుడు ఉండే ఈ మానవలోకంలో తనకు ముందు ముందు ఏ కష్టాలు రానున్నాయోనని, ఆమె ఎప్పటికప్పుడూ తనను తాను హెచ్చరించుకుంటూ ఉంటుంది. ✦



మార్చి 2006 'చతుర' నవల

# సృష్టిలో తీయనిది

పై సమీక్షలు



## తృప్తి కలిగింది

(మొదటి బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)

సృష్టిలో తీయనిది, అంతరాలు ఎరుగనిది, విడదీయాలన్నా విడదీయలేనిది 'స్వచ్ఛమైన' స్నేహమొక్కటే! స్నేహానికి లింగభేదం, వయోభేదం లేదు మరి. స్నేహమనేది రెండు హృదయాల మధ్య సున్నితమైన బంధం. దాన్ని ఎంత అపురూపంగా కాపాడుకోగలిగితే అంత ఎక్కువ కాలం నిలుస్తుంది. ఆ స్నేహ సౌరభాలతో జీవితమే పునీతమౌతుంది. అలాంటి స్నేహ మాధుర్యాన్ని,ఆత్మీయతానురాగాల్ని మాలతి, స్వాతి పాత్రల ద్వారా పాఠకుల గుండెల్లో నింపారు 'సృష్టిలో తీయనిది' రచయిత్రి.

ఎక్కడా విసుగనిపించకుండా ఆద్యంతం ఆసక్తిగా సాగే ఈ అచ్చతెలుగు నవలలో ముఖ్య పాత్రలు మాలతి, స్వాతిల స్వభావాలను రచయిత్రి చక్కగా మలిచారు. ఇద్దరిదీ ఒకటే మాట. ఒకటే బాట. ఎవరికే కష్టమొచ్చినా, సుఖమొచ్చినా పంచుకుంటారు. ఒకరికోసం ఒకరు అన్నట్లు బతుకుతారు. అయితే మనమొకటి తలిస్తే దైవం వేరొకటి తలుస్తుందన్నట్లు, సంతోషంగా పెళ్ళిళ్లు చేసుకుని కాపురాలకి వెళ్లాల్సిన వారి జీవితాలు విధి ఆడిన నాటకం వలన మలుపు తిరుగుతాయి. ఆ తర్వాత అమ్మమ్మ, తాతయ్యల మాటలు విన్న స్వాతి, తనకు ఇష్టమున్నా సూర్యం మావయ్యతో పెళ్లికి నిరాకరిస్తుంది. అభద్రతా భావానికి లోనవుతుంది. మాలతికి పెళ్లి నిశ్చయమైనా స్నేహితురాలు పెళ్లి చేసుకుంటేగానీ తను పెళ్లి చేసుకోననటం, వారి స్నేహానికి అద్దం పట్టింది. స్నేహితురాలిలో అభద్రతాభావాన్ని పోగొట్టి, ఆమె కోసం మాలతి పడిన తపన హర్షణీయం. చక్కని కథనంతో గుండెలకు హత్తుకునేలా ముగింపునిచ్చిన రచయిత్రి పి. హైమవతిగారు నిజంగా అభినందనీయులు. మంచి నవల చదివాననే తృప్తి కలిగింది.

– వాడపర్తి రమణ, గొల్లలవలస

## స్నేహ మాధుర్యానికి దర్పణం (రెండవ బహుమతి రూ. 75/-లు పొందిన సమీక్ష)

నిజమైన స్నేహం అజరామరం. అది కొండశిలల నడుమ ప్రవహించే సెలయేరులా విపత్కర పరిస్థితులలో సైతం ముందుకి సాగిపోతుంది. ప్రేమానురాగాలూ, స్నేహం అనేవి కఠిన పరీక్షలో నెగ్గినప్పుడే అవిచ్ఛిన్నంగా కొనసాగుతాయి. స్వచ్ఛత నిండిన హృదయాలే అటువంటి స్నేహాన్ని పొందగలవు. విడదీయలేని బంధమేదో ఆ యిరువురిని జీవితాంతం ఒకటిగా నడిపిస్తుంది. అలాంటి విలువను తెలియపర్చే మంచి నవల 'సృష్టిలో తీయనిది'.

స్వాతి- మాలతిల స్నేహం ఎన్నో ఆటు-పోట్లను తట్టుకుని అజేయంగా నిల్చింది. చిన్ననాటి చిలిపికయ్యంతో మొదలైన వారి

స్నేహం విపత్కర పరిస్థితులలో సైతం అవిచ్ఛిన్నంగా కొనసాగింది. ఎవరూ విడదీయలేని బంధం వారిరువురిదీ. ఒకరికోసం ఒకరన్నట్లు త్యాగనిరతితో స్నేహ మాధుర్యాన్ని చవిచూపించారు. అలాంటి స్నేహమే ఎవరు కోరుకునేదైనా.

రంగారావు ఆకస్మిక మరణంతో మొదలైన సంఘర్షణ వారి స్నేహాన్ని విడదీయలేకపోయింది. రాజయ్య, శాంతల వంటి స్వార్థపరులు సమాజంలో కోకొల్లలు. కానీ సూర్యం, చిరంజీవిల వంటి ఆదర్శ యువకులుంటే, డబ్బుకోసం అమ్ముడుపోయే వాళ్లలా కాకుండా వరకట్న సమస్య దానంతటదే రూపుమాసిపోతుంది. కొన్ని కుటుంబాల్లో స్వాతిలా బరువు బాధ్యతలు మీద వేసుకుని, కొవ్వొత్తిలా కాలిపోయే జీవితాల్ని, మంచి మనసుతో యువకులు ముందుకు వచ్చి ఆదుకోవాలి. చక్కటి కథావిధానంతో ఆద్యంతం ఆసక్తికరంగా సాగి, ఆలోచింపచేసేదిగా ఉంది నవల. టైటిల్ అమోఘం.

**– కె.విజయ కుమార్, నర్సాపురం**

## ప్రతివారూ చదవాల్సిన నవల

**(మూడవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)**

ప్లాస్టిక్ నవ్వులు, పాలిథీన్ బంధాల్తో స్నేహం చేసే నేటి తరానికి స్వాతి, మాలతిల స్నేహంతో స్నేహ సౌరభాల గుబాళింపు చూపే ప్రయత్నం జరిగింది సృష్టిలో తీయనిది నవలలో.

ఒక వ్యక్తికి స్నేహం, త్యాగం, ఆదర్శం, కష్టపడే తత్వం, పట్టుదల, అంకితభావం... ఇలా అన్నీ జత కలిస్తే తప్ప అతను ఉన్నతస్థాయికి చేరుకోలేడు. అలాంటి పాత్రలో స్వాతి, ప్రాణాలిచ్చే స్నేహితురాలిగా మాలతి బాగా రాణించారు. కానీ, కేవలం స్త్రీ పాత్రల చుట్టూ తిరుగుతూ, మగాళ్లందర్నీ ఒకేగాటన కట్టే పాత్రలు సృష్టించి స్త్రీవాద సాహిత్య మేళవింపు చేశారా రచయిత్రి అనిపించక మానదు. పెళ్లి పెళ్లంటూ గోల చేసే సూర్యానికి, వద్దు వద్దంటూ ఆదర్శాలు వల్లెవేసే స్వాతికి మధ్య సాగదీసిన బంధం కొంత విసుగనిపించినా, తండ్రి పోయాక కుటుంబ పరిస్థితి బాగా లేకపోయినా తమ్ముడిని డాక్టర్ని చేయడం కోసం పెళ్లి వాయిదా వేసే స్వాతికీ, పెళ్లి వాయిదా కోసం ఉద్యోగానికి రాజీనామా చేసి రీసెర్చి అంటూ ఢిల్లీ చేరిన సూర్యానికి మంచి జోడి. స్వాతి పాత్ర సమాజంలో ఇంకా పూర్తిగా తొలగిపోని మూఢాచారాలకు నలిగిపోయే సగటు భారతీయ యువతకు పాత్రోచిత సాక్ష్యం. పెళ్లి హడావిడిలో పర్సు డ్రామా ఆడి, 'సందట్లో సడేమియా'లా రంగప్రవేశం చేసిన చిరంజీవి, మాలతిని చూడగానే కట్నం లేకుండా పెళ్లి చేసుకోవడం, తల్లిదండ్రుల్ని ఒప్పించడం, వాస్తవ ప్రపంచంలో కొంత వాస్తవ దూరమే. అలా అని అలాంటి వారు లేరనీ చెప్పలేం. ఇది ప్రతి ఒక్కరూ చదివి తీరాల్సిన నవల.

**– లలితా విజయ్ కుమార్, హైదరాబాద్**

## ఆద్యంతం... (నాలుగవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)

అసలైన స్నేహానికి సిసలైన నిర్వచనాన్ని ఇచ్చే సమర్థవంత యత్నం చేస్తూ సృష్టిలో తీయనిది..'నవలను ఆద్యంతం శ్రద్ధగా చదివింప చేయగలిగారు రచయిత్రి.

నవల సాదాసీదాగా కన్పించినా స్నేహం ప్రధాన కథావస్తువుగా, ప్రేమ, పెద్దలు కుదిర్చిన పెళ్లిళ్లు, కుటుంబ-మానవ సంబంధాలు, నైతికత, వ్యక్తిత్వాలు, మోసాల గురించి క్లుప్తంగానే అయినా... విపులంగా చర్చ జరిగినట్లు అనిపిస్తుంది.

స్వాతి, మాలతిల స్నేహం అతిగా అనిపించినా... వారిది బాల్యం నుంచి యవ్వన,

ఆపై దశల స్వార్థరహిత చెలిమి! ఇంకా... అపుడపుడూ వీరి స్నేహం పరిధులు దాటుతున్నట్లుగా పాఠకులు భావించినప్పుడల్లా పాత్ర ద్వారా రచయిత్రి వివరణ ఇప్పించగలిగారు. పసిపాప మనస్తత్వం కలిగిన మేనకోడలు 'స్వాతి' కోసం సూర్యం అన్నేళ్లు నిరీక్షించటం, రక్తసంబంధాలు, మానవత్వాల ఉనికిని చాటిచెబుతాయి. ఇక... తల్లిచాటు మొగుడు సత్యమూర్తి విమల ఆత్మహత్యాయత్నం తర్వాతనైనా మారటం ముదావహం. శాడిస్టు అత్తలకు, చవట మొగుళ్లకు ఈ ఉదంతం కొంతయినా కనువిప్పులా పని చేయాలి మరి.

ఈ 'అతి-నవీన' సమాజంలో ఆర్థిక లావాదేవీల్లో ఎంతటి జాగ్రత్త అవసరమో రంగారావు విషాద గాథ చెప్పకనే చెబుతుంది.

స్నేహం ఇతివృత్తంగా సిన్మాల్లో, నవలల్లో అధికశాతం మగపాత్రల హీరోయిజం గోచరిస్తుంది. ఇక్కడ... స్వాతి, మాలతిల సామాజిక, ఆర్థిక పరిధుల్లో వారి స్నేహం సాహసోపేతంగా, సుఖాంత పరిమళాలను వెదజల్లి పాఠకులకు తృప్తినిచ్చింది.

**ఎమ్. రమేష్‌యాదవ్,** కరంజి.

## సరికొత్త భాష్యం (ఐదవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)

స్నేహ సంద్రంలో ఓలలాడిన ఇద్దరు స్నేహితురాళ్ల మధ్య గల స్నేహబంధాన్ని 'సృష్టిలో తీయనిది'గా మన కళ్లముందుంచి, స్నేహంలోని తీయదనాన్ని అందులోనూ చిన్ననాటి స్నేహంలోని మాధుర్యాన్ని గుర్తు చేసుకునేలా చేశారు రచయిత్రి హైమవతి.

మాలతి, స్వాతిల మధ్య చిన్ననాడు కయ్యంతో వికసించిన స్నేహ కుసుమం వారి వయసుతో పాటు పెరిగి, ఇద్దరూ ఒకే సారి పెళ్లిచేసుకోవాలనుకోవటం, విధివశాత్తూ రంగారావు చనిపోయి స్వాతి పెళ్లి ఆగిపోవటం హృదయ విదారకంగా ఉంది.

ఇద్దరు మిత్రురాళ్ల మధ్య స్నేహబంధాన్ని ప్రశంసనీయంగా తీర్చిదిద్దిన రచయిత్రి వారి వివాహ విషయాల్లో మాత్రం కొంచెం సినిమాటిక్‌గా నడిపించినట్లు అనిపిస్తుంది.

స్వాతి, సూర్య పాత్రల మధ్యగల సన్నివేశాల కన్నా, విమల, ఆమె జీవితంలోని పాత్రలు, సంఘటనలు వాస్తవానికి దగ్గరగా సాగుతూ సహజంగా జీవించాయి. అలాగే కమల, మాలతి మధ్యగల అక్కాచెల్లెళ్ల అనుబంధాన్ని కూడా అందంగా, సహజంగా చిత్రీకరించారు.

భావాలు కలిసి, అభిరుచులు ఏకమైన స్వాతి, మాలతిల స్నేహం అనుభూతుల కలబోతలో "ఫ్రెండ్‌షిప్ ఈజ్ రైన్‌బో బిట్వీన్ టూ హార్ట్స్" అన్న మాటల్ని నిజం చేస్తూ కొనసాగిన తీరును స్నేహితురాళ్లున్న ప్రతిఒక్కరు, స్నేహం చేయాలనుకునే ప్రతి ఒక్కరు చదవాల్సిన రచన ఇది. స్నేహానికి సరికొత్త భాష్యం చెప్పిన నవల 'సృష్టిలో తీయనిది'.

**- యం.డి. సలీమున్నీసా,** నెల్లూరు

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 23730328, Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Complex, Somajiguda, Hyderabad. Tel: 23318181, 23398787; Visakhapatnam: 2552211; Vijayawada: 2476685; Tirupati: 275757; Anantapur: 273444; Karimnagar: 223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 277438; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 22819557; Chennai: 28232390; Bangalore: 25583804. & www. eenadu .net

# ప్రకృతి తీర్చిన ఆకృతి



ఔరా అన్పించే ఈ కళాఖండం ఏ కుంచెనుంచో, ఉలినుంచో రూపం పోసుకున్నది కాదు. ప్రకృతి అద్భుత సృష్టి ఇది. అమెరికా దక్షిణ ప్రాంతంలోని న్యూమెక్సికోలో ఎడారి పర్వతాల అంతర్భాగంలో పోత పోసుకున్న జిప్సం స్తంభాలివి. లెఘుగిల్లా కేవ్‌గా వ్యవహరిస్తున్న ఒక గుహలో భూ ఉపరితలం నుంచి దాని చూరు వరకు పాకిన వీటి ఎత్తు 50 అడుగులు. భూగర్భంలోని చమురు నిల్వల నుంచి వెలువడే వాయువు సున్నపు రాయిపై చూపించే ప్రభావం కారణంగా లక్షలాది సంవత్సరాల వ్యవధిలో ఈ జిప్సం స్తంభాలు ఏర్పడ్డాయి.

